శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః



శ్రీరంగామృతకవి (తిరువరంగత్తముదనార్) ప్రణీతమైన

ప్రపన్న గాయత్రి అనే

# ఇరామానుశనూత్రన్దాది

(శ్రీ ఉ.వే. అభినవదేశిక, ఉత్తమూర్, తిరుమలై నల్లాన్ చక్రవర్తి వీరరాఘవాచార్యస్వామి అనుగ్రహించిన ప్రబంధరక్ష - అనే వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదంతో కూడినది.)



అనువక్త

డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు

సంపాదకుడు:

ఈయుణ్ణి అనంత రంగ రామన్





**శ్రీ అభినవ దేశిక ఉత్తమూర్ తిరుమలై నల్లాన్ చక్రవర్తి వీరరాఘవాచార్య స్వామివారు**



## ప్రబంధ రక్షా వ్యాఖ్యానాన్ని రచించిన

# శ్రీ అభినవ దేశిక ఉత్తమూర్ తిరుమలై నల్లాన్ చక్రవర్తి వీరరాఘవాచార్య స్వామివారి వైభవ సంగ్రహం

జగత్ప్రసిద్ధిని పొందిన శ్రీమదుభయవేదాంత ప్రతిష్ఠాపనాచార్యులైన శ్రీఉత్తమూర్ స్వామివారు తమిళనాడులోని శ్రీమధురాంతకానికి తర్వాత ఉండే ఉత్తమనల్లూర్ అనే అగ్రహారంలో శ్రీచక్రవర్తి ఆచార్యులని పిలువ బడే శ్రీనివాసరాఘవాచార్యులవారికి కుమారులై 1896వ సంవత్సరంలో అవతరించారు. మధురాంతకంలో ప్రసిద్ధి చెందిన తర్క పండితులై వేంచేసి ఉండే స్వచ్ఛందం శ్రీనివాసాచార్యుల వద్ద తర్కశాస్త్రాన్ని యథాక్రమంగా అభ్యసించి, తిరువైయాఱు సంస్కృత కళాశాలలో పరీక్షలో ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులై, అక్కడే కొంతకాలం ఉపాధ్యాయులుగా వేంచేసి ఉన్నారు. తర్వాత తిరుపతి సంస్కృత కళాశాలలో న్యాయమీమాంసా శాస్త్రాధ్యాపకులై చాలాకాలం వేంచేసి ఉండి, అనేక విద్వాంసులను తీర్చిదిద్ది విశిష్టాద్వైత సంప్రదాయానికి కానుకగా ఇచ్చారు

విశ్వవిఖ్యాతులై, జ్ఞానవైరాగ్యానుష్ఠాన శీలురై, సిద్ధాంతస్థాపనకోసం లెక్కలేనన్ని గ్రంథాలను అనుగ్రహించినవారై, పలు విద్వాంసులైన శిష్యులను పొందిన పరమహంసేత్యాది శ్రీమత్కోళియాలమ్ స్వామి అని పిలువబడే శ్రీరంగరామానుజ మహాదేశికుల శ్రీచరణాలను ఆశ్రయించి, భగవద్రామానుజ దర్శనాన్ని పరిపూర్ణంగా అభ్యసించి, ఆ స్వామివలెనే తాముకూడా దర్శనానికి సంబంధించి లెక్కలేనన్ని (శతాధిక) గ్రంథాలను రచించి, ప్రచురించి, సచ్ఛిష్యులకు ప్రవచనం చేస్తూ, చెన్నై నగరం మాంబలంలో పరమపదించేవరకు వేంచేసియున్నారు.

ద్రావిడ వేదమైన ఆళ్వార్ల దివ్యప్రబంధాలన్నిటికి ప్రబంధరక్ష అనే వాఖ్యానాన్ని వీరు రచించారు. శ్రీ యామునులు, శ్రీరామానుజులు, శ్రీవాత్స్యవరద గురువులు, శ్రీవేదాంత దేశికులు మొదలైన పలువురు పూర్వాచార్యులు రచించిన గ్రంథాలను దేనిని విడువకుండా వ్యాఖ్యానించి ప్రకాశింపజేశారు. న్యాయ, మీమాంసా, వేదాంత శాస్త్రాలను ప్రవచనం చేయడంలో వీరికి మించినవారు లేరు.

తర్కార్ణవ, పండితరత్న, పూర్వోత్తర మీమాంసా ప్రదీప, ఉభయ మీమాంసా వల్లభ, అభినవ దేశిక - ఇత్యాది పలు బిరుదాలను స్వామికి సమర్పించి శ్రీవైష్ణవలోకం కృతార్థమైనది. ఇంతేగాక, వీరు భారత రాష్ట్రపతి పురస్కారాన్ని కూడా క్రీ.శ.1960లో పొందారు.

ఉదయనాచార్యుని న్యాయకుసుమాంజలికి వీరు తమ చిన్న తనంలోనే వివరంగా వ్యాఖ్యను రచించి, ప్రకాశింపజేసి ఉత్తర భారత దేశంలో సర్వత్రా దాని మూలంగా ప్రసిద్ధిని పొందారు. వీరు రచించిన గ్రంథాలను ఆధారంగా చేసికొని పరిశోధన గావించి పలువురు పిహెచ్.డి పట్టాలను పొందారు.





## కృతజ్ఞతాంజలి

గత శతాబ్దంలో వైదికసంప్రదాయానికి, ప్రత్యేకించి రామానుజ దర్శనానికి శ్రీఉత్తమూర్ వీరరాఘవాచార్య స్వామివారు చేసిన ఉపకారం చిరస్థాయిగా నిలచి ఉండేది. శ్రీరామానుజ వైభవాన్ని అద్వితీయంగా అందించే ఇరామానుశనూత్రన్దాది అనే ద్రావిడప్రబంధానికి ఈ మహనీయులు సంతరించిన ప్రబంధ రక్షా వ్యాఖ్యానాన్ని శ్రీరామానుజుల స్మృతిగా ఆవిష్కరింపబడుతోంది. ఈ గ్రంథ ప్రచురణకు తమ అంగీకారాన్ని తెలిపిన స్వామి వారి తిరుకుమారులు శ్రీమాన్ ఉత్తమూర్ రాజగోపాల్ స్వామి వారి సన్నిధిలో కృతజ్ఞతాపూర్వక దాసోహాలు సమర్పించుకుంటున్నాను.

శ్రీవీరరాఘవాచార్య దేశికో నవ్యదేశికః,
మీమాంసావల్లభో జీయాత్ ఆచంద్రాదిత్యతారకమ్.



ఇట్లు
ఈ.ఏ. శింగరాచార్యులు

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః

శ్రీరంగామృతకవి (తిరువరంగత్తముదనార్) ప్రణీతమైన
ప్రపన్న గాయత్రి అనే

# ఇరామానుశనూఱ్ఱన్దాది

(శ్రీ ఉ.వే. అభినవదేశిక, ఉత్తమూర్, తిరుమలై నల్లాన్ చక్రవర్తి వీరరాఘవాచార్యస్వామి అనుగ్రహించిన ప్రబంధరక్ష - అనే వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదంతో కూడినది.)



శ్రీరంగామృతసూరిసూక్తి రనఘా శ్రీరంగనాథప్రియ-
శ్రీరామానుజయోగివర్యవిషయా స్వార్థం బుభుత్సో మయి ।
మాన్యాచార్యకరంగలక్షణమునేః దాసే శతాంతాది ర-
స్త్వేషా వ్యాకృతసర్వసూరివచసి శ్వశ్రేయసాయ శ్రితే ॥

(శ్రీరంగనాథునకు మిక్కిలి ఇష్టులైన శ్రీరామానుజయోగీశ్వరులను గూర్చి రచింపబడిన శ్రీరంగామృతకవి (అముదనార్) సూక్తి పరమ పవిత్రమైనది. గొప్ప ఆచార్యులైన శ్రీరంగలక్ష్మణమునుల శిష్యుడను, దివ్యసూరి ప్రబంధాలను అన్నింటిని వ్యాఖ్యానించినవాడను, స్వార్థాన్ని పొందదలచినవాడను అయిన నాకు ఈ సూక్తి మంగళాన్ని కలిగించాలి.)

నాలాయిర దివ్యప్రబంధమనబడే ప్రసిద్ధమైన ఆళ్వార్ల శ్రీసూక్తులలో నాల్గవ సహస్రం - ఇయఱ్పా. ఇందులోని చివరి ప్రబంధం ఇరామానుశనూఱ్ఱన్దాది. దివ్యప్రబంధాలు ఏ విధంగా నాల్గు ఆయిరాలు (సహస్రాలు)గా విభాగింపబడుతున్నాయి, ఆ మొదలైన వివరాలు తిరుప్పల్లాణ్డు పాశుర ప్రారంభంలోనే తెలుపబడ్డాయి). పెరియతిరు మొళి ప్రబంధం 1084



పాశురాలు కల్గినదై, 1102 పాశురాలను కల తిరువాయ్మొళి ప్రబంధం వలెనే ప్రత్యేకంగా ఒక సహస్రంగా లెక్కించ దగినదే అయినా, ఆ ప్రబంధంతో తిరుక్కుఱున్దాణ్డకమ్, తిరునెడున్దాణ్డ కమ్ - అనే రెండు ప్రబంధాలు చేర్చబడి, రెండవ ఆయిరంగా వ్యవహరింపబడుతున్నది. దానివల్ల ముదలాయిరానికి, ఇయఱ్పాకు పాశురాలు వేయికి కొంచెం తక్కువగా ఉన్నాయి. కొంచెం తక్కువగా ఉన్నా అవి రెండు ప్రత్యేకమైన ఆయిరాలుగానే (సహస్రాలుగానే) చెప్పబడుతున్నాయి. ఈ విభాగం శ్రీమన్నాథమునుల కాలంనుండే ఉన్నదని పెద్దలు అంటారు. ఆళ్వార్ల అవతారక్రమానికి, వారి ప్రబంధాల ఉత్పత్తి క్రమానికి తగినట్లుగా వారి ప్రబంధాల కూర్పు జరగలేదు. వెనుక ఆవిర్భవించిన ప్రబంధం ముందు, ముందు ఆవిర్భవించిన ప్రబంధం వెనుకగా కూర్పబడ్డాయి. ఈ విధంగా కూర్చబడడానికి తగిన కారణమేమీ కూర్చినవారిచే తెలుపబడలేదు. తరువాతి కాలంలో ఆ కారణాన్నిగూర్చి ఊహించినపుడు, వారి వారి ఊహానుసారంగా అది (కారణం) మాఱుతున్నది. అదే విధంగా, పాశురాలు కొంచెం తక్కువగా ఉన్నా నాలాయిరమనే పేరు వ్యవహరింపబడుతున్నదని కూడా కొందఱి అభిప్రాయం. "ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధం భగవద్విషయకం కానందువల్ల, శ్రీమన్నాథమునులు చాలాకాలం తరువాత అవతరించిన భగవద్రామానుజుల విషయంలో రచింపబడినందువల్ల, దివ్యప్రబంధాలతో చేర్చనక్కఱలేదు" అనే వాదం పుట్టిన మఱుక్షణమే నశించిపోయింది. ఎందుకు? అంటే, భగవద్రామానుజులు వేంచేసి ఉన్నపుడే శ్రీరంగనాథుని ఆజ్ఞపై భగవద్రామానుజుల గోష్ఠిలో ఈ ప్రబంధాన్ని విన్నపించినపుడు, ఆ గోష్ఠిలోని పలువురి ప్రార్థనకు భగవద్రామానుజులు కూడా అంగీకరించారు. అప్పటినుండి శ్రీవైష్ణవాలయాలలో మార్గళిమాసం శుక్లఏకాదశికి ముందు పదినాళ్ళలో పెరియాళ్వార్ తిరుమొళి మొదలైన ప్రబంధాలను కల ముదలాయిరం, పెరియతిరుమొళి మొదలైన రెండవ ఆయిరం, శుక్ల ఏకాదశి మొదలు పదినాళ్ళు తిరువాయ్మొళి

అనే మూడవ ఆయిరం సేవింపబడిన తరువాత, ఈ ఇరామానుశ నూట్రన్దాదితో పాటు ఇయఱ్పాను పూర్తిగా సేవించి, శాత్తుముఱై (సమాపనం-పూర్తి) చేయడం ప్రత్యక్షసిద్ధం. మిగిలిన ప్రబంధాలకు శాత్తుముఱై పాశురాలు రెండు కాగా, ఈ ప్రబంధానికి శాత్తుముఱై పాశురాలు మూడు.

ఈ విధంగా దివ్యప్రబంధాలతో పాటుగా చేర్చబడినందువల్ల, దీనినికూడా కలిపే నాలాయిరమనే పేరు వ్యవహరింపబడుతున్నది. ఈప్రబంధాన్ని చేర్చినప్పటికీ నాలాయిరం (నాల్గు వేలు) పూర్తి కాలేదు కనుక, రెండు మడల్ ప్రబంధాలను (శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్ ప్రబంధాలను) కర్ణికలు కర్ణికలుగా (విభాగాలుగా) చేసి, నాలాయిరసంఖ్యను సరిపెట్టి, ఈ ప్రబంధాన్ని నాలాయిర దివ్యప్రబంధంతో చేర్చకుండా కొంతమంది వదలిపెట్టారు. ఒక్కొక్క మడల్ ప్రబంధం ఒక్కొక్క పాశురమేనని ఆ కాలంలోని లెక్కనుబట్టి చెప్పవలసి ఉన్నా, నాలాయిరం పూర్తి కావడంకోసం కర్ణికలు కర్ణికలుగా విభాగిస్తే, సగం పాశురంతోనే ఈ ప్రబంధాలు ముగుస్తున్నాయి. అందువల్ల ఈ విభాగం సరి కాదు. పెరియ తిరుమడల్‌లో మేము పరిశీలించి చెప్పిన రీతిలో పూర్వపు విభాగాన్నే ఆదరిస్తే ఈ (ఇరామానుశ నూట్రన్దాదిలోని) నూట ఎనిమిది పాశురాలు చేరినపుడే నాలాయిర సంఖ్య పూర్తి అవుతుంది. "ఈ విధంగా నాలాయిరమనే సంఖ్యకు అవకాశం ఉన్నపుడు, తక్కువ అయినా దోషం లేదు"- అనే క్రమాన్నే అనుసరించ నక్కరలేదు. ఒక పాశురాన్ని పలు పాశురాలుగా స్వతంత్రంగా విభజించాలనడం క్రమాన్ని సమసిన తరువాత, నూత్తన్దాది ప్రబంధాన్ని చేర్చి అనుసంధించే ప్రాచీన క్రమం అనుగుణంగానే విభజించవచ్చుకదా" అని పెద్దలు అంటారు.

భగవానుని ఉద్దేశించినది కాకపోయినా, ఇరామానుశ నూట్రన్దాది దివ్యప్రబంధాలలో అంతర్భూతమవుతుంది. మధురకవి ఆళ్వార్ల



అనుగ్రహించిన కణ్ణినుణ్‌శిఱుత్తాంబు నమ్మాళ్వార్ల విషయంలోనిది అయినా, దానిని చేర్చి ముదలాయిరాన్ని నిర్ణయించడం ఏవిధంగా జరిగిందో, అదే రీతిలో ఈ ప్రబంధాన్ని చివరలో చేర్చి నాల్గవ ఆయిరంగా అంటున్నారు. అవధి భాగవతశేషత్వ కైంకర్యాలు. కనుక, భాగవత శేషత్వంతో చేర్చి, ముదలాయిరంలో (జీవుని) శేషత్వం చెప్పబడింది. "భాగవత పర్యంతమైన కైంకర్యం పరమాచార్య పర్యంత మైనపుడు అది ఉత్తమం" అనే విషయాన్ని అముదనార్ ఈ ప్రబంధంద్వారా వ్యక్తం చేసినందువల్ల దీనితో నాలాయిర ప్రబంధం పరిసమాప్తి పొందుతున్నది.

ఇయఱ్పా మూడవ ఆయిరమని, నూత్తన్దాది ఇయఱ్పాలో అంతర్భవించదని కొందరు వాదిస్తున్నారు. ఇది తెన్గలై సంప్రదాయంకూడా కాదు. ముద్రింపబడిన తెన్గలై సంప్రదాయవ్యాఖ్యలలోనే ఈ నూట్రన్దాది ఈ క్రింది క్రమంలో కూర్చబడి ఉండడాన్ని గమనించవచ్చు. ముదలాయిరమ్, పెరియతిరుమొళి, తిరువాయ్ మొళి, ఇయఱ్పా- అనే నాల్గు ఆయిరాలలో నాల్గవది అయిన ఇయఱ్పాలో చరమ ప్రబంధంగా చేర్చబడిన ఈ నూట్రన్దాది ప్రణవార్థమైన ముదలాయిరాన్ని, నమ్మాళ్వార్ విషయమైన భాగవతశేషత్వాన్ని కణ్ణినుణ్ శిఱుత్తాంబుతో చేర్చి పూర్తి చేసినట్లే, కైంకర్యంలో విరోధిని పోగొట్టే ఇయఱ్పాలో దీనిని చేర్చి అనుసంధించడం యుక్తమే. దీనివల్ల ఇయఱ్పా నాల్గవ ఆయిరం అని, ఈ ఆయిరంలో అంతర్భవించినది నూట్రన్దాది అని, దీనినికూడా ఒక దివ్యప్రబంధంగా అనుసంధించవచ్చునని స్పష్టమవుతున్నది. ఇందులో పెరియతిరుమొళి అనే పేరు దాణ్డకాలకు కూడా ఉన్నది - అని తోస్తుంది. అది ఉపలక్షణం.

దివ్యప్రబంధాలకు ద్రావిడవేదమనే పేరు సాధారణంగా ఉన్నందువల్ల, అన్నీ అర్థపంచకం, తత్త్వత్రయంవంటి, అర్థాలను తెలుపుతున్నందువల్ల అన్నీ వేదం అనడంలో వివాదం లేదు. **"నాన్మఱై చ్చెమ్బొరుళ్ శెన్దమిళాల్ అళిత్త పాణ్ పెరుమాళ్"** (నాల్గు వేదాలలోని అందమైన, ఋజువైన అర్థాలను

అందమైన ద్రావిడభాషతో అనుగ్రహించిన పాణ్‌పెరుమాళ్), **"ఎయ్‌దఱ్కరియ మఱైకళై ఆయిరమిన్దమిళాల్ శెయ్‌దఱ్కు ఉలకిల్ వరుమ్ శడకోపనై"** (పొందడానికి అరుదైన వేదాలను వేయి ద్రావిడభాషలో అనుగ్రహించడానికి లోకంలో అవతరించిన శఠకోపులు) అనే రీతిలో ఈ నూత్రన్దాదిలో ఒక్కొక్క పాశురం చతుర్వేదాలలోని అర్థాన్ని చక్కగా తెలుపుతున్నదని చెప్పబడుతున్నది. ఈవిధంగా ఉండగా, నమ్మాళ్వారుల నాల్గు ప్రబంధాలు క్రమంగా నాల్గు వేదాలని, తిరుమంగై ఆళ్వార్ల ప్రబంధాలు ఆఱు వాటి ఆఱు అంగాలని వ్యవహరింపబడుతున్నది. పలు సందర్భాలు నమ్మాళ్వార్ల శ్రీసూక్తులకు వివరణంగా ఉండడంవల్ల, సంఖ్యను అనుసరించి ఈ విధంగా చెప్పబడుతున్నది. ఈ విధంగా వేదాంతార్థమే ఇందులో తెలుపబడుతున్నది - అనే రీతిలో సర్వవేద సారమైన తిరుమంత్రంయొక్క అర్థం నాలాయిరంలో తెలుపబడుతున్నది - అనే సంప్రదాయం ఉన్నది. పెరియాళ్వార్లు **"నమో నారాయణవెన్ఱు నామమ్ పల పరవి"** అని అన్నందువల్ల, **"నారాయణా వెన్నుమ్ నామమ్"** అని కలియన్‌తో పాటు అందఱు నారాయణనామాన్ని ఆదరించినందువల్ల, మన సంప్రదాయంలో మూలమంత్రంగా చెప్పబడే అష్టాక్షరీమహామంత్రం యొక్క వివరణమే దివ్యప్రబంధాలు- అని అంటారు. అందులో, ముదలాయిరం ప్రణవార్థాన్ని, రెండవ ఆయిరమ్ నమశ్శబ్దార్థాన్ని, తిరువాయ్‌మొళి నారాయణశబ్దార్థాన్ని ఇయఱ్పా నారాయణపదంపై గల చతుర్థీవిభక్తి ప్రత్యయంలో (**"ఆయ"**అనే ప్రత్యయంలో) చెప్పబడిన కైంకర్యాన్ని తెల్పుతున్నదని అంటారు. ప్రణవం, నమశ్శబ్దం - రెండు భగవద్భాగవత శేషత్వాన్ని చెప్పడంవల్ల ముదలాయిరం చివరలో నమశ్శబ్దంలో చెప్పబడ్డ భగవచ్ఛేషత్వం స్పష్టంగా ఉన్నందువల్ల, అక్కడే ఈ రెండు శబ్దాల అర్థం స్పష్టపడుతున్నదని, పెరియతిరుమొళిలో **"నారాయణా ఎన్నుమ్ నామమ్"** అని ప్రారంభమవుతున్నందువల్ల నారాయణశబ్దార్థమే. రెండవ ఆయిరమని, పరిపూర్ణానుభవ కైంకర్యమనే



ఫలం తిరువాయ్‌మొళి ప్రబంధప్రతిపాద్యం కావచ్చునని చెప్పవచ్చు. ద్వయమనబడే శరణాగతి మంత్రంయొక్క వివరణమే తిరువాయ్‌మొళి - అనే శ్రీదేశికుల అభిప్రాయాన్ని అనుసరించి తిరువాయ్‌మొళి వ్యాఖ్యాన ప్రవేశంలో వివరంగా తెలుపబడింది. ఇయఱ్పా కైంకర్యవిరోధిని నిరసిస్తున్నది- అని పలికేవారికికూడా ద్వయంలోని నమశ్శబ్దార్థమే ఇయఱ్పా అనే అభిప్రాయం కావచ్చు. పెరియతిరుమొళివ్యాఖ్యాన ప్రవేశంలోని వివరణం ఇక్కడ అనుసంధేయం. ఇందువల్లకూడా క్రమంలో తిరువాయ్‌మొళికి ముందు పెరియతిరుమొళి నిలుస్తుంది.

ఈ నూత్రన్దాదిని అముదనార్ అనుగ్రహించారు. వీరికి పెరియ కోయిల్ నంబి అని పేరు. ఈ నామం వీరికి శ్రీరంగంలో నిత్యవాసం చేసి, శ్రీరంగనాథునకు కైంకర్యపరులు కావడంవల్ల కల్గింది. నూత్తన్దాది ప్రబంధాన్ని విని శ్రీరంగనాథుడు వీరికి **"అముదనార్"** అనే పేరు పెట్టాడనికి పెద్దలు అంటారు. అపుడు, వీరి జన్మనామం వేఱుగా వ్యవహరింపబడి ఉండాలి. **"ఆరాద అరుళముదమ్ పొదిన్ద కోయిల్"** (తృప్తిని కల్గించని దయామృతం నెలకొన్న కోవెల) అనే రీతిలో శ్రీరంగనాథుని అమృతంగా అనుభవించడం సంప్రదాయం కనుక, మొదటగా వీరి **"అముదన్"** అనే పేరు వీరికి పెట్టబడి ఉండవచ్చు. అది నూత్రన్దాదివలన సార్థకమై ఉండవచ్చు. వీరు భగవద్రామానుజుల ఆజ్ఞానుసారం కూరేశులచే సంస్కరింపబడ్డారనే కారణంచేత, వారినే ఆశ్రయించమని శ్రీరామానుజులు నియమించగా, ఆ నియమనాన్ని భోగ్యంగా శిరసా వహించి, దాని ప్రకారం నడచుకొన్నారు. దీనిని తామే స్వయంగా గొప్పగా నూత్తన్దాది ప్రబంధంలో **"మొళియై క్కడక్కుమ్ పెరుమ్ పుకళాన్ వఞ్జముక్కుఱుమ్బామ్ కుళియై క్కడక్కుమ్ నమ్‌కూరత్తాళ్వాన్ శరణ్ కూడియ పిన్"** (వాచామగోచరమైన గొప్పకీర్తిని కలవారు, వంచించే మూడు గోతులనదగిన మూడుమదాలను అతిక్రమించినవారైన మన కూరేశులను శరణు పొందిన తరువాత) అని ప్రస్తావించారు. ఈ విధంగా కూరేశులను

ఆశ్రయించి, తమ ప్రాచార్యులు, ప్రత్యక్షంగా తమచే నిరంతరం అనుభవింపబడేవారు అయిన భగవద్రామానుజుల విషయంగా పాశురాలను విన్నపిస్తే తప్ప తృప్తిని పొంద లేని భక్త్యుత్కర్షను పొందిన అముదనార్ శ్రీరామానుజుల విషయంలో వేయి పాశురాలకు మించి రచించారని, అంతటి పాశురవిస్తృతిని శ్రీరామానుజులు అంగీకరించికపోవడంవల్ల, తరువాత ఈ విధంగా నూత్తన్దాదిని రచించారని, శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారం శ్రీరామానుజులతోపాటు పలువురు సమావేశమైనపుడు అముదనార్, నూఱ్ఱన్దాదిని విజ్ఞాపనం చేయగా, అందఱు చాలా ఆనందించి, దివ్యప్రబంధాలతోపాటు కలిపి దీనిని అనుసంధించడం ఆరంభించారని, అప్పటినుండి దివ్యప్రబంధాలకు నాలాయిరమని, అవి సంఖ్యలో 24 అని ప్రసిద్ధి కల్గిందని పెద్దలు అంటారు. నమ్మాళ్వార్లు నాథమునులకు ఉపదేశించినపుడే **"కలియుమ్ కెడుమ్ కణ్డుకొణ్మిన్"** (కలినశిస్తుంది చూడండి) అని శ్రీరామానుజుల అవతారం సంభవించబోతున్నదని, అపుడు ప్రబంధం పూర్తికాగలదని తెలిపినట్లు కొందరు పూర్వులు వచించారు.





**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః**

# ఇరామానుశనూఱ్ఱన్దాది

## తనియన్‌లు

1. మున్నై వినై యకల మూంగిల్‌కుడి యముదన్,
పొన్నమ్ కళఱ్కమల ప్పోతిరణ్డుమ్, - ఎన్నుడైయ
శెన్నిక్కణియాక చ్చేర్త్తినేన్, తెన్ పులత్తార్‌క్కు
ఎన్ను క్కడవుడైయేన్ యాన్.

మూఙ్గిల్ కుడి = మూఙ్గిల్ కుడి -అనే కులంలో ఆవిర్భవించిన, అముదన్ = తిరువరంగత్తముదనార్‌యొక్క, పొన్ అమ్ = బంగారం వలె గౌరవించబడే, కళల్ కమలమ్ పోదు = శ్రీచరణపద్మాలు, ఇరణ్డు ఉమ్ = రెండిటిని, మున్నై వినైఅకల = ప్రాక్తన పాపాలు పోవడం కోసం, నా, శెన్నిక్కు = శిరస్సుకు, అణి ఆక = అలంకారంగా, శేర్త్తినేన్ = చేర్చుకొన్నాను, అందువల్ల పాపాలు పోయినవి, కనుక, తెన్ పులత్తార్‌క్కు= దక్షిణంలో ఉండే యమలోకాధికారులకు, ఎన్నుక్కు యాన్ = ఎందుకోసం నేను, కడవు ఉడైయాన్ = ఒడంబడికను కలవాడను అవుతాను?

పరమాచార్యులైన భగవద్రామానుజుల విషయంగా నూత్తన్దాదిని అనుగ్రహించిన తిరువరంగత్తముదనార్‌యొక్క శ్రీచరణపద్మద్వయిని శిరసా ధరించే నాకు అన్ని పాపాలు నశించాయి. కనుక, ఇక యమునికి గాని, అతని కింకరునికి గాని విధేయుడనై ఉండే అవకాశం లేదు.

"ఎన్ను క్కడవు" - "ఎన్నుక్కు కడవు" అని విభజించాలి. ఇది "తొకుత్తల్ వికారమ్", "ఎన్ను క్కడవుడైయేన్" అనే పాఠం ఉండవచ్చు. ఎన్నుక్కు అడర్ = నెరుక్కుకై = సమీపించడం.

**ఎంబార్ అనుగ్రహించినది**

2. నయమ్ తరు పేరిన్బమెల్లామ్ పళుతెన్ఱు నణ్ణినర్పాల్,
శయమ్ తరు కీర్తి యిరామానుశముని తాళిణైమేల్,
ఉయర్న్ద కుణత్తు త్తిరువరంగత్తముతోంగుమ్ అన్బాల్
ఇయమ్బుమ్ కలిత్తుఱై, యన్దాతి యోత ఇశై నెంజమే!

నెఞ్జమే = ఓమనసా!, నీవు, నయమ్ తరు = ఆనందాన్ని (లేక), ఔన్నత్యాన్ని ఇచ్చే, పేర్ ఇన్బమ్ ఎల్లామ్ = చాలా గొప్పవైన భోగాలు, పళుదుఎన్ఱు = నశ్వరాలే-అని గ్రహించి, నణ్ణినర్ పాల్= దరిచేరినవారిపట్ల, శయమ్ తరు = వారికి వేడిన విషయాంతర జయాన్ని ఇచ్చే, కీర్త్తి = కీర్తిని కల, ఇరామానుశ ముని = శ్రీరామానుజుల, తాళ్ ఇణై మేల్ = రెండు శ్రీచరణాల విషయంగా, ఉయర్న్ద కుణత్తు = ఉన్నతాలైన సద్గుణాలు నిండిన, తిరువరఙ్గత్తు అముదు = అముదనార్, ఓఙ్గుమ్ అన్బాల్ = పరీవాహంగా వెలువడే భక్తితో, ఇయమ్బుమ్ = పల్కిన, కలిత్తుఱై = కలిత్తుఱై అనే వృత్తంలో ఉండే, అన్దాది = అన్దాది సందర్భంలోని ప్రబంధాన్ని, ఓద ఇశై = అధ్యయనం చేయాలని ఆశపడు.

**"నయ"**మంటే తగని విషయంలోని ప్రీతి, ఔన్నత్యం, ఆనందం. **"పళుదెన్ఱు"** అనేది, **"నణ్ణినర్"** అనేచోట **"శయమ్ తరు"** అనేచోట, **"అముదు ఇయమ్బుమ్"** అనేచోట, **"ఇశై"** అనేచోట అన్వయిస్తుంది.

## పిళ్ళాన్ అనుగ్రహించినది

3. శొల్లిన్ తొగై కొణ్డునతడిప్పోతుక్కు త్తొండు శెయ్యుమ్,
నల్లన్బరేత్తు మున్నామ మెల్లామ్, ఎన్తన్ నావినుళ్ళే
అల్లుమ్ పకలు మమరుమ్పడి నల్కు, అఱుశమయ
వెల్లుమ్ పరమ ఇరామానుశ! ఇతెన్ విణ్ణప్పమే.

అఱు శమయమ్ = వేదంతో విరోధించే ఆఱు మతాలు, వెల్లుమ్ పరమ = నిరాకరించేవారిలో గొప్పవారైన, ఇరామానుశ = శ్రీరామానుజా!, ఉనదు అడి పోదు ఎక్కు = మీ శ్రీచరణపద్మాల విషయంగా, తొణ్డు



శెయ్యుమ్ = సేవను చేసే, నల్ అన్బర్ = గొప్ప ప్రేమను కల (అముదనార్ వంటి) వారిచే, శొల్లిన్ = గొప్ప వాక్కులతో, తొగై కొణ్డు = రాశితో విస్తృతంగా, ఏత్తుమ్ = వివరించి వ్యాఖ్యానింపబడిన, ఉన్ నామమ్ ఎల్లామ్ = నీ తిరునామాలు, (లేక) గుణాలు అన్నీ, ఎన్ తన్ = నా, నావిన్ ఉళ్ళే = జిహ్వాలో, అల్ ఉమ్ పకల్ ఉమ్ = రాత్రి, పగలు ఎల్లప్పుడు, అమరుమ్ పడి = నిలకడగా ఉండేటట్లు, నల్కు = అనుగ్రహించాలి, ఇదు ఎన్ విణ్ణప్పమ్ = విజ్ఞాపనం.

ఆచార్యా! శ్రీరామానుజా! ఇతరమతాలను అన్నిటిని జయించి, పేరు పొందిన దేవరవారి తిరునామాలకు పలు అర్థాలను గ్రహించి పలు రీతుల లోని శబ్దాలను చేర్చి పొగడి, పాశురాలుగా కూర్చిన అముదనార్ - అనే భక్తశిఖామణియొక్క వాక్కులతో చేరిన తిరునామాన్ని అహోరాత్రం పల్కి, దేవరవారి గుణాలను అనుభవించేటట్లు అనుగ్ర హించాలి. ఇదే దాసుని విజ్ఞాపనం - అనిభావం.

మొదటి తనియన్‌లో తిరురఙ్గత్తముదనార్ శ్రీచరణాలనే శిరసా వహించడం తెలుపబడింది. రెండవదానిలో వారు అనుగ్రహించిన అన్దాదిని అధ్యయనం చేసే విధంగా మనస్సును సంబోధించి పలికారు. మూడవదానిలో శ్రీరామానుజులపట్ల ఇటువంటి శ్రీసూక్తులను అన్నిటిని ఎపుడూ అనుసంధించేటట్లు అనగ్రహించమని ప్రార్థిస్తున్నారు. శ్రీరామానుజపాదస్థానీయులైన కూరేశులను ఆశ్రయించి, ఉజ్జీవించిన అముదనార్‌కు తక్కువవారిగా తమను భావించేవారు సమమైనవారు, కూరేశులతో సాటియై, వీరికి మించిన వారు - అనే మూడు విధాలుగా ఉండే భగవద్రామానుజ శిష్యులు అనుసంధించే క్రమం ఈ మూడు తనియన్‌ల క్రమంలో తెలియవస్తున్నది. అముదనార్ కంటే పెద్దలు కూడా అముదనార్‌కు ప్రణామం చేయడం విడచినా, వారి శ్రీసూక్తుల అనుసంధానాన్ని విడువడానికి మనస్సు రాక, అనుసంధించారు. ఇపుడు వారు నూఱ్ఱన్దాదికి విషయమైన ఆచార్యులకు నమస్కరించి

అనుసంధానాన్ని ఆరంభించారు. ఈ స్థితిని తెలుపడంకోసమే ప్రబంధసారంలో శ్రీరామానుజులనే సంబోధించి, **"కాశినిమేల్ వాదియరై వెన్దరజ్గర్ కతియాక వాళ్న్దరుళుమెతిరాశా! మున్ పూశురర్కోన్ తిరువరజ్గత్త ముదనార్ ఉన్ పొన్నడిమేల్ అన్దాదియాక పోట్రి ప్పేశియ నఱ్కావిత్తురై నూట్రెట్టు ప్పాట్టుమ్ పిళైయఱవే ఎనక్కరుళ్శెయ్ పేణి నీయే"** (భూమిలో ప్రతివాదులను జయించి, శ్రీరంగనాథుడే గతి అని భావించి వేంచేసి ఉండే యతిరాజా! పూర్వం భూసురప్రముఖుడైన తిరువరజ్గత్తముదనార్ పల్కిన చక్కని కలిత్తురై ఛందస్సులోని నూట ఎనిమిది పాశురాలను ఏదోషం లేకుండా అధ్యయనం చేసేటట్లు దయతో అనుగ్రహించు) అని శ్రీదేశికులు అనుగ్రహించారు. ఈ భావం వల్లనే, నూట్రన్దాదిని నాలాయిరంలో చేర్చినందున, దాని అనుసంధానాన్ని భావించే, దానికి విషయమైన శ్రీరామానుజులను తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ ఈ తనియన్‌లో వలె **"భూతం సరచ్చ"** అనే తనియన్‌లో **"యతీంద్రమిశ్రాన్"** అని చేర్చారు.

ఈక్రింది రీతిలో నాల్గవ తనియన్‌కూడా మేల్‌నాడులో అనుసంధింపబడుతున్నది.

**4.** **ఇని యెన్ కుఱై? నమక్కెమ్బెరుమానార్ తిరునామత్తాల్**
**ముని తన్ద నూట్రెట్టు చ్చావిత్తిరి యెన్నుమ్ నుణ్పొరుళై**
**క్కలితన్ద శెంజొల్ లిత్తురై యందాది పాడి త్తన్దాన్**
**పునితన్ తిరువరంగత్తముదాకియ పుణ్ణియనే.**

సృష్టి ఆరంభంలో భగవంతుడు ఉపదేశించిన, విశ్వామిత్రముని ప్రచారం చేసిన, నూట ఎనిమిది సార్లు జపింపబడే సావిత్రియొక్క అర్థమైన సూక్ష్మార్థాన్ని, ధర్మాది విషయమైన బుద్ధులను (జ్ఞానాన్ని) అనుగ్రహించే భగవదవతార ఆచార్యమూర్తిని ధ్యానించాలి. అనేదానిని శ్రీరామానుజుల విషయమైన కలిత్తురై అన్దాది మూలంగా పుణ్యాత్ములైన తిరువరంగత్త ముదనార్ అనుగ్రహించారని భావం.





**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః**

**శ్రీరంగామృతకవి (తిరువరంగత్తముదనార్) ప్రణీతమైన ప్రపన్న గాయత్రి అనే**

# ఇరామానుశనూట్రన్దాది

**ప్రబంధరక్ష వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదంతో**

## అవతారిక

కల్యాణగుణపూర్ణులైన భగవద్రామానుజుల సాటి లేని వైభవాన్ని పలు రీతులలో కీర్తించడంకోసం ప్రవృత్తమైన ఈ అన్దాదిలో ప్రాయికంగా తమ నైచ్యాన్ని కూడా విడువకుండా (తప్పక), అముదనార్ అనుసంధిస్తున్నారు. ఆళ్వార్లపట్ల, వారు అనుగ్రహించిన శ్రీసూక్తులపట్ల, శ్రీరామాయణమ్ మొదలైన ఇతిహాసాదులపట్ల, భగవానుడు సాక్షాత్తు ఉపదేశించిన శ్రీగీతపట్ల, నాల్గు వేదాలపట్ల భగవద్రామానుజులకు గల అభినివేశం, అన్యమతాలను నిరాకరించిన వైదుష్యం, అర్చామూర్తి పర్యంతమైన భగవద్భక్త్యుత్కర్ష, భగవానుని కంటే వారికి గల అతిశయం, తమ ఆచార్యైకాంత్యం- అన్నీ ఇందులో అనుసంధింపబడుతున్నాయి. గ్రంథాలవల్ల తెలిసికొని, కర్ణాకర్ణిగా విని పల్కడం కంటే తామే సాక్షాత్తు కళ్ళార దర్శించి అనుభవించి ఆనందించి ఈ అముదనార్ ఈ ప్రబంధాన్ని అనుగ్రహించినందున దీనికి ఒక వైలక్షణ్యం ఉన్నది. ఈ ప్రబంధంలో మొదటి ఏడు పాశురాలు ఉపోద్ఘాతం, తరువాత అన్నిటిలో ఆళ్వార్లపట్ల శ్రీరామానుజులకు గల భక్తినిగూర్చి పలికారు. ప్రారంభం లోని రెండు పాశురాలతో పరాంకుశ - పరకాల దివ్యసూరుల విషయంలో విశేషమైన భక్తిని కల్గి ఉండడాన్నిగూర్చి తెలుపబడింది. ఈ ఇద్దరు

ఆళ్వార్లు వేయికి పైగా పాశురాలను రచించి, పలు ప్రబంధాలతో మహోపకారాన్ని చేశారు. నమ్మాళ్వార్ల దివ్యప్రబంధాల పారాయణాన్ని, వారికి ఉత్సవాన్ని తిరుమఙ్గై ఆళ్వార్లు తమ కాలంలోనే శ్రీరంగంలో నిర్వహించారు. ఉపనిషత్‌మీమాంస అయిన శారీరకమనే బ్రహ్మసూత్రాల అర్థానికి దాని అంతర్విభాగాలకు అనుగుణంగా క్రమంగా తిరువాయ్‌మొళి ప్రబంధం ప్రారంభంలో, తరువాత అద్భుతంగా నమ్మాళ్వార్లు అనుగ్రహించారు. అంతేకాక, ప్రపన్నజనసంతాన కూటస్థులైన ఆచార్యులై వెలిగేవారు. వీరి విషయంలో అభినివేశాన్ని కల్గిన తిరుమఙ్గై ఆళ్వార్ల శ్రీసూక్తులు మొదలైన నాలాయిరాన్ని, తిరువాయ్‌మొళి అనుసంధానికి ముందు, వెనుకలలో మార్గళి నెలలో అంతా అనుసంధించే విధి భగవద్రామానుజులచే ఏర్పాటు చేయబడింది. ఈ ఇద్దరు ఆళ్వార్లు నాయకీభావాన్ని పొంది శ్రీమన్నారాయణుని విషయంలో తమ ప్రేమ (భక్తి) ఫలించాలని పాటు పడినవారు. ఈ విధంగా వీరి వైలక్షణ్యాన్ని పరిశీలించి, వీరిద్దరిని మొదటి రెండు పాశురాలలో అముదనార్ అనుసంధిస్తున్నారు.



సూచన : ద్రావిడ వర్ణమాలలోని ‘ழ’ అనే అక్షరాన్ని తెలుగులోని ‘ళ’ అక్షరంతో సమానంగా, ‘ற்ற’ అనే సంయుక్తాక్షరాన్ని ‘ట్ర’ అనే సంయుక్తాక్షరంతో సమానంగా, ‘ற’ అనే అక్షరాన్ని ‘ఱ’ అనే అక్షరంతో సమానంగా ఉచ్చరించవచ్చును.



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః

# ఇరామానుశనూట్రన్దాది

## ప్రబంధరక్ష వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదంతో



**1. పూమన్ను మాతు పొరున్దియ మార్బన్, పుకళ్ మలిన్ద**
**పామన్ను మాఱనడి పణిన్దు ఉయ్‌న్దవన్, పల్‌కలైయోర్**
**తామ్ మన్న వన్ద ఇరామానుశన్ శరణారవిందమ్**
**నామ్ మన్ని వాళ, నెంజే! శొల్లువోమ్ అవన్ నామంగళే.**

నెఞ్జే = నా మనసా!, మనం, పూమన్ను = తామరపూవులో నిత్యవాసం చేసే, మాదు = లక్ష్మీదేవి, పొరున్దియ = ఆ పూవునుకంటే పొందికగా గ్రహించిన, మార్బన్ = వక్షఃస్థలాన్ని కలవాడైన నారాయణుని, పుకళ్ మలిన్ద = గుణాలనే మిక్కిలిగా పలికే, పా= పాశురాలను అనుగ్రహించడంలోనే, నిన్ద = నిలకడగా కాలక్షేపం చేసే, మాఱన్ = నమ్మాళ్వార్ల, అడి పణిన్దు = శ్రీచరణాలను నమస్కరించి, ఉయ్‌న్దవన్ = ఉజ్జీవించేవారు, పల్ కలైయోర్ తామ్ = బహుశ్రుతులైన విద్వాంసులు, మన్న వన్ద = తమను ఆశ్రయించేటట్లు అవతరించినవారైన, ఇరామానుశన్ = యతిరాజుల, శరణ అరవిన్దమ్ = శ్రీచరణపద్మాలను, నామ్ మన్ని వాళ = మనం నిలకడగా ఆశ్రయించి ఉజ్జీవించేటట్లు, అవన్ నామఙ్గళ్ = వారి తిరునామాలను, వాటి అర్థాలైన గుణాలను, శొల్లువోమ్ = ఎల్లప్పుడు పల్కుదాం.

ఆళ్వార్లకు “ఆళ్వార్లు” అనే పేరు- శ్రియఃపతివిషయంలో వారికి

పూర్ణమైన అవగాహాన్ని కల్గినందువల్ల ఏర్పడింది. నమ్మాళ్వార్లు **"నమ్‌తిరువుడై యడికళ్"** (మన శ్రియఃపతి) అని, **"అకలకిల్లేన్ ఇఱైయుమ్ ఎన్ఱు అలర్‌మేల్‌మఙ్గై యుఱై మార్బా"** (క్షణం కూడా విడచి ఉండలేననే పద్మావతి నిత్యవాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడా!) అని, **"నమక్కుమ్ పూవిన్‌మిశై నఙ్గైక్కుమ్"** (మనకు, పద్మనివాసిని అయిన లక్ష్మికి వల్లభుడు) అని, **"తిరునారణన్‌తాళ్"** (లక్ష్మీనారాయణుని శ్రీచరణా లను) అని, **"తిరువాణై నిన్నాణై"** (లక్ష్మిపై ఆన, నీపై ఆన) అని పల్కిన రీతిలో శ్రీమన్నారాయణుని అనుభవించినందువల్ల **"వేరి మాఱాద పూమేల్ ఇరుప్పాళ్"** (పరిమళం మాఱని పద్మాలలో నివసించేది) గా వేంచేసి ఉండి, భక్తులక్లేశాలను తీర్చడంకోసం స్వామివక్షస్సులో నిత్యవాసం చేసే పిరాట్టియొక్క, నారాయణునియొక్క పరత్వ సౌలభ్యాలను చూపే గుణచేష్టితాలనే తెలిపే పాశురమాలికలు పాడడంకోసమే తిరువాయ్ మొళి ప్రబంధాన్ని పాడి ప్రయత్నించి, దాని చివరలో ఆ స్వామి శ్రీచరణాలను చేరినవారు కావడంవల్ల మహర్షుల కంటే, మిగిలిన ఆళ్వార్ల కంటే ఉన్నతులైన నమ్మాళ్వార్ల శ్రీచరణాలను ఆశ్రయించిన గురుపరంపరను చేరాముకదా- అని తమ ఉజ్జీవనానికి ఆనందించి, తమను ఆశ్రయించినవారు ఈవిధంగా ఉజ్జీవనాన్ని పొందడం తమ ఉజ్జీవనంగా భావించి, ఆ నమ్మాళ్వార్ల మహోత్సవాన్ని నిత్యంగా నిర్వహించడంతోపాటు, వారి దివ్యప్రబంధాలను సామర్థ్యంతో వర్ధిల్ల చేసే పెంపుడు తల్లి (హితపరురాలైన తల్లి) కావడం భగవద్రామానుజులకు కల ఒక ఉత్కర్ష. అంతే కాక, శ్రుతి- స్మృతి - ఇతిహాస - పురాణ- పాంచరాత్ర - ధర్మశాస్త్ర - న్యాయ - మీమాంసా - సాంఖ్య - యోగాది సర్వశాస్త్రాలను అధ్యయనం చేసిన బహుశ్రుతులచేత సారాసార వివేచనకోసం ఆశ్రయింపబడడంతోపాటు, బహుశ్రుతులైన కుదృష్టులను సుదృష్టులుగా మార్చే సామర్థ్యాన్ని కల్గి ఉండడం తెలిసేట్లుగా సర్వవిద్యానదులు ఋజువుగా ప్రకాశించే (ప్రవహించే) గొప్ప పర్వతమై



ఉండడం ఇంకొక ఉత్కర్ష. ఈ విధంగా పరాంకుశులనే పేరును కల ఆళ్వార్ల మనస్సును (అభిప్రాయాన్ని) పూర్తి చేయడంకోసం అవతరించిన శ్రీరామానుజుల చరణారవిందాన్ని స్థిరంగా చేరితే, ఉభయవేదాంతార్థాలలో స్పష్టత, నిష్ఠ, అనంతరకాలంలో వాటి ఫలం అయిన పరమ ప్రయోజనాన్ని (మోక్షాన్ని) పొందడమనే ఉజ్జీవనం కల్గుతుంది. వారి కల్యాణగుణాలను మనస్సులో ఉంచుకొని శ్రీరామానుజులు, యతిరాజులు, ఎమ్బెరుమానార్, ఉడైయవర్ - అని ఇటువంటి వారి తిరునామాలను అర్థానుసంధానంతో ఓ మనసా! పల్కుదాం, రా.

వాటిలో, మొదట అవతారకాలంనుండి పొందబడిన నామం రామానుజనామం. ఈ పదం లక్ష్మణుని, శ్రీకృష్ణుని తెలుపుతుంది. అనుభవ, కైంకర్యాలనే శ్రీతో సంపన్నులు అయిన లక్ష్మణులు, వీరు. యతిరాజసప్తతిలో- **"శమితోదయశంకరాదిగర్వః స్వబలాదుద్ధృత యాదవప్రకాశః, అవరోపితవాన్ శ్రుతేరపార్థాన్ నను రామావరజ స్స ఏష భూయః"** (శంకరుడు మొదలైనవారి గర్వాలను శమింపజేసినవాడు, తన బలంతో యాదవకులాన్ని ఉద్ధరించినవాడు, అర్జున విరోధులైన కౌరవులను నిరసించినవాడైన శ్రీకృష్ణుడే - శంకరుల, ఉదయనుల మతాలను నిరసించినవారు, తనబలంతో యాదవప్రకాశులను ఉద్ధరించినవారు, శ్రుతుల అపార్థాలను తొలగించినవారైన శ్రీరామానుజులు) అని శ్రీకృష్ణునిగా శ్రీరామానుజులు స్తుతింపబడడాన్ని గమనించండి. **"భరతాయ పరం నమోఽస్తు తస్మై ప్రథమోదాహరణాయ భక్తిభాజామ్"** (భక్తులకు మొదటి ఉదాహరణమైన ఆ భరతునకు గొప్ప నమస్కారం.) అనే భరతునిగా, ఆళ్వార్ల పట్ల అభినివేశాన్ని కల్గి ఉండడం వల్ల భగవద్భక్తభక్తులై (నిత్యశత్రుఘ్నులైన) శత్రుఘ్నునిగాను భావించవచ్చు కనుక రామానుజులు అవుతున్నారు. శ్రీరామునకు తరువాత సామాన్య-విశేషధర్మస్థాపం, శరణాగతరక్షణం చేసిన వీరే శ్రీరామునకు అనుజులు. **"రామా"** అనే గోదాదేవి, "అనుజా'' - ఏ ఆళ్వార్లకు పిమ్మట ఆవిర్భవించిందో, ఆమెకు

పిమ్మట ఆవిర్భవించినవారు ఏ ఆళ్వార్లో, ఆ ఆళ్వార్లు అందరు రామానుజులే. ఆ ఆళ్వార్లే వీరు. నిగ్రహమనేది తెలియకుండా, అనుగ్రహరూపిణియై, రామాశబ్దవాచ్య అయిన లక్ష్మీదేవివలె, ఆమెను అనుసరించి ప్రజారక్షణం చేసినందువల్లకూడా రామానుజులు అయినారు. **"రమయతీతి రామః"**- అనబడే రామునిగా భగవానుడు అవతరించేటపుడు అంతా అతని వెంటనే అవతరిస్తున్నందు వల్ల రామానుజులనబడే పంచాయుధాలు, విష్వక్సేనులు, ఆదిశేషులు, గరుడుడు - అనే వీరికి యొక్క స్వరూపమే వీరు కనుక రామానుజులు. ఈ విధంగా ఉండే విశేషాలు భావ్యాలు. శ్రీభాష్యంలో **"ఆనీతాం తు నిజాక్షైః"** అనే చోట శ్రీభాష్యకారులు గరుత్మంతులు- అని తత్త్వటీకలో శ్రీదేశికులు అనుగ్రహించడం కూడా గమనార్హం. ప్రారంభంలో - **"రామానుజదయా పాత్రమ్"** అనేచోట మా వ్యాఖ్యానం గమనించదగినది. ఒక్కొక్క పాశురంలోను **'ఇరామానుశ'** అనే పదంలో, ఆ యా పాశురాలలో చెప్పబడ్డ అర్థాన్ని అన్వయించి అనుసంధివచ్చు.

**"పల్‌కలైయోర్"** అనే ప్రయోగానికి, పలు శాస్త్రాలు, వేదాలు అర్థసహితంగా తెలిపినవారు- అనే అర్థంతోపాటు, ఆయా భాషలు మాట్లాడే ఆంధ్ర-కర్ణాటక- మహారాష్ట్రాది దేశంలోని వారు- అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"నెఞ్జే"** అనే సంబోధనవల్ల మనస్సును వేఱొకదానిలో నిలిపి, ఏదో పలుకడం కాకుండా, చాలా శ్రద్ధతో చెప్పదలచిన సంగతి స్ఫురిస్తుంది. ఇతరుల వద్ద పల్కి, కీర్తిని పొందడంకోసం వ్రాయలేదు. మనసా! నీవు నేను బాగా తెలిసి పలుకడమే కావలసినది - అని భావం.

**2.** అవ :- చివరి ఆళ్వార్లు అయినప్పటికీ, "పరాంకుశ- పరకాల" అనే రీతిలో నమ్మాళ్వార్లకు తరువాత స్మరింపబడేవారు, శ్రీరంగప్రియులై, నమ్మాళ్వార్ల సూక్తులను తమ కాలంలో ప్రచారం చేసినవారు, అర్చామూర్తులుండే చోట్ల అంతా **"శ్రీరంగశ్రియ మనుదినం సంవర్ధయ"** అని సర్వలోకహితైషి అయిన తమకు విష్ణ్వాలయాలను ఇంచు మించుగా దివ్యదేశాలను చేసి, మార్గదర్శనం చేసినవారైన తిరుమంగై ఆళ్వార్ల పట్ల శ్రీరామానుజులకు గల అభినివేశవిశేషాన్ని ప్రధానంగా చేసికొన్నది- రెండవ పాశురం. అన్నిటినీ విడచి మనస్సును సంబోధించడం- మరస్సు స్థితిని తెలిసికొని ఉన్నందువల్ల - అని అంటున్నారు.



**కళ్ళార్ పొళిల్ తెన్నరంగన్, కమలప్పతఙ్గళ్ నెంజిల్**
**కొళ్ళా మనిశరై నీంగి, కుఱైయల్ పిరానడిక్కీళ్**
**విళ్ళాత అన్బనిరామానుశన్ మిక్క శీల మల్లాల్**
**ఉళ్ళాతెన్నెంజు, ఒన్ఱఱియేన్ ఎనక్కుఱ్ఱ పేరియల్వే**

కళ్ ఆర్ = తేనె వ్యాపించిన (నిండుగా ఉండే), పొళిల్ = ఉద్యాన వనాలను అంతటా కల్గిన, తెన్ అరఙ్గన్ = అందమైన శ్రీరంగనగరానికి నాథుని, కమలమ్ పదఙ్గళ్ = తామరలవంటి శ్రీచరణాలను, నెఞ్జిల్ కొళ్ళా = మనస్సులో భావించని, మనిశరైనీఙ్గి = నీచులైన మానవులవద్ద నుండి తొలగిపోయి, కుఱైయల్ పిరాన్ = తిరుమంగై మన్నన్‌యొక్క, అడి కీళ్ = శ్రీచరణాలకింద, విళ్ళాద అన్బన్ = విడువని భక్తిని కల, ఇరామానుశన్ = శ్రీరామానుజుల, మిక్క శీలమ్ అల్లాల్ = అందఱికంటె గొప్పదైన గుణచేష్టితాలను తప్ప వేఱొక విషయాన్ని, ఎన్ నెఞ్జు ఉళ్ళాదు = నా మనస్సు చింతించడంలేదు, ఎనక్కు ఉఱ్ఱ = నీచుడనైన నాకు కల్గిన, పేర్ ఇయల్‌వు = ఈగొప్పతనానికి, ఒన్ఱు అఱియేన్ = తగిన కారణం నాకు తెలియలేదు.

(పాశురంలో) **"నీఙ్గి"** అనే పర్యంతం శ్రీరామానుజులకు అన్వయిస్తుంది; వీరి మనస్సుకు అన్వయిస్తుంది. శ్రీరంగనాథునకు భక్తులు కానివారిని విడచి పోయే స్వభావం, శ్రీరంగంలో సుఖంగా చివరలో నివాసాన్ని కోరిన శ్రీరామానుజులకు, పెరియకోయిల్‌నంబి అనే వీరికి ఉన్నది. **"కుఱైయల్ పిరాన్"** అయిన కలియన్ నమ్మాళ్వార్లను ఆళ్వార్ తిరునగరినుండి

శ్రీరంగానికి వేంచేపు చేసికొనివచ్చి, పారాయణ కైంకర్యాన్ని నిర్వహించారు. "మన్ను మరజ్గత్తు ఎమ్మామణియై" అని పలికారు. గోదాదేవిని శ్రీరంగ నాథుడు తన వశం చేసికొన్నందువల్ల, (పరకాల)నాయకి అయిన తమను, శ్రీరంగనాథుడే పరిగ్రహించడంకోసం ముందుకు వస్తాడు - అనే భావం వారికి ఉన్నది. "మనిశరై"- శ్రీరంగనాథుని మనస్సులో భావించనివారు మానవులు కారు; మానవరూపాన్నిబట్టి వారిని నీచమానవులుగా గ్రహిస్తే గ్రహించాలి. శ్రీరామానుజులకు "మమ మద్భక్తభక్తేషు" (నా భక్తులకు భక్తుల పట్ల నాకు ప్రీతి ఎక్కువగా ఉంటుంది) అని భగవానుడు పల్కిన రీతిలో తిరుమంగై ఆళ్వార్లవరకు ప్రేమ (భక్తి) వర్ధిల్లడం ఇతరులకంటే వారికి గల వైలక్షణ్యం. ఇటువంటి శ్రీరామానుజుల కల్యాణగుణాలలో అభినివేశం నా మనస్సుకు కల్గడంలో ఇవి పోషకాలు అంతే. భగవద్రామానుజుల పట్ల కోట్లాది మానవులు భక్తిని కల్గి ఉన్నారు కదా! అందరిపట్ల సాధారణమైన కారణాన్నే పరిశీలించాలి. (అది ఏది? అంటే) వారివద్ద ఉండే శీలం, పరత్వమే కారణం. రామానుజుల మూర్తి గాయత్రి అర్థమేనని గమనించి, గాయత్రీజపానికి సాటి వస్తుంది రామానుజనామ జపమని తోచి, ఆ రామానుజనామస్తోత్రంలో ఉద్యమించే అవధికి నా మనస్సు ఉన్నది. దీనినిగూర్చిన కారణవిచారం ఎందుకు? లభించినందు వల్ల ఆనందించడమే కావలసినది.

**3.** అవ :- ఇంతటితో నిలువకుండా మనస్సు, "శ్రీరామానుజులే మనం నేరుగా ఆశ్రయించేటట్లు వేంచేసి ఉన్నపుడు, వారిని ఆశ్రయించినవారిని ఆశ్రయించడం **"గుణానాం చ పరార్థత్వాత్"** (గుణాలు ఇతరులకోసం అయినందున), **'న హి భిక్షుకా భిక్షుకాంతరం యాచతే"** అనే న్యాయంతో భావించకుండా, **"అడియారడియార్ తమ్మడియారడియార్"** (దాసులకు దాసులకు దాసులకు దాసులు) అనే రీతిలో రామానుజభక్తదాసులనే ఫలాన్ని నాకు పొందించే పర్యంతానికి వివేకాన్ని పొంది, నిశ్చయాన్ని



పొందినందుకు దానిని (మనస్సును) శ్లాఘిస్తున్నారు. భగవద్రామానుజుల అంతరంగశిష్యులైన కూరేశులను ఆశ్రయించికదా, అముదనార్ ఉజ్జీవించారు. వీరికి ఇంతటి వివేకం కల్గడానికి కారణం ప్రారంభంలో కూరేశుల కటాక్షాన్ని పొందడమే. తత్ఫలంగా ఆవిర్భవించిన ఈ పరమాచార్యస్తుతి ఆచార్యులైన కూరేశులకు, వారితో సాటి వచ్చే మిగిలిన భాష్యకారశిష్యులైన సింహాసనాధిపతులకు నిత్యానుసంధేయమైనది అంటే, ఆహా! ఏమి వీరి ప్రాప్యవైభవం!

**పేరియల్ నెంజే! అడిపణిన్దేనున్నై, ప్పేయ్ప్పిఱవి**
**ప్పూరియరోడుళ్ళ శుట్రమ్ పులర్త్తి, ప్పొరువరుమ్ శీర్**
**ఆరియన్ శెమ్మై ఇరామానుశమునిక్కు అన్బు శెయ్యుమ్**
**శీరియ పేఱుడైయార్, అడిక్కీళ్ ఎన్నై చ్చేర్త్తదఱ్కే.**

పేర్ ఇయల్ నెఞ్జే = గొప్పస్వభావాన్ని కల్గిన మనసా!, ఉన్నై అడిపణిన్దేన్= నీకు ప్రణామం చేసి కృతజ్ఞుడనవుతున్నాను, పేయ్ పిఱవి = ఆసుర రాక్షసజన్మలచే, పూరియరోడు = తమనుపూరించు కొంటున్న వారితో, నీచులైన వారితో, ఉన్న = నాకుండే, శుట్రమ్ = అవైష్ణవబంధు సంబంధాన్ని, పులర్త్తి = ఎండగట్టి పోగొట్టుకొని, పొరువు అరు = సాటిలేని, శీర్ = కల్యాణగుణనిధియై, శెమ్మై = ఆర్జవమే మూర్తీభవించిన శ్రీరామానుజ మునులపట్ల, అన్బు శెయ్యుమ్ = ప్రేమను కల్గి ఉండడమనే, శీరియ పేఱు = గొప్పదైన పురుషార్థం, ఉడైయార్ = పొందిన మహాత్ములు కూరేశులవంటివారి, అడి కీళ్ = శ్రీచరణాలచెంత, ఎన్నై నీ శేర్వదఱ్కు= నన్ను నీవు చేర్చినందుకు, ఉన్నై అడి పణిన్దేన్ = నేను చేసే ప్రత్యుపకారం నీ పాదాలను సేవించడమే.

మనసా! పెరియకోయిల్ నంబి అనే పేరును పొందినందుకు తగినట్లు పెరియ కోయిల్‌ను (శ్రీరంగాన్ని) నమ్మినందులకు ఫలంగా సాత్త్వికమైన ఆహారం భుజించినందులకు ఫలంగా నీవు చాలా శుద్ధమై,

నాకు ప్రాచీనమైన శ్రీవైష్ణవానికి నేరుగా విరుద్దంగా ఉండే రాక్షసాసుర స్వభావం కలవారితో సంబంధం - అనే దోషాన్ని తీర్చి, ఆ విధంగా దోషాన్ని తొలగించినంతమాత్రంలోనే, "సాటి లేని గుణాలను కలవారు"- అని కీర్తింపబడే శ్రీరామానుజుల గుణాతిశయంలో అభినివేశాన్ని పొంది, వారికి కైంకర్యం చేసేవారిని అందరిని సేవించి కృతార్థుడను అయే టట్లుగా, కూరేశుల శ్రీచరణాలను ఆశ్రయింపజేశావు. నా స్థితిని చూచి వారే వారి పాదాలను సేవించే నన్ను ఈ విధంగా ప్రేమతో కీర్తించే విధంగా అయిన తరువాత, నేను నాకు సాధనంగా అధీనమై ఉండే నీ పాదాలనుసేవించడం ఎందుకు తగదు? నీవల్ల జరిగిన ఉపకారానికి సదా కృతజ్ఞతలు సుమా!

**4.** అవ :- ఈ నూత్తన్దాది రచించడంవంటి నా సత్కృత్యాలకు కారణం - కూరేశులచే దోషం లేకుండా సంస్కరింపబడి, భగవద్రామానుజులు తమ శ్రీచరణాలను నా శిరసుసలో తామే నేరుగా నిలుపడమే- అనే భావం స్ఫురించేటట్లు ఇందులో అముదనార్ పల్కుతున్నారు.

ఎన్నై ప్పువియిల్ ఒరు పొరుళాక్కి, మరుళ్ శురంద
మున్నై ప్పళవినై వేరఱుత్తు, ఊళిముతల్వనైయే
పన్న ప్పణిత్త ఇరామానుశన్ పరన్ పాతము మెన్
శెన్ని త్తరిక్క వైత్తాన్, ఎనక్కేతుమ్ శిదైవిల్లైయే.

పువియిల్ = ఈ ప్రకృతిలో, ఎన్నై = నేనని అహంకారంతో ఉండే నిన్ను, ఒరు పొరుళ్ ఆక్కి = సత్తను కల్గించి, ఒక వస్తువుగాచేసి, మరుళ్ శురన్ద = నాకు అజ్ఞానమూలంగా వచ్చిన, మున్నైపళ = అనాదికాలంగా ఈజనించే స్వభావంలో చేరిన, వినై వేర్ = పాపాలకు కారణమైన, అహంకారమమకారాలను, అఱుత్తు= పోగొట్టి, ఊళి ముదల్వన్ = మహాప్రళయంలో కూడా ఉండే పద్మనాభునే, పన్న = పొగడి, నమస్కరించి, దేవతాంతరసంబంధం లేకుండా ప్రకాశించేటట్లు, పణిన్ద = నాకు



సదుపదేశాన్ని చేసిన, పరన్ ఇరామానుశన్ = పద్మనాభుని కంటే గొప్పవారైన శ్రీరామానుజులు, పాదమ్ ఉమ్ = తమ శ్రీచరణాలను, ఎన్ శెన్ని = నా శిరస్సు, తరిక్క వైత్తాన్ = వహించి ధన్యుడనయేటట్లు చేశారు, ఎనక్కు = ఈ భాగ్యం పొందిన తర్వాత నాకు, శిదైవు ఏదుమ్ ఇల్లై = కొఱత అనేది కొంచెంకూడా లేదు.

పెరియంబిని ఆశ్రయించిన తాము (రామానుజులు) **"యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః"** అని శ్రీయామునులను ధ్యానించి సత్తను పొందినట్లే, కూరత్తాళ్వాన్‌ను ఆశ్రయించిన నన్ను తమ స్తుతితో తగిన వస్తువుగా చేశారు - అని తలుస్తున్నాను. కూరేశుల మూలంగా, సాక్షాత్తుగా నా ప్రాక్తన కర్మలను పోగొట్టి, వాటి కారణమైన అహంకార మమకారాలను నిర్మూలించి, శ్రీరంగనాథునకు నన్ను అనన్యభక్తునిగా చేశారు, తమ ఉపదేశమాత్రంతో నా శిరస్సులో తమ శ్రీచరణాలనునిలిపి, విపరీతమైన లలాటలిపిని చెఱిపివేశారు. ఇక ఏనాడూ హితమే జరుగుతుంది. పాదుకలు శిరస్సులో అమరినందువల్ల గొప్పదైన పాదుకాసహస్రాన్ని రచించడం శ్రీదేశికులకు సులభమైనది. అనే విషయం **"హిమవన్నలసేతుమధ్యభాజాం భరతాభ్యర్చితపాదుకావతంసః, అతపోధనధర్మతః కవీనామఖిలేష్వస్మి మనోరథేష్వవాహ్యః"** అనే శ్లోకం తెల్పుతుంది. అదే రీతిలో ఈపాశురం కూడా అని చెప్పవచ్చు.

**5.** అవ :- శ్రీరామానుజుల ఇన్ని గుణాలను మూలాధారంగా గ్రహించి తాము రచించే ఈ గ్రంథంలో భక్తులకు దోషమే కన్పించదు. ప్రేమలేని వారిని నేను చూడను - అని అంటున్నారు. (ఈపాశురంలో)

ఎనక్కుఱ్ఱ శెల్వ మిరామానుశ నెన్ఱు, ఇశైయ కిల్లా
మనక్కుఱ్ఱ మాందర్ పళిక్కిల్ పుకళ్, అవన్ మన్నియ శీర్
తనక్కుఱ్ఱ అన్బర్ అవన్ తిరునామఙ్గళ్ శాఱ్ఱుమెన్పా
ఇనక్కుఱ్ఱమ్ కాణకిల్లార్, పత్తియేయ్న్ద ఇయల్విదెన్ఱే.

ఎనక్కు = పూర్వం తెల్పిన రీతిలో తేటపడిన (జ్ఞానాన్ని కల) దాసునకు (నాకు), ఉట్ర శెల్వమ్ = ప్రాప్తమైన సంపత్తు, ఇరామానుశన్ = పరమాచార్యులైన శ్రీరామానుజులే, ఎన్రు = అని తేటపడి, (తెలిసికొని), అవన్ తిరు నామజ్గళ్ = వారి కల్యాణగుణాలను పలికే నామాలతో, శాట్రుమ్ = ఘోషించే, ఎన్ పా ఇనమ్ = నా పాశురాల మాలికలలో, అవన్ పన్నియ శీర్ తనక్కు = శ్రీరామానుజులకు స్థిరంగా ఉండే గుణాతిశయానికి, ఉట్ర అన్బర్ = తగిన భక్తిని కల మహాత్ములు, ఇదు = ఈ నూట్రన్దాది అనేది, పత్తి ఏయ్న్ద ఇయల్వు ఎన్రు = వేఱు కారణం ఏమీ లేకుండా భక్తి పరీవాహంగా పుట్టినదని తెలిసికొని, కుట్రమ్ కాణ కిల్లార్ = దోషాలున్నా, చూచే అవకాశాన్ని పొందరు, ఇశైయకిల్లార్ = దీనిని అంగీకరించని, మనమ్ కుట్రమ్ = శ్రీరామానుజులవద్దకు వారిని చేర్చిన వారివద్ద కూడా దోషాన్ని లెక్కించే మనస్సును కల, మాన్దర్ = మందులైన మానవులు, పలిక్కిళ్ = దూషిస్తే (కొఱతను పల్కితే), పుకళ్ = అదికూడా పొగడ్తగానే గ్రహించవచ్చు.

**"ఎనక్కు ఉత్త శెల్వమ్ ఇరామనుశన్"** అనే పర్యంతం గల భాగంలో మనలను గూర్చి చెబుతున్నారు. కనుక, అది **"శాత్తుమ్"** అనే పదంతో అన్వయిస్తుంది. ఇక, **"ఉత్త అన్బర్"** అనే భాగంతో చేరిస్తే, భక్తులలో ఒక్కొక్కరు "నాకు ప్రాప్తమైన సంపద శ్రీరామానుజులే"-అని భావిస్తారు- అనే అర్థాన్ని చెప్పవచ్చు. లేక, **"ఇశైయకిల్లా"** అనే భాగంతో చేరిస్తే, ఒక్కొక్కరు వాస్తవానికి తనకు తగిన సంపద శ్రీరామానుజులు -అని అంగీకరించాలి. ఆ విధంగా అంగీకరించే భాగ్యాన్ని పొందనివారు ఏదైనా దోషాలను చెబుతున్నారంటే, అది మంచి విషయంలోనే. వారు నిందించినందువల్లనే ఇది మంచిది - అని ఇతరులు గుర్తిస్తారు. ఇది ఆచార్యస్తుతి. లేని గుణాలను ఆచార్యులలో ఆరోపించి పల్కితేకూడా అది వారిని స్తుతించినట్లే కాగలదు. అయితే దానికి (లేనిగుణాల ఆరోపణలకు) ఇక్కడ అవకాశం లేదు. భగవద్రామానుజులలో నిత్యం



కల్యాణగుణాలు స్థిరంగా ఉంటాయి. భగవానునకు ఒక్కొక్క పర్యాయం గుణం మాఱివచ్చు (పరత్వ-సౌలభ్యాలలో మార్పు ఉండవచ్చు) కాని, శ్రీరామానుజులకు మాత్రం (సౌలభ్యగుణంలో) మార్పు ఉండదు. వారి భక్తులు ఆ కల్యాణగుణానికి తగిన భక్తులు. అటువంటి మహాత్ములు ఆదరింపదగిన స్తుతి ఇది. నేను ఏమీ కోరని సమయంలోనే భక్తిపరీ వాహంగా స్తుతిస్తే తప్పు నిలువలేని స్థితిని పొందినందువల్లనే ఈ స్తుతి ఆవిర్భవించింది." - అని గ్రహిస్తారు. **"పళిక్కిల్ కుత్తమ్ కాణకిల్లార్"** అని కూడా అన్వయించవచ్చు. అపుడు **"పుకళ్ శీర్"** -పొగడ్త అనే సంపద, లేక, **"పుకళ్ అన్బర్ - పొగిడే భక్తులు"** అని వివరించవచ్చు.

**6.** అవ :- **"పత్తి ఏయ్న్ద ఇయల్ విదు"** (భక్తిపరీవాహరూపంగా ఆవిర్భవించింది ఇది) అనే కారణంచేతనే దోషాన్ని చూడలేరు" అని అనడం ఎందుకు? గొప్ప కవిత్వం కనుక ఇది కావ్యలక్షణాలను అన్నిటినీ కల్గి ఉన్నతంగా ఉండే ప్రబంధమనే కారణంచేత స్తుతించవచ్చును కదా"- అని అనగా, ఆ యోగ్యత నాకు, నా కవిత్వానికి లేదు" అనే నైచ్యాను సంధానాన్ని ఇందులో అముదనార్ చేస్తున్నారు.

> **ఇయలుమ్ పొరుళుమ్ ఇశైయ త్తొడుత్తు, ఈన్కవికళ్ అన్బాల్**
> **మయల్ కొండు వాళ్త్తు మిరామానుశనై, మతి యిన్మైయాల్**
> **పయిలుమ్ కవికళిల్ పత్తి యిల్లాత ఎన్ పావినెంజాల్**
> **ముయల్కిన్ఱనన్, అవన్ తన్ పెరుమ్ కీర్త్తి మొళిన్దిడవే.**

ఈన్ కవికళ్ = తీయని కవిత్వాన్ని చేసేవారు, అన్బాల్ = ప్రేమ కలసినందున, మయల్ కొణ్డు = వ్యామోహాన్ని కల్గి, వాళ్త్తుమ్ = పల్లాండుపాడి స్తుతించదగిన, ఇరామానుశనై = భగవద్రామానుజులను, ఇయల్ ఉమ్ పొరుళ్ = శబ్దాలను, అర్థాలు, ఇశైయ = ఒకదానితో ఇంకొకటి పొసగి ఉండేటట్లు, తొడుత్తు పయిలుమ్ = చేర్చి అభ్యసించే, కవికళిల్ = (కవిత్వాన్ని పలికే) కావ్యాలలో, పత్తి ఇల్లాద = వాటిలో

రసానుభవం చేయాలనే ఆశ కల్గి ఉండకుండానే స్తుతించాలని ప్రయత్నించే, పావి = మహాపాపి అయిన, ఎన్ నెఞ్జాల్ = స్వతంత్రమైన నా మనస్సుతో, మతి ఇన్మైయాల్ = తన నైచ్యాన్ని విషయం యొక్క గౌరవాన్ని గమనించనందున, అవన్‌తన్ = శ్రీరామానుజుల, పెరు కీర్‌త్తి = ఎక్కడా ఇముడని (విస్తృతమైన) కీర్తిని గూర్చి, మొళిన్దిడ = పూర్తిగా పలకాలని, ముయల్‌కిన్ఱేన్ = ప్రయత్నం చేస్తున్నానే! (ఇది కూడా ఒక మతిహీనతయే కదా!).

కూరేశులు, భట్టర్, ముదలియాణ్డాన్ (దాశరథి) తిరుక్కురుకైప్పి రాన్ పిళ్ళాన్, ఎమ్బార్, శోమాశియాణ్డాన్ - మొదలైన మహాకవులు భగవానుని స్తుతిస్తే, ఆ కవిత్వం శబ్దార్థపుష్టిని కల్గి ఉంటుంది. ఆలంకారి కులు **"సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్"** అని కావ్యనిర్వచనాన్ని చేశారు. శబ్దగుణాలు, అర్థగుణాలు, అర్థానికి తగిన శబ్దాలు, ఒక అర్థానికి ఇంకొక అర్థానికి పొందిక, ఒక శబ్దానికి ఇంకొక శబ్దంతో పొందిక, రసానుగుణమైన కూర్పు, వ్యంగ్యార్థవైభవం - అన్నీ ఉండాలి. వాటిలో దృష్టి పెట్టినట్లయితే భక్తి, వ్యామోహం తగ్గినా కావ్యం గొప్పది కాదు. ఈ విధంగా అన్నీ పొందికగా ఉండేటట్లు రచించేవారికే శ్రీరామానుజుల గొప్ప యశస్సును గూర్చి పలికే అవకాశం కొంచెం అయినా ఉంటుంది. ఆ కవిత్వాన్ని అనుసంధించి రసానుభవాన్ని పొంది కాలక్షేపం చేయవచ్చు కదా! దానిని లేని, మతి లేని నా మనస్సు (వర్ణ్య వస్తువుయొక్క గొప్పతనాన్ని, తన నైచ్యాన్ని గమనించని నా మనస్సు) తాను ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నది. ఇటువంటి మనస్సును కల నేను ఎక్కడ ? భగవద్రామానుజుల గొప్ప యశస్సు ఎక్కడ ? వర్ణించాలనే నా నిర్ణయం మతిహీనతయే. అయినా, మనస్సు నా వశంలో లేదు. ఈ స్థితిని గమనించియే దీనిలోని కవిత్వాన్ని శ్లాఘించాలి.

7. అవ :- అయినా, నేను చేసే ఈ స్తుతి నా స్వరూపానికి తగనిది



కాబోదు. కూరేశుల శ్రీచరణాలను ఆశ్రయించినందువల్ల అధికారి అయిన నేను చేయడం అక్రమం కాదు. భగవద్రామానుజుల కల్యాణ గుణాలు ఎవరికైనా వాచామగోచరాలే. **"యతో వాచో నివర్తంతే"** అనదగిన ఆ కీర్తి ఏవిధంగా ఎవరికి స్తుతించడానికి సాధ్యం అవుతుంది? ఇది, వాక్కు సార్థకం కావడంకోసం చేస్తున్నదే తప్ప, గుణాలను పూర్తిగా కీర్తించడంకోసం మాత్రం కాదు. ''అయితే, మతి ఎందుకు వర్ణించాలని ప్రయత్నిస్తున్నారు? సాక్షాదాచార్యులైన కూరేశులనుగూర్చి పాశురాలను రచించి, ధన్యులు కావచ్చు కదా!'' అని అడుగుతున్నారా! ఆ ఆచార్యుల కీర్తి కూడా వాచామగోచరమే. అసంఖ్యేయగుణాకరత్వంతో పాటు, దోషరాహిత్యం కూడా వారివద్ద పూర్ణమే. వారిని వర్ణించడంకూడా నావల్ల కాదు- అని గ్రహించాను. ఒక స్తుతికే శక్తి లేని నేను, రెండు స్తుతులను చేయలేనివాడనే కదా! వారి ముఖోల్లాసంకోసమే నాకు అందని కీర్తినిగూర్చి పలుకాలని ప్రయత్నించి ముందుకు వస్తున్నాను. ఇదే దుర్మార్గాలను దాటడానికి చాలు కనుక, ఏతావన్మాత్రంతో నిలుస్తాను- అనే భావం స్ఫురించేటట్లు పల్కుతున్నాయి.

**మొళియై క్కడక్కుమ్ పెరుమ్ పుకళాన్, వంజ ముక్కుఱుంబామ్**
**కుళియై క్కడత్తుమ్ నమ్‌కూరత్తాళ్వాన్ శరణ్ కూడియ పిన్,**
**పళియై క్కడత్తు మిరామానుశన్ పుకళ్ పాడియల్లా**
**వళియై క్కడత్తల్, ఎనక్కిని యాతుమ్ వరుత్త మన్ఱే.**

మొళియై కడక్కుమ్ = వాచామగోచరమైన, పెరుమ్ పుకళాన్ = గొప్ప యశస్సును కలవారు, వఞ్జమ్ = జీవుని వంచించే, మూ కుఱుమ్బు ఆమ్ = అభిజనమదం, విద్యామదం, ధనమనే దోషాలు మూడు అనే, కుళియై = పడిపోయే ప్రదేశాలను, కడక్కుమ్ = దాటినవారైన, నమ్ కూరత్తాళ్వాన్ = భాగ్యవశంతో మాకు కూడా ఆచార్యులైన కూరేశుల యొక్క, శరణ్ కూడియ పిన్ = శ్రీచరణాలను చేరిన తరువాత, పళియై కడక్కుమ్ = అన్ని దోషాలను పోగొట్టే, ఇరామానుశన్ =

శ్రీరామానుజుల, పుకళ్ పాడి = కీర్తులను (గుణాలను) పాశురాలతో పలికి, అల్లా వళి = దుష్టమార్గాలలో, కడత్తల్ = సంచరించకుండా ఉండడం, ఎనక్కు=నాకు సిద్ధిస్తున్నది, ఇని = దీనికి మించి, యాదుమ్ = ఏదీ, వరుత్తమ్ అన్ఱు = కష్టం కాదు.

శ్రీరామానుజుల గుణాలను వర్ణిస్తే, అది దోషాలను అన్నిటినీ రూపుమాపుతుంది. భగవద్రామానుజునులు, వారి శిష్యప్రశిష్య సంతతి, వారికి ఆరాధ్యుడైన శ్రీరంగనాథుడుకూడా దాసునిపై దయ జూపితే నా పాపం అంతా పోతుంది. ఈ శ్రీరామానుజులు, నాకు ఆచార్యులై, వాచామగోచరమైన కీర్తిని కలవారై, **"ముక్కుఱుమ్బు"** అనే అభిజన విద్యాధనమదాలనే మూడు పాడుగోతులను దాటిన కూరేశులకు ఆచార్యులు - అని నేను చేసే స్తుతిలో ఆచార్యస్తుతిగా పూర్ణంగా అంతర్భవించి ఉన్నది. శిష్యునకు పరమపురుషార్థప్రాప్తి, కల్గడమే తమకు గొప్ప ప్రయోజనమని సదాచార్యుల భావన. ఆచార్యుల కీర్తియే తమ కీర్తి -అని శిష్యుని భావన. అందువల్ల, కూరేశులు భగవద్రామానుజుల విషయంగా తాము (అముదనార్) స్తుతిని చేయాలని భావించినందువల్ల, తదనుగుణంగా ఇదే దాసునకుకూడా భోగ్యమైనది. ఆచార్యులు, ప్రాచార్యులు కలిసి ఉండే చోట అంతా ప్రాచార్యులను అనువర్తించడమే శిష్యకృత్యం కనుక, దీనిని (స్తుతిని) చేయకపోవడం తగని పని అవుతుంది. కనుక, నా ఆత్మకు, ఆచార్యులకు శ్రీరామానుజభక్తులకు అందరికి ప్రియమైన ఈ విషయంలో నా ప్రయత్నం తగినదే -అని భావం.

కూరేశులు, శ్రీరామానుజులు కాశ్మీరదేశానికి పోయి, బోధాయన వృత్తిని సంపాదించి, అక్కడ దానిని చూచి, వెంటనే తిరిగి ఇవ్వవలసివచ్చి నందున, భగవద్రామానుజులు కొంత భాగం, కూరేశులు కొంత భాగం చదివి తిరిగి వచ్చారు. తరువాత, శ్రీరామానుజులు శ్రీభాష్యరచన చేసే సమయంలో చదివిన తాళపత్రంలో కూరేశులు తాము చూచిన బోధాయనవృత్తి భాగానికి విరుద్ధం కాకుండా వ్యాఖ్యానాన్ని అనుగ్రహించే



వారి అద్భుత మేధకు ఆనందపడి, వ్యాఖ్యానాన్ని లిఖిస్తూ, ఏదైనా ఒక చోట మార్పు తోస్తే, ఈ సందర్భంలో ఈ విధంగా వ్యాఖ్యానించాలని విజ్ఞాపించడానికి సంకోచించి, వ్రాయకుండా ఊరికే ఉండి పోయేవారట. భగవద్రామానుజులు వైరుధ్యం తోచినపుడు తెలుపమని పల్కినా, "ఆచార్యులకు మనం తెలుపడం తగదు'' అని మౌనంగానే అణగి ఒదిగి ఉండేవారట. అపుడు భగవద్రామానుజులు తామే గమనించి, ఇంకొక రీతిలో పలుకగా ఆ రీతి సరిగా ఉన్నందున చాలా ఆనందించి వ్రాసేవారట. ఇదేకదా శిష్యలక్షణం. తమకు అపారమైన జ్ఞానసంపద ఉన్నా, తమ కుమారులైన భట్టర్, శ్రీరామపిళ్ళై -అనే ఇద్దఱు ఎమ్బార్‌ను (గోవింద భట్టర్‌ను) ఆశ్రయించేటట్లు చేసి, ఆనందించారట. ఇదేకదా విద్యామదరాహిత్యం. శ్రీభాష్యకారుల శ్రీచరణాలతో సాటి రాదని తమకు ఉండే అపారసంపదను అంతటిని త్యజించి, సతీమణితో భగవద్రామా నుజుల శ్రీచరణసన్నిధిలోనే స్థిరంగా నివసించిన వీరు, "తాము భుజించడంకోసం ఉండే సువర్ణపాత్రనుమాత్రం అయిన ఉండనీ'' - అని తన ఒడిలో దానిని కట్టి తీసికొని వచ్చే వారి పత్ని దారిలో చీకటిలో అరణ్యామార్గం ద్వారా పయనించడానికి భయపడినపుడు, ఒడిలో విలువైనది ఉన్నపుడు కదా దారిలో భయం!'' అని అంటూ దానిని అక్కడే తీసి విసరివేయమని చెప్పారట. ఈ విధంగా చేసేవారెవరు? ఉన్నత కులంలో పుట్టినా, భగవద్రామానుజుల భాగినేయులైన (మేనల్లుడు) ముదలియాణ్డాన్‌తో సంలాపించేటపుడు, "భగవద్రామానుజులతో దేహ సంబంధం కొంచెంకూడా తనకు కలుగలేదే! నా జన్మ ఏమి జన్మ!'' - అని వాపోయేవారట. భగవద్రామానుజుల భిక్షకోసం అరటి ఆకును కోయడానికి వెళ్ళినపుడు, కోసిన ఆకునుండి నీరు కారడం చూచి "అయ్యో! జీవహింసను చేశానే!'' అని మూర్ఛిల్లారట. కృమికంఠుడు **"శివాత్ పరతరం నాస్తి"** (శివుని కంటే గొప్ప తత్త్వం ఇంకోటిలేదు) అని

వ్రాసి అందఱి సమ్మతిని పొందడంకోసం పంపినపుడు, తమ మనస్సాక్షికి విరుద్ధంగా ప్రవర్తించడానికి అంగీకరించక, ఆ రాజుకు వివేకాన్ని కల్గించాలనే భావనతో **"ద్రోణమస్తి తతః పరమ్"** (అంతకంటే పెద్ద కొలత కుంచం ఉన్నది) అనివ్రాసిన వీరు, అతనివల్ల తమ నేత్రాలు కోల్పోయినా, ఆ రాజుకు కీడు తలవరాదు- అని భావించారనే వృత్తాంతం ప్రసిద్ధం. ఈ విధంగా వీరి మహిమ అనంతం.

**8.** అవ :- ఇంతవరకు నూత్తన్దాదికి ఉపోద్ఘాతం. ఈ పాశురాలుకూడా శ్రీరామానుజుల స్తుతియే. ఇకపై శ్రీరామానుజులకు ఆళ్వార్లపట్ల, వారి దివ్యప్రబంధాలపట్ల గల అభినివేశాన్ని కొన్ని పాశురాలలో తెలిపి, తద్ద్వారా ఈ రామానుజనామ కీర్తనం చేయాలని తలచి, ముందుగా ముదల్ ఆళ్వార్లలో మొదటివారైన పొయ్‌కై ఆళ్వార్ల అనుసంధానాన్ని చేస్తున్నారు.

**వరుత్తుమ్ పుఱవిరుళ్ మాట్ర, ఎమ్ పొయ్‌కై ప్పిరాన్ మఱైయిన్**
**కరుత్తిన్ పొరుళైయుమ్ శెందమిళ్ తన్నైయుమ్ కూట్టి, ఒన్ఱ**
**త్తిరిత్తు అన్ఱెరిత్త తిరువిళక్కై, త్తన్ తిరువుళ్ళత్తే**
**ఇరుత్తుమ్ పరమన్, ఇరామానుశన్ ఎమ్మిఱైయవనే.**

ఎమ్ పొయ్‌కై ప్పిరాన్ = మనకు ఉపకారం చేసిన పొయ్‌కై ఆళ్వార్లు, వరుత్తుమ్ = జనాన్ని బాధించే, పుఱ ఇరుళ్ = విషయప్రావణ్యమనే చీకటిని, మాట్ర = పారదోలడంకోసం, మఱైయిన్ కరుత్తిన్ = వేదాంతంయొక్క, పొరుళ్ ఉమ్ = అర్థాన్ని, శెమ్ తమిళ్ తన్నై ఉమ్ = శుద్ధమైన ద్రావిడశబ్దాలను, కూట్టి = చేర్చి, వేదార్థాన్ని ద్రావిడీకరించి, ఒన్ఱై తిరిత్తు = రెండిటిని చేర్చి వత్తిగా చేసి, ఎరిత్త తిరు విళక్కై = వెల్గించిన దీపమైన ముదల్ తిరువన్దాదిని, తన్ తిరువుళ్ళత్తు = తమ మనస్సులో, ఇరుత్తుమ్ =ఎల్లప్పుడు అనుసంధించే, పరమన్ = గొప్ప ఆచార్యులైన శ్రీరామానుజులే, ఎమ్ ఇఱైయవన్ = మాకుస్వామి.



ముదల్ ఆళ్వార్లు అనుగ్రహించిన మూడు తిరువన్దాదులలో ముదల్ తిరువన్దాది, చేతనాచేతన విలక్షణమైన పరతత్త్వాన్ని తెలిపే వేదాంతార్థంలో కూర్చిన ద్రావిడసూక్తి. ఇది ఒక విలక్షణమైన వత్తి. దీనిద్వారా ఏర్పడే జ్ఞానమనే దీపం బాహ్యసంగమనే చీకటిని పోగొడు తున్నది - అని ముదల్ తిరువన్దాదికి భగవద్రామానుజులు అనుగ్రహించే అర్థమని భావం. ఇవి అన్నీ మూడు తిరువన్దాదులలో ఉన్నప్పటికీ, దాని ప్రారంభానికి తగినట్లుగా విభజించి వివరించబడింది.

**9.** అవ :- ఇందులో ఇరణ్డామ్ తిరువన్దాదిలో శ్రీరామానుజులకు గల అభినివేశాన్ని అముదనార్ తెల్పుతున్నారు.

**ఇఱైవనై క్కాణుమ్ ఇదయత్తిరుళ్ కెడ, ఞాన మెన్నుమ్**
**నిఱైవిళక్కేట్రియ పూతత్తిరువడి తాళ్‌కళ్, నెంజ -**
**త్తుఱైయ వైత్తాళుమ్ ఇరామానుశన్ పుకళోదుమ్ నల్లోర్**
**మఱైయినై క్కాత్తు, ఇన్ద మణ్ణకత్తే మన్న వైప్పవరే.**

ఇఱైవనై = సర్వేశ్వరుని, కాణుమ్ = దర్శించడంకోసం, ఇదయత్తు= మనస్సుతో ఉండే, ఇరుళ్ కెడ = ఆత్మపరమాత్మ విషయమైన అజ్ఞానం పోవడంకోసం, ఞానమ్ ఎన్నుమ్ నిఱై విళక్కు ఏట్రియ = జ్ఞానమనే పూర్ణమైన దీపాన్ని వెల్గించిన, పూదమ్ తిరువడి = పూదత్తాళ్వార్ల శ్రీచరణాలను, నెఞ్జత్తు ఉఱైయ = హృదయంలో నిలచి ఉండేటట్లు, వైత్తు ఆళుమ్ = నిలపుకొని ఆనందించే శ్రీరామానుజుల, పుకళ్ ఓదుమ్ నల్లోర్ = కీర్తిని మాటిమాటికి అభ్యసించే సత్పురుషులు, మఱైయినై కాత్తు = వేదాన్ని రక్షించి, ఇన్ద మణ్ అకత్తే = ఈభూమిలో, మన్నవైప్పవరే = స్థిరంగా నిలుపగలవారు.

పొయ్‌కై ఆళ్వార్లు **"వైయమ్, వార్ కడల్, వెయ్య కతిరోన్"** అనే విషయాలను చూపి పర్వక్రమంలో భగవానుడు సృష్టించిన అన్ని లౌకిక

విషయాలలోని దోషాలను చూపే దృష్టిలో ప్రబంధాన్ని రచించారు. అందువల్ల దోషాలు గ్రహించడంవల్ల విషయ ప్రావణ్యం తొలగింది. పూదత్తాళ్వార్లు **"అన్బే తకళియా ఆర్వమే నెయ్యాక ఇన్బురు శిన్దై యిడు తిరియా"** - భక్తియే ప్రమిదగా, అభినివేశమే నేయిగా, ఆనందాన్ని పొందే చింత వత్తిగా అని పరమాత్మయొక్క వైలక్షణ్యాన్ని విశదం చేసి, అతనిపట్ల భక్తి పెరిగేటట్లు చేశారు. అందువల్ల పరమాత్మపట్ల ప్రావణ్యమనేది నిలచింది. ఈ విధంగా ఇద్దరు ఆళ్వార్లు పరమాత్మ తప్ప వేఱేమీ పొంద దగినది కాదనే వైరాగ్యాన్ని, ప్రాప్యమైన పరమాత్మ విషయంలో మిక్కిలి యోగ్యతాబుద్ధిని కల్గించారు - అని శ్రీరామానుజుల అభిప్రాయం - అని భావం.

**10.** అవ :- పేయాళ్వార్ల ప్రబంధంలోని - శ్రీరామానుజులు అను సంధానం తెలుపబడుతున్నది.

> **మన్నియ పేరిరుళ్ మాండపిన్, కోవలుళ్ మామలరాళ్**
> **తన్నొడు మాయనై క్కండమై కాట్టుమ్, తమిళ్త్తలైవన్**
> **పొన్నడి పోఱ్ఱు మిరామానుశఱ్కు అన్బుపూండవర్తాళ్**
> **శెన్నియిల్ శూడుమ్, తిరువుడైయార్ ఎన్ఱుమ్ శీరియరే.**

మన్నియ = జీవులవద్ద స్థిరంగా నిలుపగలవారు. ఇరుళ్ = విషయప్రావణ్యం, ఆత్మపరమాత్మ తత్త్వాలు తెలియని అజ్ఞానమనే గాఢాంధకారం, మాణ్డ పిన్ = పూర్వం అవతరించిన తిరువన్దాదులతో తీరిన తరువాత, కోవలుళ్ = తిరుక్కోవలూర్ దివ్యదేశంలో, మా మలరాళ్ తన్నొడు(మ్) = లక్ష్మీదేవితోపాటు, మాయనై = సర్వేశ్వరునే కాక, ఆయనై = గోపాలుడైన శ్రీకృష్ణుని, కాట్టుమ్ = శ్రీవిశిష్టుడైనవాడే దైవమని తెలిపిన, తమిళ్ తలైవన్ = ద్రావిడభాషలో పూర్ణోపదేశాన్ని చేసినందున నాథులైన పేయాళ్వార్ల, పొన్ అడి = భోగ్యమైన శ్రీచరణా లను, పోఱ్ఱుమ్ = స్తుతించే స్వభావాన్ని కల, ఇరామానుశఱ్కు =



శ్రీరామానుజులపట్ల, అన్బు పూణ్డవర్ = భక్తిని భూషణంగా కల్గినవారి, తాళ్ = శ్రీచరణాలతో, శెన్నియిల్ శూడుమ్ = అలంకారంగా చేసికోవడం అనే, తిరు ఉడైయార్ = సంపత్తును పొందినవారు, ఎన్ఱుమ్ = ఎల్లప్పుడు, శీరియర్ = సర్వశ్రేయస్సును పొందినవారవుతారు.

ఐశ్వర్య కైవల్యాలను విడచిపెట్టి, విష్ణువుయొక్క పారమ్యం తెలిస్తే చాలదు. పొయ్కై ఆళ్వార్ల, పూదత్తాళ్వార్ల మనస్సులో ఉండే, లక్ష్మీ సహితుడైనపుడే అతడు పరతత్త్వ-హిత-పురుషార్థాలు అవుతున్నాడు- అనే సూక్ష్మార్థాన్ని **"నిత్యై వైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ, యథా సర్వగతో విష్ణుస్తథేవేయం ద్విజోత్తమ!"** (ఈజగన్మాత నిత్యమైనది. విష్ణువులను ఏనాడూ విడచిఉండనిది. ద్విజోత్తమా! విష్ణువు వలె ఈమె కూడా అంతట ఉన్నది) అనే ఈ పురాణరత్నాన్ని వ్రాసిన పరాశర మహర్షివలె ఉపక్రమోపసంహారాలతో **"తిరుక్కణ్డేన్ పొన్మేని కణ్డేన్"** (లక్ష్మిని చూచాను, బంగారు మేనిని చూచాను), **"శార్వు నమక్కెన్ఱుమ్... వణ్తామరై నెడుమ్ కణ్ తేన్ అమరుమ్ పూమేల్ తిరు"** (తేనెను కల పద్మంలోనివసించే లక్ష్మియే మనకు శరణం) అని స్పష్టంగా పల్కి, పూర్వపు ఆళ్వార్లు దీపంతో చూచినది ఇదే అని, నేరుగా కోవెల లోపలవలె దర్శించి ఆనందించిన పేయాళ్వార్లే ద్రావిడభాషావేత్త- మొట్టమొదట పూర్ణతత్త్వాన్ని అజ్ఞానానికి చోటు లేని రీతిలో తెలిపినవారు- అని వారి శ్రీచరణాలనే ఎమ్బెరుమానార్ మంగళాశాసనం చేస్తారు- అని భావం. "మామలరాళ్ తన్నొడు" అని విడదీస్తే "మాయనై" అనే పదంతో త్రివిక్రముని, శ్రీకృష్ణుని తెలిపినట్లవుతుంది. "మామలరాళ్ తన్నొడుమ్" అని విడదీస్తే "ఆయనై" అని విడదీసి తిరుక్కోవలూర్లోని శ్రీకృష్ణుని తెలిపినట్లు అవుతుంది.

**11.** అవ :- **"తిరు క్కణ్డేన్ పొన్మేని కణ్డేన్"** (లక్ష్మిని దర్శించాను, బంగారుమేనిని దర్శించాను) అని తాము దర్శించినదానిని ముందుగా పల్కిన పేయాళ్వార్లను అనుసంధించిన వెంటనే **"అరఙ్గత్తమ్మాన్**

తిరుక్కమలపాదమ్ వన్దు ఎన్ కణ్ణినుళ్ళన ఒక్కిన్దతే" (శ్రీరంగనాథుని అందమైన పాదపద్మం నా కళ్ళలో నిలచి ఉన్నది) అని దర్శించినదానినే స్పష్టం చేసి, **"కోవలనాయ్"** అని పల్కి, **"ఎన్నముదినై క్కణ్డ కణ్‌గళ్ మట్రొన్రినై క్కాణావే"** (నా అమృతంవంటి రంగనాథుని చూచిన కళ్ళు ఇంకొక విషయాన్ని చూడవు) అని వేఱొక దానిని చూడని రీతిని కలిపి పల్కిన తిరుప్పాణ్ ఆళ్వార్లపట్ల శ్రీరామానుజుల అభినివేశాన్నిగూర్చి పల్కుతున్నారు. "తిరుక్కమలపాదమ్" అనేది శ్రీరంగనాథుని పాదకమలాన్నే చెబుతున్నా, లక్ష్మీదేవిచే ప్రేమతో సంవాహనం చేయబడే కమలపాదం- అనే అర్థాన్ని తెలుపుతున్నందున, లక్ష్మీదేవికూడా ఇక్కడ అనుసంధింపబడుతున్నది. శ్రీరంగనాథునియొక్క, లక్ష్మీదేవియొక్క కమలపాదం- అని వివరించడంకూడా యుక్తమే. "పైన భగవానుని పలికే సందర్భం అంతా లక్ష్మీదేవిని కూడా తెలుపుతుంది'' అనే భగవద్రామా నుజుల సూక్తి రీతిని గ్రహించడానికి ఇది సూచకమవుతుంది.

**శీరియ నాన్మఱై చ్చెంబొరుళ్, శెందమిళాల్ అళిత్త**
**పారియలుమ్ పుకళ్ ప్పాణ్ పెరుమాళ్, శరణామ్ పతుమ**
**త్తారియల్ శెన్ని యిరామానుశన్దన్నై చ్చార్న్దవర్‌తమ్**
**కారియ వణ్మై, ఎన్నాల్ శొల్లొణాతు ఇక్కడలిడత్తే.**

శీరియ నాల్ మఱై = గొప్పవైన నాల్గు వేదాల, శెమ్ పొరుళ్ = ఋజువైన అర్థమైన తిరునారాయణుని, శెమ్ తమిళాల్ = శుద్ధమైన ద్రావిడభాషలో, అళిత్త = తెలిపే, పార్ ఇయలుమ్ = భూమి అంతా నిండిన, పుకళ్ = కీర్తిని కల్గిన:, పాణ్ పెరుమాళ్ = తిరుప్పాణ్ ఆళ్వార్ల, శరణ్ ఆమ్ పదుమమ్ = శ్రీచరణాలనే తామరపూవును, తార్ ఇయల్ = మాలికగా గ్రహించే స్వభావాన్ని కల్గిన, ఇరామానుశన్ తన్నై = భగవద్రామా నుజులను, శార్న్దవర్‌తమ్ = ఆశ్రయించిన కూరేశులవంటి వారిని, కారియమ్ వణ్మై = కృత్యాలగొప్పతనమనే, ఇ కడల్ ఇడత్తే = సముద్ర పరివేష్ఠితమైన ఈ భూమిలో, ఎన్నాల్ =అజ్ఞుడను, ప్రాకృతుడను అయిన



నాచే, శొల్ల ఒణ్ణాదు = చెప్పడం సాధ్యం కాదు.

ముదలాళ్వార్లు తిరుక్కోవలూర్‌లో కలసినపుడు భగవానుడు వారి మధ్యలో ప్రవేశించి, సమ్మర్దించి, వారికి ప్రత్యక్షమయ్యాడు. అవతరించిన తరువాత, అర్చారూపంలో తనను పగటివేళ దర్శించగలిగేవారికి వారు ఉండే చోటికి ముందే చేరి దర్శనమివ్వడం అతనికి ఇష్టమైనది. తిరుప్పాణ్ ఆళ్వార్లు. శ్రీరంగనాథుని నిత్యం మనోనేత్రంతో దర్శిస్తూ, ఒదిగి ఉండి ఆలయానికి ఆవలి వైపుగా చాలా దూరంలో పాడుతూ ఉండగా, వారిని తన ఆలయంలోనికి రప్పించి, అర్చారూపాన్నే నేరులో బాహ్యనేత్రా లతోదర్శించేటట్లు చేయాలని తలచి, లోకసారంగులనే మునివరుల భుజాల పైకి ఎక్కించి, ఆలయంలోపలకు ప్రవేశింపజేసి, అనుగ్రహించాడు. అంతకు ముందు ఆంతరనేత్రంతో దర్శించినదానికి సరిపోయే రూపాన్ని దర్శించి అనుభవించి, **"కణ్డకణ్‌గళ్ మట్రొన్రినై క్కాణావే"** (రంగనాథుని దర్శించిన నా కనులు వేఱొకదేనిని చూడవు) అని నిలిచారు. వీరు ప్రణవాన్ని మనస్సులో భావించి, ఆ ప్రణవంయొక్క విస్తృతి అయిన నాల్గు వేదాల అర్థాన్నే విశదీకరించారు- అనే దానిని శ్రీదేశికులు అనుగ్రహించిన మునివాహనభోగంలో గమనించవచ్చు. ఆ ప్రబంధానికి గల మా ప్రబంధ రక్షవ్యాఖ్యలోను గమనించవచ్చు. **"శరణామ్ పదుమత్తారి యల్"** అనే ప్రయోగంద్వారా "తిరుప్పాణ్ ఆళ్వార్లను నా భుజాల పైకి ఎక్కించుకొని మోసి, వారి కాళ్ళను నాకు మాలగా చేసికొనలేకపోయానే!"- అని భగవద్రామానుజులు భావిస్తున్నారని భావం తోస్తుంది. **"ఇక్కడలిడత్తే"** అనే దానిని **"శార్న్దవర్"** అనే పదంతో అన్వయిస్తే "సముద్రపరివేష్ఠితమైన భూమిలో వ్యాప్తమైన శ్రీరామానుజుల శిష్యుల కార్యాల గొప్పతనం'' అనే అర్థం, **"కడలిడత్తే శొల్ల వొణ్ణాతు"** అని అన్వయిస్తే, "భూమిలో ఉన్నంతవరకు ప్రకృతిసంబంధం ఉన్నందువల్ల నాచే పలుకడానికి (తగిన) శక్తిని పొందడం సాధ్యం కాదు''- అని అర్థం స్ఫురిస్తుంది.

**12.** అవ :- తిరుమళిశై ఆళ్వార్లను శ్రీరామానుజులు తమ హృదయంలో నిలుపుకొన్న విషయం ఈ పాశురంలో తెలుపబడుతున్నది.

**ఇడమ్ కొణ్డ కీర్త్తి మళిశైక్కిఱైవన్, ఇణైయడిప్పోదు**
**అడంగుమ్ ఇదయత్తిరామానుశన్, అమ్ పొఱ్పాత మెన్ఱుమ్**
**కడఙ్గొండిఱైంజుమ్ తిరుమునివర్క్కన్ఱి క్కాతల్ శెయ్యా**
**త్తిడఙ్గొండ ఞానియర్క్కే, అడియేన్ అన్బు శెయ్వతువే.**

ఇడమ్ కొణ్డ = భూమి అంతా వ్యాపించిన, కీర్త్తి = కీర్తిని కల్గిన, మళిశైక్కు ఇఱైవన్ = తిరుమళిశైపిరాన్ యొక్క, ఇణై అడి పోదు = రెండు శ్రీచరణపద్మాలను, అడఙ్గుమ్ = తనలో అణగి ఉండే రీతిలోని, ఇదయత్తు = మనస్సును కల్గినవారైన, ఇరామానుశన్ = భగవద్రామానుజుల, అమ్ పొన్ పాదమ్ = అందమైన, భోగ్యమైన శ్రీచరణాలను, ఎన్ఱుమ్ = ఎల్లప్పుడు, కడమ్ కొణ్డు = కర్తవ్యంగా నిశ్చయించుకొని, ఇఱైఞ్జుమ్ = సేవించడమే సంపదగా కల్గిన, మునివర్క్కు అన్ఱి = గొప్పవస్తువును మననం చేసేవారిపట్ల తప్ప, కాతల్ శెయ్యా = వేఱొకరిపట్ల ప్రీతిని కల్గి ఉండని, తిడమ్ కొణ్డ = దృఢమైన బుద్ధినికల, ఞానియర్క్కే = శ్రీరామానుజుల భక్తులకు భక్తుల పట్లనే, అడియేన్ అన్బు శెయ్వదుమ్ = దాసుడు భక్తిని కల్గి ఉంటాడు.

తిరుమళిశై ఆళ్వార్లు **"నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్"** (నారాయణుడు చతుర్ముఖుని సృష్టించాడు) అని, **"పూనిలాయ వైన్దుమాయ్"** (భూమి మొదలైన పంచభూతాలై) అని ప్రారంభించి నారాయణశబ్దార్థాన్ని వ్యక్తం చేసి, తాము అంతకు ముందు అభ్యసించిన మతాలను అన్నిటినీ నిరసించి, శరీరాత్మభావంతో శ్రీమన్నారాయణునే స్థాపించినందువల్ల వీరి కీర్తి వ్యాపించని చోటు అనేది లేదు - అనేటట్లు అంతట వ్యాపించి నిలచి ఉన్నది. వీరు పేయాళ్వార్ల శిష్యులనే ప్రసిద్ధి ఉన్నది. వీరి శ్రీచరణాలను రెండిటిని మనస్సులో నిలుపుకొన్నవారికి వీరి దివ్యప్రబంధాలలోని



అర్థాలన్నీ స్ఫురిస్తాయి. పరత్వం లేని సౌలభ్యం ఫలించదు - అని పరత్వాన్ని గూర్చి విరివిగా పల్కడంవల్ల వీరిని భక్తిసారులంటారు. నారాయణ పారమ్యంలోను, **"నానున్నై యన్ఱి యిలేన్ కణ్డాయ్ నారణనే నీ యెన్నై యన్ఱి యిలై"** (నారాయణా! నీవు లేక నేను లేను, నేను లేక నీవు లేవు) అని నారాయణశబ్దార్థంలోను దృష్టిని కల వీరిపట్ల శ్రీరామానుజులకు గల అభినివేశాన్ని తెలిసి, వారికి దాసదాసులైనవారు మనకు శేషిభూతులు- అని భావం.

**13.** అవ :- మిగిలిన ఆళ్వార్లు శ్రీరంగనాథుని, మిగిలిన అర్చారూపాలను కీర్తించారు. తిరుప్పాణ్ ఆళ్వార్లు శ్రీరంగంలోని శ్రీరంగనాథుడనే మూర్తి దగ్గరకు మాత్రమే చేరి కళ్ళార దర్శించినవారైనా, **"విరైయార్ పొళిల్ వేఙ్గడవన్"** (పరిమళాన్ని నిండుగా కల తోటలను కల్గిన వేంకటాచలం) ఇత్యాదిగా శ్రీవేంకటేశ్వరునికూడా అనుసంధించారు. "నీవు ఉండే తిరుమలనుకూడ కొందరు తాకకూడదని భావించిన నీవు నీ ఆలయం లోపలకు నన్ను ప్రవేశింపజేశావే! ఇదేమి విలక్షణమైన కరుణ!" - అనే భావంతో ఆ విధంగా పలికారు. వీరందఱివలె కాకుండా **"అత్రైవ శ్రీరంగే సుఖ మాస్వ"** (ఇక్కడే శ్రీరంగంలో సుఖంగా ఉండు) అని తమకు శ్రీరంగనాథుడు నియమించినట్లే నియమించకుండా ఉన్నా, శ్రీరంగనాథునే సేవిస్తూ ఉండడమే కాకుండా, "ఉపయోగపడని శేషత్వం ఎందుకు? కైంకర్యమే పురుషార్థానికి పరమావధి" అని తలచి అతనికి కైంకర్యం చేసే అర్చకులు మొదలైనవారివద్ద తిరునామం వ్యవహరింప బడేటట్లు ప్రకాశించారు కదా! అని భగవద్రామానుజులకు ఆ ఆళ్వార్లపట్ల అధికమైన అభినివేశం. అన్యమతస్థుల విషయంలో చాలా నిరాదరణను కల వీరు అనుగ్రహించిన ప్రబంధాన్ని కూడా, శ్రీరామానుజులు చాలా ఆదరిస్తారు - అని ఇందులో అంటున్నారు.

**శెయ్యుమ్ పశుమ్ తుళవ త్తొళిల్మాలైయుమ్, శెందమిళ్**

పెయ్యుమ్ మఱైత్తమిళ్ మాలైయుమ్, పేరాతశీరరంగ -
త్తైయన్ కళఌక్కణియుమ్ పరన్ తాళన్ఱి ఆతరియా
మెయ్యన్, ఇరామానుశన్ శరణే కతి వేఱెనక్కే.

శెయ్యుమ్ = తామే నిర్మించిన, తామే తోటను నిర్మించి, దున్ని, పెంచిన, పశుమ్ తుళవమ్ = లేత తులసితో, తొళిల్ మాలై ఉమ్ = కైంకర్యాలతో పాటు, కట్టిన పలు విధాలైన మాలికలను, శెమ్ తమిళ్ = సులభమైన విలక్షణమైన ద్రావిడపదాలతో, పెయ్యుమ్ = చెవులకు సోకేటట్లుగా చేసే, తమిళ్ మఱై = ద్రావిడవేదానికి చెందిన, మాలై ఉమ్ = తిరుమాలై, తిరుప్పళ్ళిఎళుచ్చి అనేవానిని, పేరాద = నశించని, లేక, అనుభవంలో ఉండ కుండా ఉండని, శీర్ = కల్యాణగుణాలను కల్గిన, అరఙ్గత్తు ఐయన్ = శ్రీరంగనాథుని, కళఌక్కు = శ్రీచరణాలకు, అణియుమ్ = అలంకారంగా చేసికొన్న, పరన్ = అనన్యభక్తులైన తొండరడిప్పొడి ఆళ్వార్ల, తాళ్ అన్ఱి = శ్రీచరణాలనుతప్ప, ఆదరియా= వేఱొక చోట భక్తిని కల్గి ఉండని, మెయ్యన్ = వాస్తవాన్నే పలికే శ్రీరామానుజుల, శరణే = శ్రీచరణాలే, వేఱు ఎనక్కు = వేఱు విధమైన నాకు, కతి = ప్రాప్యం, ప్రాపకం కూడా.

నాకు వేఱే గతి లేదు - అనే అర్థంలో **"వేఱెనక్కు"** అనే ప్రయోగం చేయబడిందని గ్రహించవచ్చు. అపుడు **"ఎనక్కే"** అనే చోట **'ఏ'** అనేది నిరర్థకమైన పదం కాదు. **"ఎనక్కా వేఱు, వేఱు ఎనక్కావదో!"** అనే అర్థాన్ని ఇస్తుంది. ఇక, **"వేఱు ఎనక్కు - వేఱాన ఎనక్కు"** - (వేఱైన నాకు), ఆ ఆళ్వార్ల వలె శ్రీరంగనాథుని కైంకర్యంలో అభినివేశాన్ని కలవాడను, పాశురాలను రచించేవాడను అయినా, నేను వారివలె కాకుండా వేఱైనవాడనా! అంతమాత్రం చేయడానికి యోగ్యత లేనివాడను'' అనే నైచ్యానుసంధానం కూడా కావచ్చు. **"తమిళ్మఱై"** అని సామాన్యంగా పల్కి, వాటికి చెందిన మాలిక, మిగిలినవానికంటే



బుజువైన ద్రావిడసూక్తులను కల్గినది- అనే రీతిలో అర్థాన్ని గ్రహించవచ్చు. **"తమిళ్"** అనే పదానికి తీయని - అనే అర్థంకూడా (చెప్పవచ్చు)

**14.** అవ :- తొణ్డరడిప్పొడి ఆళ్వార్లవలె శ్రీరంగనాథునిపట్ల, అతని భక్తులపట్ల సాటి లేని భక్తిని కల కులశేఖరప్పెరుమాళ్ విషయంలో గల అభినివేశాన్ని చూపుతున్నారు. లోకంలో ఉజ్జీవించే ఉపాయం భక్తియే అని తెలిసి, **"జన్మాంతరసహస్రేషు తపోధ్యాన సమాధిభిః, నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే"** (వేలాది గత జన్మలలో చేసిన తపస్సు, ధ్యానం, యోగాల వల్ల నరులకు పాపాలు క్షీణించి, కృష్ణునిపట్ల భక్తి కల్గుతుంది.) అనే రీతిలో తపస్సు మొదలైనవానినిలో ప్రయత్నించేవారు పలువురు ఉండగా, కులశేఖరాళ్వార్లు, ''భాగవతస్పర్శం గాని, కటాక్షం గాని పొందేటట్లు భగవానుని కొండపై ఏదైనా కావాలి; స్థావరజన్మకూడా ప్రయోజనాన్ని కల్గిస్తుంది - అనే నిర్ణయాన్ని పొందారు''- అనే భావంతో తపస్సును కాదని నిరాకరించి, వారి పట్లగల అభినివేశాన్ని ఇందులో వివరిస్తున్నారు.

**కతిక్కు ప్పతఱి, వెమ్ కానముమ్ కల్లుమ్ కడలు మెల్లామ్**
**కొతిక్క త్తవమ్ శెయ్యుమ్ కొళ్కై యఱ్ఱేన్, కొల్లికావలన్ శొల్**
**పతిక్కుమ్ కలైక్కవి పాడుమ్ పెరియవర్పాతంగళే**
**తుతిక్కుమ్ పరమన్, ఇరామానుశన్ ఎన్నై చ్చోర్విలనే.**

కతిక్కు = గొప్పదైన ప్రాప్యకసిద్ధికోసం, పదఱి = మిక్కిలి శ్రమపడి, తవమ్ = కఠిన తపస్సును, వెమ్ కానమ్ ఉమ్ = వేడిగా ఉండే అరణ్యాలు, కల్ ఉమ్ = సముద్రాలు, ఎల్లా = అన్ని చోట్ల, కొతిక్క = (కాలు) కాలేటట్లు, శెయ్యుమ్ = చేయాలనే, కొళ్కై =రీతిని, అఱ్ఱేన్ = విడచిపెట్టాను, కొల్లి కావలన్ = కొల్లి అనే నగరానికి ప్రభువైన, కులశేఖరాళ్వార్ల, శొల్ =

సూక్తులై, పదిక్కుమ్ కలై = తనలో అంతర్భవించుకొన్న సకలకళలను కల్గినదైన, కవి = పెరుమాళ్ తిరుమొళి-అనే ప్రబంధాన్ని, పాడే మహనీయుల పాదాలను స్తుతించే శ్రీరామానుజులు, శోర్వు ఇలనే = నన్ను విడువలేదు, ఆచార్యనిష్ఠవల్ల కతిని పొందేటట్లుచేశారు.

**"పదిక్కుమ్ కలై"** -వేదం తనలో అన్ని శాస్త్రాలను ఇముడ్చుకొన్నది. ఈ ప్రబంధంకూడా అటువంటిదే- అని భావం.

15. అవ :- కులశేఖరాళ్వార్లు **"ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే"** (ఎవరి నగరంలో రంగయాత్రకు చాటింపు ప్రతిదినం ఘోషింప బడుతున్నదో?) అనే రీతిలో ప్రశంసింపబడినవారు. పెరియాళ్వార్లుకూడా తమ పుత్రికయైన గోదాదేవిని పరిణయమాడి, తమకు అల్లుడైన శ్రీరంగనాథుని విషయంలో **"ఎన్నుడై తిరువరఙ్గఱ్కన్ఱి మఱ్ఱొరువర్క్కు ఆళావరో?"** (నా రంగనాథునకు తప్ప వేఱొకనికి దాసులవుతారా?) అని అన్నారు. కులశేఖరులు, శ్రీమద్రామాయణాన్ని ఆలకించినపుడు, **"చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్, ఏకస్తు రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి?"** (రాక్షసులు పదునాల్గువేలమంది, వారు క్రూరకర్ములు, రాముడొక్కడే ధర్మాత్ముడు. వీరిమధ్య ఏవిధంగా యుద్ధం జరుగుతుందో?) అని శ్రీరామునకు సహాయం ఎవరూ లేరే! అని అందఱు భయపడ్డారు - అనే కథను చెప్పే సమయంలో శ్రీరామునకు సహాయంగా తామే సేనతో పాటు బయలుదేరాలని ఉద్యమించారు- అనే వృత్తాంతం సుప్రసిద్ధం. అదే రీతిలో పెరియాళ్వార్లు కూడా పరతత్త్వాన్ని ప్రత్యక్షంగా దర్శించినపుడు "ఇతనికి ఏమి కీడు కల్గుతుందో!'' అని భయపడి పల్లాణ్డు పాడారు **"అహం వేద్మిమహాత్మానమ్"** (శ్రీరాముని మహాత్మునిగా తెలియుదును) అని పరమార్థాన్ని వివరించి, దశరథుని వద్దనుండి శ్రీరాముని పొంది వస్తున్నప్పటికీ, రావణుడే తమ యాగానికి భంగం కల్గించాలని వచ్చినా, శ్రీరాముడు రక్షిస్తాడనే నిశ్చయాన్ని దశరథుని వద్ద ఒక విధంగా సూచించినా, తాటకయొక్క క్రూరకృత్యాన్ని తలచి భయపడి **"భద్రం తే"** (నీకు మంగళం) అని విశ్వామిత్రుడు ఆశీర్వదించాడు. భక్తులు ఎంతటి తత్త్వజ్ఞానులైనా, ప్రకృతిమండలంలో ఉండే స్థితికి తగినట్లుగా తత్త్వస్థితిని మీఱి భక్తిని కల్గి ఉంటారు. అటువంటి భక్తియే అతనికి (భగవానునకు) భోగ్యం. దేవకీవసుదేవులు తత్త్వవివేకాన్ని కలవారైనా, పుత్రాభిమానం అతిశయించి, కంసునకు భీతిల్లి, శ్రీకృష్ణుని ఇంకొక చోటికి తీసికొనిపోయారు. భగవానుని ఆశ్రయించేవారు, "అతనికి ఆకలి, దాహం, ఎండ, వర్షంవంటి బాధలు కలుగవు''- అని భావించకుండా, ప్రేమతో అతనిని రక్షించే వారైతే వారే సరి అయిన భక్తిని కలవారు- అని భగవద్రామానుజులుకూడా అనుగ్రహించేవారు. ఇతరమతంలో మంగళాశాసనం చేయడానికి, ఇక్కడ మంగళం పాడడానికి ఎంతో వ్యత్యాసం ఉన్నది. ఇటువంటి భక్తితో పెరియాళ్వార్లు అస్థానే భయశంకను పొంది, పల్లాండు పాడి, శ్రీకృష్ణుని తమ బిడ్డగానే గ్రహించి, యశోదవలె ఆ పరువానికి తగిన సకలానుభవాలను పొంది ఆనందించారు. తాము పెరియాళ్వార్ అనే దానినే మాటి మాటికి మఱచిపోతూ వచ్చారు- అని వారిపట్ల భగవద్రామానుజుల అభినివేశం ఇందులో తెలుపబడుతున్నది.



> శోరాత కాతల్ పెరుమ్ శుళిప్పాల్, తొల్లైమాలై యొన్ఱుమ్
> పారాతవనై ప్పల్లాండెన్ఱు కాప్పిడుమ్, పాన్మైయన్తాళ్
> పేరాత వుళ్ళత్తు ఇరామానుశన్తన్ పిఱంగియశీర్
> శారా మనిశరై చ్చేరేన్, ఎనక్కెన్న తాళ్వినియే.

శోరాద = ఏనాటికీ తగ్గని, కాదల్ = ప్రేమ అనే, పెరుమ్ శుళిప్పాల్ = గొప్ప సుడులను కల ప్రవాహంతో, తొల్లైమాలై = అనాది అయిన భగవంతుని, ఒన్ఱుమ్ పారాదు = అతడు అనాది, నశించడు, సర్వేశ్వరుడు- అని

ఈవిధంగా గమనించకుండా, పల్లాండు ఎన్ఱు = పల్లాండు, వాళి- అని పలుమార్లు పల్కి, అవనై కాప్పిడుమ్ = తిరుక్కాప్పు అని అతనికి రక్షనుచేసే, పాన్మైయన్ తన్ = స్వభావాన్ని కల పెరియాళ్వార్లు- అని, పేరాద ఉళ్ళత్తు = ఆవలి వైపుకు పోని మనస్సును కల, ఇరామానుశన్ తన్ = భగవద్రామానుజుల, పిఱజ్గియ శీర్ = ప్రకాశించే భక్త్యాది గుణాలలో, వారా = అభినివేశాన్ని పొందని, మనిశరై = అల్పమానవులను, శేరేన్ = నేనుచేరను, ఇని = ఈ గొప్పగుణం ఏర్పడిన తరువాత, ఎన్న తాళ్వు ఎనక్కు? = నాకు ఏకొఱత ఉండబోదు.

భగవానుడు ఏవిధమైన కొఱతను కలవాడు కాడు- అనే వాస్తవాన్ని తెలిసినా, ఆజ్ఞానం అణచి పైకి ఉద్బుద్ధమైన అభిమానం, భక్తి ప్రారంభం నుండే పెరియాళ్వార్లకు వర్ధిల్లింది. పరోక్షంలో భగవానుని పరత్వాన్ని స్థాపించినవారు అయినా అతడు ప్రత్యక్షం కాగానే, ఏమి హాని కల్గుతుందో! ఏమో! - అనే భయశంక, తన కుమారుడనే అభిమానం కల్గినవి. ఇదేకదా ఈ లోకంలో పొందవలసిన మహాగుణం.

**16.** అవ :- ఆళ్వార్ల దివ్యప్రబంధాలకంటే గొప్పవైన, ఆణ్డాళ్ శ్రీసూక్తులు, కృత్యాలు కలిని నశింపజేశాయి- అని వాటిలో అభినివేశాన్ని కలవారు శ్రీరామానుజులు - అనే యథార్థాన్ని ఇందులో అముదనార్ తెలుపుతున్నారు.

**తాళ్వొన్ఱిల్లా మఱై తాళ్న్దు, తల ముళుతుమ్ కలియే**
**ఆళ్కిన్ఱ నాళ్వన్దళిత్తవన్ కాణ్మిన్, అరంగర్ మౌళి**
**శూళ్కిన్ఱ మాలైయై చ్చూడిక్కొడుత్తవళ్ తొల్లరుళాల్**
**వాళ్కిన్ఱ వళ్ళల్, ఇరామానుశనెన్ఱుమ్ మామునియే.**

తాళ్వు ఒన్ఱు = ఏ విధమైన దోషానికి, కొఱతకు చోటు కాని, మఱై = వేదాలు, తాళ్న్దు = లోకంలో గౌరవింపబడకుండా, తలమ్ ముళుదుమ్ = భూమి అంతటా, కలి ఏ= వేదబాహ్యకుదృష్టులు



వ్యాపించినందున కలి పురుషుడే, ఆళ్కిన్ఱ నాళ్ = పరిపాలించే కాలంలో, వన్దు = అవతరించి, అళిత్తవన్ = వేదార్థాన్ని పల్కి, లోకానికి రక్షచేసిన మహనీయుడు, అరజ్గ = శ్రీరంగనాథుని, మౌళి = శిరస్సును, శూళ్కిన్ఱ = వ్యాపించే, మాలైయై = తులసీమాలను, (దానికోసమే) శూడి కొడుత్తవళ్ = తాను శిరస్సులో అలంకరించుకొని, ఇచ్చినది అయిన గోదాదేవి (ఆణ్డాళ్) యొక్క, తొల్ అరుళాల్ = స్వాభావికమైన కృపతో, వాళ్కిన్ఱ = ఆమె సూక్తుల పరిశీలయే ఉజ్జీవనంగా కల్గిన, వళ్ళల్ = పరమోదారులైన, శ్రీరామానుజులనే మహామునియే కాగలరు.

పరతత్త్వం శ్రీమన్నారాయణుడే - అని, అతడు అద్భుతమైన రూపాన్ని కలవాడని తెలియలేక, ప్రజలు (తన సంతానం) బాహ్యకుదృష్టి మతాలకు వశులై, చెడే కలికాలంలో భగవానుడు "ఏమి చేయాలి ?" అని ఆలోచించి, "తనకంటే, విశేషంగా, తన సంతానం - అని అభిమానించి భూదేవియే అవతరించి అనుగ్రహించిన శ్రీసూక్తులైన తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అనే దివ్యప్రబంధాలలో ఆదరాన్ని పొంది ఆనందించేటట్లు చేస్తే లోకం ఉజ్జీవిస్తుంది." అని దృఢంగా భావించి, వాటిలో అణగి ఉండే వైష్ణవసమయాచారసారాలను, భగవద్విషయకమైన ప్రేమను, ఉపనిషత్తులలోని అర్థాలుగా ఉదాహరించి చూపే శ్రీరామానుజు లనే మహామునులను అవతరింపజేశాడు - అని భావం. శ్రీరామానుజుల తల్లికి భూదేవి అని పేరు - అని అంటారు. భూదేవి అయిన ఆణ్డాళే **"వత్సం గౌరివ వత్సలా"** (వాత్సల్యాన్ని కల్గిన తల్లి ఆవు లేగదూడను అనుసరించి నట్లే) అనే రీతిలో శ్రీపెరుంబూదూర్‌లో అవతరించిన, ఉదారులైన శ్రీరామానుజులకు అనుజయై, వారు వెళ్ళే చోట అంతా వెంబడించి వెళ్ళి, వారి మనస్సులో తన శ్రీసూక్తుల అర్థం వెలిగేటట్లుచేసి, దాని మూలంగా లోకాన్ని ఉద్ధరించేటట్లు చేసింది - అని చెప్పవచ్చు. ఎమ్బెరు మానార్‌కు **"తిరుప్పావై జీయర్"** అనే ప్రసిద్ధి ఉన్నది. **"ఉన్దు మతకళిత్తన్"** అనే పాశురంలో ఒక ఐతిహ్యాన్ని కూడా పెద్దలు తెల్పుతారు. గోదాదేవి

కృత్యాలు, ఆమెపట్ల రంగనాథునకు కల అభిమానం, ఆమె సూక్తులలోని స్వారస్యాలు వీరిద్వారా తెలిసినపుడు సంతానం (ప్రజలు) ఆమెనే తల్లిగా దృఢంగా భావించి జ్ఞానభక్తులు విశేషంగా పొందారు. అందువల్ల వీరే కలి నశించేట్లు చేసినవారు.

**17.** అవ :- విశేషాభిమానంతో పరకాలసూరిని, పరాంకుశసూరిని ప్రారంభంలో ప్రస్తావన చేయడం ఇక్కడ, ఆళ్వార్లను అందఱిని అనుసంధించేటపుడు వారిని కూడా అనుసంధించడం ఆవశ్యకం కనుక, తిరిగి వారి వర్ణన చేయబడుతున్నది. ఇక్కడ ఆణ్డాళ్‌వలె నాయికా భావం నిలచి మడల్ ఎత్తాలని ప్రయత్నించిన పరకాలసూరి విషయం ముందుగా ప్రస్తావింపబడుతున్నది.

**మునియార్ తుయరంగళ్ మున్దిలుమ్, ఇన్బంగళ్ మొయ్‌త్తిడినుమ్**
**కనియార్ మనమ్ కణ్ణమంగై నిన్ఱానై, కలైపరవుమ్**
**తనియానైయై త్తణ్డమిళ్ శెయ్‌త నీలన్ తనక్కు ఉలకిల్**
**ఇనియానై, ఎంగళిరామానుశనై వన్దెయ్‌తినరే.**

కణ్ణ మఙ్గై = తిరుక్కణ్ణమంగైలో, నిన్ఱానై = వేంచేసి ఉండే సన్నివేశంలో, తని యానైయై = సాటి లేని గజంవంటివాడైన "పత్తరావి" స్వామిని, పరవు = మంగళాశాసనం చేస్తూ ఉండేదైన, కలై = సకలవేదాదిశాస్త్రాలను, తణ్ తమిళ్ శెయ్‌ద = చల్లని తమిళభాషలో చేసిన, నీలన్ తనక్కు = తిరుమంగై ఆళ్వార్ల విషయంలో, ఇనియానై = మిక్కిలి ప్రీతిని కల్గిన, మా రామానుజులను, వన్దు ఎయ్‌దినర్ = తమ చోటుగా గ్రహించి ఆశ్రయించినవారు, తుయరఙ్గళ్ మున్దిలుమ్ = ఎంతటి దుఃఖాలు సంభవించినా, మునియార్ = కోపంగాని, బాధగాని పొందరు, ఇన్బఙ్గళ్ = సుఖాలు, మొయ్‌త్తిడినుమ్ = ఇంకా ఇంకా నిబిడీకృతాలైనా, మనమ్ కనియార్ = మనస్సులోపల సంతోషించరు.

తిరుమంగై ఆళ్వార్లు "తత్సంశ్లేషవియోగైకసుఖదుఃఖ స్తదేకధీః"



(ఆ పరమాత్మ సంశ్లేషంలో సుఖాన్నే, వియోగంలో దుఃఖాన్నే పొందేవారు) అనే రీతిలో భగవానుని సంశ్లేష- విశ్లేషాలను స్వర్గ- నరకాలుగా తలచిన వారు **"న ప్రహృష్యేత్ ప్రియం ప్రాప్య నో ద్విజేత్ ప్రాప్య చాప్రియమ్"** (ప్రియాన్ని పొంది పొంగిపోకూడదు, అప్రియాన్ని పొంది ఉద్వేగాన్ని పొందకూడదు.), **"నైషా పశ్యతి రాక్షస్యో నేమాన్ పుష్పఫల ద్రుమాన్, ఏతత్‌స్థహృదయా నూనం రామమేవానుపశ్యతి"** (ఈసీత, రాక్షసస్త్రీలను కాని, ఈ పూలు, పళ్ళు కల వృక్షాలను కాని చూడడం లేదు. ఈ రాముని మాత్రమే హృదయం కల్గినదై, అతనినే మానసికంగా దర్శిస్తున్నది.) అనే స్థితిలో ఉండేవారి దివ్యప్రబంధాలను అనుసంధించే భగవద్రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించినవారికి అదే స్థితి. శ్రీరామానుజులను విడువకుండా ఉండడమే వీరికి కావలసినది. మిగిలిన సుఖదుఃఖాలను లెక్కించడం లేదు- అనేది వీరి విషయంలోని విశేషం. **"తనియానైయై"** అనేది శ్రీరామానుజులనుకూడా నిర్దేశిస్తుంది- అని చెప్పవచ్చు.

**18.** అవ :- అందఱికంటే నమ్మాళ్వార్లపట్ల పూర్ణంగా శ్రీరామానుజులకు కల అభినివేశాన్ని ఇందులో తెల్పుతున్నారు. వారు అనుగ్రహించిన దివ్యప్రబంధాలలో వేయి పాశురాలతో కూడిన తిరువాయ్‌మొళికి సాటి ఏదీ లేదు. అధ్యయనం చేయడానికి, అర్థం గ్రహించడానికి వీలు కాని వేదాలలోని సూక్ష్మార్థాలను సైతం విడువకుండా, అందఱు సులభంగా తెలిసేటట్లు అనుగ్రహించడం ఒక్కొక్క పాశురంలోను కన్పిస్తుంది. అందువల్ల ఇకపై మూడు పాశురాలలో నమ్మాళ్వార్ల ప్రస్తావం చేయబడు తున్నది. పైన **"కూట్టుమ్", "నాట్టియ"** పాశురాలుకూడా గమనార్హం. అక్కడ మధురకవుల మహిమను వర్ణించే రీతిలో తిరువాయ్‌మొళి ప్రస్తావింపబడింది. తరువాత పాశురం నమ్మాళ్వార్ల కోసమే ఏర్పడింది. దానికి పిమ్మట నాథమునులకోసం దీని ప్రస్తావం.

**ఎయ్‌తఱ్కరియ మఱైకళై, ఆయిరమ్ ఇన్ తమిళాల్**

శెయ్‌తఱ్కులకిల్ వరుమ్ శడకోపనై, శిన్దైయుళ్ళే
పెయ్‌తఱ్కిశైయుమ్ పెరియవర్ శీరై ఉయిర్‌కళెల్లామ్
ఉయ్‌తఱ్కుదవుమ్, ఇరామానుశన్ ఎమ్ముఱు తుణైయే.

ఎయ్‌దఱ్కు అరియ = గ్రహించి తెలియడానికి వీలుకాని, మఱైకళై = వేదాలను, ఆయిరమ్ ఇన్ = వేయి తీయని, తమిళాల్ శెయ్‌దఱ్కు = తమిళపాశురాలతో చేయడం కోసమే, ఉలకిల్ వరుమ్ = భూలోకంలో అవతరించిన, శడకోపనై = నమ్మాళ్వార్లను, శిన్దైయుళ్ళే = మనస్సులోపల, పెయ్‌దఱ్కు = అనుభవించడంకోసమే, ఇశైయుమ్ పెరియవర్ = కోరి ఉండే మధురకవుల, శీరై = ఆచార్యనిష్ఠ అనేస్థితిని, ఉయిర్‌కళ్ ఎల్లామ్ = అన్ని ప్రాణులు, ఉయ్‌దఱ్కు ఉదవుమ్ = ఉజ్జీవించే ప్రథమమార్గంగా చూపే, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, ఎమ్ ఉఱు తుణై = నాకు తగిన గతి.

మిగిలిన ఆళ్వార్ల విషయంలో **"పూర్వోత్పన్నేషు భూతేషు తేషు తేషు కలౌ ప్రభుః, అనుప్రవిశ్య కురుతే యత్ సమీహిత మచ్యుతః"** (కలిలో పూర్వం జన్మించిన ఆయా ప్రాణులలో భగవానుడు అనుప్రవేశించి, తాను చేయదలచిన దానిని వారిద్వారా నిర్వహిస్తాడు.) అనే రీతిలో ఇంతకుముందే ఆవిర్భవించిన కొందఱు ఆళ్వార్లలో భగవానుడు అనుప్రవేశించి ఆళ్వార్లుగా చేసి, దివ్యప్రబంధాలను వ్యక్తం చేశాడనికూడా ఊహించవచ్చు. నమ్మాళ్వార్లు ఆ విధంగా కాకుండా, ద్రావిడవేదాన్ని అవతరింపజేయడంకోసమే ఆవిర్భవించినవారు కనుక వారు, అవతరించినప్పటినుండి వేఱు కార్యం ఏమీ లేకుండా, పాశురాలను వ్యక్తం చేసే తరుణం రాగానే చెప్పడం ఆరంభించారని తెలుస్తుంది. అందువల్ల, ఇక్కడ **"శెయ్‌దఱ్కులకిల్ వరుమ్ శడకోపనై"** అని అన్నారు. **"మదురకవి శీరై"** అని అనకుండా **"పెరియవర్‌శీరై"** అని అనడం ద్వారా భగవన్నిష్ఠకంటే ఆచార్యనిష్ఠకు గౌరవం ఉన్నదని తెలిపారు. మనకు కూడా **"అనుకల్పభూతమురభిత్ పదం సతాం శరణం యతీంద్రచరణం వృణీమహే"** (మురారి శ్రీచరణం కూడా రెండవ పక్షమే అనేటట్లు ఉండే, సత్పురుషులకు రక్షకమైన యతీంద్రుల శ్రీచరణాన్ని శరణు పొందు తున్నాను) అనే స్థితి దాని వల్ల కల్గింది. గొప్ప నిష్ఠలో ఉన్నందువల్ల వారు **"పెరియవర్"** (గొప్పవారు) దీనినే **"మతురకవి తోన్ఱ క్కాట్టుమ్ తొల్‌వళియే నల్‌వళికళ్ తుణివార్‌కట్కే"** (మధురకవులు చూపిన సనాతన మార్గమే మంచి మార్గమని నమ్మేవారికి) అని శ్రీదేశికులు అనుగ్రహించారు. నమ్మాళ్వార్ల కంటే మధురకవుల వయస్సు ఎక్కువ. అందువల్ల కూడా **"పెరియవర్"** అని కావచ్చు. కాని, అది ముఖ్యం కాదు.



**19.** అవ :- చివరగా, నమ్మాళ్వార్లపట్ల, దివ్యప్రబంధాలపట్ల మాత్రమే శ్రీరామానుజులకు ఎక్కువ ఊనిక - అని ఇందులో అంటున్నారు.

**ఉఱు పెరుమ్ శెల్వముమ్ తందైయుమ్ తాయుమ్, ఉయర్ కురువుమ్**
**వెఱితరు పూమకళ్ నాతనుమ్, మాఱన్ విళంగియ శీర్**
**నెఱి తరుమ్ శెన్దమిళారణమే ఎన్ఱు ఇన్నీణిలత్తోర్**
**అఱితర నిన్ఱ, ఇరామానుశన్ ఎనక్కారముతే.**

మాల్ తన్ (మాఱన్) = భగవంతుని, విళఙ్గియ శీర్ = ప్రసిద్ధమైన కల్యాణగుణాల, నెఱి తరుమ్ = సహజసిద్ధమైన ప్రవృత్తిని వ్యక్తం చేసే, మాఱన్ = నమ్మాళ్వార్ల, శెమ్ తమిళ్ ఆరణమే = గొప్ప ద్రావిడవేదమే, ఉఱు పెరు శెల్వమ్ ఉమ్ = వారు వారు పొందగోరిన సంపత్తు, తన్దై ఉమ్, తాయ్ ఉమ్ = తండ్రి, తల్లి, ఉయిర్ కురు ఉమ్ = గొప్ప ఆచార్యులు, వెఱి తరు పూ=పరిమళించే పూవులో ఆవిర్భవించిన, మకళ్ నాదన్ ఉమ్ = లక్ష్మికి నాథుడైన స్వామియే, ఎన్ఱు ఇ నీళ్ నిలత్తోర్ అఱి తర = అనేరీతిలో ఈ విశాలభూమిలో ఉండేవారు తెలిసేటట్లుగా, నిన్ఱ = ఆ ఉపనిషత్తుల వృద్ధికోసం "ఇదత్తాయ్"గా (హితాన్ని చేసే తల్లిగా) ఉండే, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, ఆర్ అముదు = పరిపూర్ణామృతమై ఉన్నారు.

నమ్మాళ్వార్ల శ్రీచరణాలే **"మాతా పితా యువతయ స్తనయా విభూతిః సర్వమ్"** (తల్లి, తండ్రి, పత్నిలు, పుత్రులు, సంపద అంతా) అని ఆళవన్దార్ అన్నారు. ఏమి? అంటే, వారి **"శెన్దమిళ్ ఆరణమ్"** (అందమైన ద్రావిడవేదం)

"సా హి శ్రీరమృతా సతామ్" (ఆ వేదమే సత్పురుషులకు మోక్షసంపద) అనే సంపద "మాతా పితృసహస్రేభ్యో వత్సలతరం శాస్త్రమ్" శ్రవణ మననాలను చేసి, నిష్కర్షం చేసిన ఆచార్యులవలె స్పష్టంగా అన్నిటినీ తెలుపడంవల్ల ఆ వేదమే ఆచార్యులు అని అనవచ్చు. తరువాత, ప్రాప్యం ప్రాపకం అయిన అర్థబ్రహ్మమే ఈ శబ్దబ్రహ్మ అని అనవచ్చుకదా! దీని కల్యాణగుణాలను లోకానికి తెలిపి, వారు ఇందులోనే అవగాహించేటట్లు దీని అభివృద్ధిలో పూర్తి ప్రయత్నాన్ని చేసిన శ్రీరామానుజులే సర్వలోకహితైషి. వారే మనకు అరుదైన అమృతం.

**20.** అవ :- తిరిగి ఈ ద్రావిడవేదంలో నాథమునులకు గల అభినివేశాన్ని గమనించి, వారిపట్ల భక్త్యుత్కర్షను కల్గినవారు శ్రీరామానుజులు- అని అంటున్నారు.

> **ఆరప్పొళిల్ తెన్కురుకై ప్పిరాన్, అముతత్తిరువాయ్**
> **ఈరత్తమిళిన్ ఇశై ఉణర్న్దోర్కట్కు, ఇనియవర్తమ్**
> **శీరై ప్పయిన్డుయ్యుమ్ శీలమ్ కొళ్ నాతమునియై నెంజాల్**
> **వారి ప్పరుకుమ్, ఇరామానుశన్ ఎన్దన్ మానితియే.**

ఆరమ్ = మాలికలు మాలికలుగా పూలుపూచిన, (లేక) చందనవృక్షాలతో కూడిన, పొళిల్ = తోటలను కల, తెన్ కురుకై = అందమైన కురుకాపురిలో ఆవిర్భవించిన, పిరాన్ = మహోపకారకులైన ఆళ్వార్ల, అముదమ్ తిరు వాయ్ = అమృతమే మూర్తీభవించిన తిరు ముఖం నుండి వెలువడిన, ఈరమ్ తమిళ్ = రసపూర్ణమైన ద్రావిడం యొక్క, ఇశై ఉణర్న్దోర్కట్కు = రాగాలను తెలిసిన మధురకవులు మొదలైనవారికి, ఇనియవర్తమ్ = ఇష్టమైన పరంపరల లోని, శీరై = ఆ అనుభవరసఘనమైన గుణాలను, పయిన్డు = అభ్యసించి, అంతకు మించి, ఉయ్యుమ్ = ఆళ్వార్ల ద్వారా ఉజ్జీవించడాన్ని, శీలమ్ కొళ్ = స్వభావంగా కల్గిన, నాదమునియై = దివ్యప్రబంధప్రవర్ధకులైన ప్రథమా



చార్యులను, నెఞ్జాల్ = తమ మనస్సులో, వారి పరుకుమ్ = లోపలకు గ్రహించి ఆనందించే శ్రీరామానుజులే మాకు గొప్పనిధి.

మధురకవులు నమ్మాళ్వార్ల రసపూర్ణమైన ద్రావిడవేదంయొక్క రాగాలను తెలిసినవారు. వారిపట్ల భక్తిని కల మహాత్ముల పరంపరద్వారా కణ్ణినుణ్ శిఱుత్తామ్బును, కొన్ని కొన్ని తిరువాయ్మొళి దశకాలను మాత్రమే తెలిసినవారు, వాటి రసానుభవాన్నిపొంది ఆనందించి, అవి మాత్రమే చాలదు - అని వాటి మూలంగా ఆళ్వార్లను యోగంలో సాక్షాత్కరింపజేసికొని నాథమునులు ఉజ్జీవించారు. ఈ విధంగా అభ్యసించి ఉజ్జీవించే స్వభావాన్ని కలవారు, భగీరథుని కంటే గొప్పవారు అయిన ఈ మహాచార్యులయొక్క ప్రయత్నం వల్ల ద్రావిడవేదం లభించిన తరువాత తాళాన్ని మోగించి ఆ ద్రావిడం వేదంయొక్క తీయని రాగాన్ని వ్యక్తం చేయడానికి వారు చేసిన రాగాల పరిశోధనను, ఆ రసపూర్ణమైన ద్రావిడవేదంనుండి నాల్గు వేదాల అర్థాలను నిశ్చయించి, జగదాచార్యులు అయిన వారి జ్ఞానవైభవాన్ని, వారి న్యాయతత్త్వమనే గ్రంథాన్ని మనస్సులో భావించి నిత్యం అనుభవించి సంతోషాన్ని పొందేవారు- శ్రీరామానుజులు. వీరే మనకు ఏనాటికి అయినా పూర్ణమైన నిధి - అని భావం. **"అముదత్తిరువాయ్"** అంటే వాగమృతమైన -అని కూడా అర్థం.

**21.** అవ :- నాథమునుల పౌత్రులైన శ్రీయామునుల శ్రీచరణాలను శరణంగా పొందిన గొప్పతనాన్ని భగవద్రామానుజులకు పల్కుతున్నారు

> **నితియై ప్పొళియుమ్ ముకిలెన్డు, నీశర్తమ్ వాశల్ పత్రి**
> **త్తుతి కత్రులకిల్ తువళ్కిన్డిలేన్, ఇని త్తూయ్ నెఱి శేర్**
> **ఎతికట్కిఱైవన్ యమునై త్తుఱైవన్ ఇణైయడియామ్**
> **కతి పెత్రుడైయ, ఇరామానుశన్ ఎన్నై క్కాత్తననే.**

తూయ నెఱి శేర్ = శుద్ధమైన మార్గానికి చెందినవారై, ఎతికట్కు

ఇఱైవన్ = ఐశ్వర్యాన్ని అంతటిని విడచి, యతిశ్రేష్ఠులైన, యమునై త్తుఱైవన్ = యామునేయుల, ఇణై అడి ఆమ్ = రెండు శ్రీచరణాలనే, కతి పెఱ్ఱు = ఉపాయాన్ని పొందినందున, ఉడైయ =సర్వస్వామి అయిన, ఇరామానుశన్ = భగవద్రామానుజులు తాము కూడా యతిరాజులై, ఎన్నై కాత్తనన్ = అల్పవిషయాలలో ఆశనశించేటట్లు చేశారు. (అందువల్ల) ఇని = ఇకపై, నీశర్తమ్ = క్షుద్రమైన ఐశ్వర్యంతో మదాన్ని పొందినవారి, వాశల్ పఱ్ఱి = వాకిటిలో వేచి ఉండి, నిద్నియై = లౌకిక జీవనమైన సొత్తును, పొళియుమ్ = వర్షించే ముకిల్= కాలమేఘం, ఎన్ఱు తుది కఱ్ఱు = అనే విధంగా వారిని స్తుతించడాన్ని నేర్చి, ఉలకిల్ తువళక్కిన్టిలేన్ = సంసారంలో ఆసక్తమై ఉండను.

**"ఆళవన్దార్"** అని శ్లాఘించి, వారికి ఇచ్చిన అర్థరాజ్యాన్ని అంతటినీ పొంది, దానిని త్యాగం చేసిన యతీశ్వరులై వెల్గిన శ్రీ యామునులను ఆశ్రయించిన, యతిరాజులు భగవద్రామానుజులను ఆశ్రయించినవారే గతి అయిన తరువాత, క్షుద్రఫలంకోసం ఒక నీచుని వద్దకు పోవడం, "వర్షాకాలకృష్ణమేఘమా!'' అని అతనిని స్తుతించడం చేయను. ఇతః పూర్వమే ఈ విధంగా చేయనివాడను ఇక చేస్తానా? చేయను. యతి (వారు) కాకపోయినా, పవిత్రమైన (పరిశుద్ధమైన) గతిని చేరడంలో అడ్డు లేదు.

**"యమునైత్తుఱైవన్"** (యామునులు) కూడా తీర్థులు- అంటే- పరమాచార్యులు. వీరు సాధుబృందావనస్థితులు. సత్పురుషుల బృందాలను రక్షించడంలో స్థిరమైన అభిప్రాయం కలవారు. వీరివలె సాధుబృందావన స్థితుడైన ఒక యామునేయుడున్నాడు. బృందావనంలోని యమునా నదిలో స్నానమాడి, గో-గోప-గోపికలు రక్షించిన శ్రీ కృష్ణునకు ఆ తీర్థంలో అధికమైన ఆదరం. అందువల్ల తానే అందులోని ఒక మడుగు కాళియ సర్ప విషంచేత దూషితమైనపుడు, ఆ సర్పంపైకి ఎక్కి, దానిని వెడలగొట్టి తీర్థంగా చేశాడు. ఆ మడుగు ఒక సమయంలో జిహ్మగస్పర్శం- వక్రంగా పోయే ఆ సర్పంయొక్క సంబంధాన్ని కల్గినదిగా ఉండేది ఏనాడూ వక్రగామిసంబంధం లేకుండా నిత్యశుద్ధులైనందువల్ల ఈ యమునైత్తు ఱైవర్ (యామునుల)పట్ల శ్రీకృష్ణునకు ఆదరం మిక్కుటమైనది. అందువల్లనేకదా తిరుక్కురుకైక్కావలప్పన్ అనే నాథముని శిష్యులు యోగాభ్యాసంలో అవగాహించి, తమకు ఎదురుగా సాక్షాత్కరించిన శ్రీకృష్ణుని అనుభవించే సమయంలో, అతనికి ప్రణమిల్లడంకోసం వచ్చిన ఆ యామునుల వైపు తిరిగి శ్రీకృష్ణుడు చూచాడు. ఆ గొప్పతనాన్ని గమనించి కురుకైకావలప్పన్ "శొట్టైనమ్బి కులమనే తమ ఆచార్యకులం యొక్క గౌరవమేకదా గౌరవం'' అని శ్లాఘించారు. ఈ విధంగా అనుగ్రహించే శ్రీకృష్ణునిపట్ల గల అభినివేశం భగవద్రామానుజులకు అతిశయితమైనది. పూర్వమే **"కణ్ణన్ కణ్ణల్లతు ఇల్లైయోర్ కణ్ణే"** (మన శ్రీకృష్ణుడు తప్ప వేఱొక రక్షకుడు లేడు) -**"ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్త్వమివోదితమ్"** (శ్రీకృష్ణతృష్ణాతత్త్వం అవతరించినట్లుగా ఉండే శఠకోపమునిని ఆరాధిస్తున్నాను.) అనే రీతిలో కృష్ణభక్తియే మూర్తీభవించిన తిరుక్కురుకైనకర్‌ముని అయిన నమ్మాళ్వార్లపట్ల భక్తితో శ్రీకృష్ణునిపట్ల భక్తి ప్రబలమై ఉన్నది. దీనికి, అవతారాలలో శ్రీకృష్ణావ తారమే తాను పరదేవత-అనే విషయాన్ని ప్రకాశింపజేయడం కూడా కారణం. దానికి ఒక ఉదాహరణాన్ని కూడా ప్రదర్శిస్తున్నారు.

22. అవ :- ఇంతవరకు శ్రీరామానుజులకు ఆళ్వార్ల విషయంలో, ఆచార్యుల విషయంలో గల భక్తి తెలుపబడింది. ఒక యామునుల శ్రీచరణాలను ఆశ్రయించి ఉజ్జీవించిన భగవద్రామానుజుల పట్ల **"విగాహే యామునం తీర్థం సాధుబృందావనే స్థితమ్, నిరస్తజిహ్మగస్పర్శే యత్ర కృష్ణః కృతాదరః"** అనే రీతిలో గొప్ప ప్రేమను కలవారైన వేఱొక యాము నేయుని కీర్తించే శీలం (వీరికి) కల్గింది- అని అంటున్నారు.

కార్త్తిక్కైయానుమ్ కరిముకత్తానుమ్, కనలుమ్ ముక్కణ్
మూర్త్తియుమ్ మోడియుమ్ వెప్పుమ్ ముతుకిట్టు, మూవులకుమ్
పూత్తవనే ఎన్ఱు పోట్రిడ వాణన్‌పిళై పొఱుత్త
తీర్త్తనై యేత్తుమ్, ఇరామానుశనెన్ ఎన్తన్ శేమవైప్పే.

కార్త్తిక్కైయానుమ్ = సుబ్రహ్మణ్యుడు, కరి ముకత్తానుమ్ = గజాననుడనే గణపతి, కనల్ ఉమ్ = అగ్నిదేవత, ముక్కణ్ మూర్త్తి ఉమ్ = రుద్రుడు, మోడి ఉమ్ = దుర్గ అనే బాణుని దేవత, వెప్పు ఉమ్ = దుర్గ అనే బాణుని దేవత, వెప్పు ఉమ్ = శైవజ్వరదేవత, ముదుకిట్టు = వెనుకకు తిరిగి పరుగెత్తి, చివరలో శ్రీకృష్ణుని, మూ ఉలకు ఉమ్ = మూడు లోకాలుగా, పూత్తవనే = పూచినవాడా!, ఎన్ఱు పోట్రిడ = అని ఈ విధంగా పొగడినపుడు, వాణన్ = బాణుడు సహాయంగా ఉండే దేవతలు బలం కోల్పోయి నమస్కరించిన తరువాత తన బలం కూడా కోల్పోయినందున విరమించి, దేవతలమూలంగానే, పిళై పొఱుత్త = అతని దోషాన్ని సహించిన, ప్రాణాలను అనుగ్రహించిన, తీర్త్తనై = అతనిని శుద్ధునిచేసిన శ్రీకృష్ణుని, ఏత్తుమ్ = స్తుతించేవారైన శ్రీరామానుజులు, ఎన్తన్ = నా, శేమమ్ వైప్పు = చిరకాలస్థితికి ఉపాయమైన ధనం.

అగ్ని, దుర్గ, గణపతి, సుబ్రహ్మణ్యస్వామి మొదలైనవారిని నమస్కరించి వచ్చినా, వారికంటే త్రినేత్రుడు అధికుడు - అని ముల్లోకాలు శివుని కొలిచినా, అతనికంటే అధికుడు చతుర్భుజుడే - అని బాణుడు గ్రహించి వచ్చేటట్లుగా శ్రీకృష్ణుడు తన పరాక్రమాన్ని ప్రదర్శించాడు కదా!- అని ఆ మూర్తిలో శ్రీకృష్ణునిలో చాలా గొప్ప భక్తి శ్రీరామానుజులకు ఉన్నది. ఈ నిధిని పొందితే ఇక ఎల్లప్పుడూ క్షేమమే. బాణునివలె అలమటించ వలసిన పని లేదు.

**23.** అవ :- **"ఎన్తన్ శేమవైప్పే"** అని అంటూ నాకు ఎల్లప్పుడు శ్రీరామానుజులవారివల్ల క్షేమం - అని అముదనార్ అంటున్నాను.



శుభకాలంకోసం ఎదురుచూస్తున్నాను ఇందువల్ల వారికి కలిగే నిందను గమనించకుండా ఉన్నాను - అని అంటూ తమ నైచ్యానుసంధానంతో బాధపడుతున్నారు.

వైప్పాయ వాన్ పొరుళెన్ఱు, నల్లన్బర్ మనత్తకత్తే
ఎప్పోతుమ్ వైక్కుమ్ ఇరామానుశనై, ఇరునిలత్తిల్
ఒప్పారిలాత ఉఱువినైయేన్ వంజనెంజిల్ వైత్తు
ముప్పోతుమ్ వాళ్త్తువన్, ఎన్నా మితు అవన్ మొయ్‌పుకళ్క్కే.

నల్ అన్బర్ = వంచన లేక, మంచి ప్రేమను కలవారిచే, మనత్తు అకత్తే = శుద్ధమైన తమ మనస్సు లోపల, వైప్పు ఆయ్ = మహానిధి అయిన, వాన్ పొరుళ్ = గొప్ప వస్తువైన భగవంతుడే వీరు, ఎన్ఱు = అని దృఢంగా, ఎప్పోదుమ్ వైక్కుమ్ = ఒక్కక్షణంకూడా విడువకుండా నిలుపబడుతున్న, ఇరామానుశనై = శ్రీరామానుజులను, ఇరు నిలత్తిల్ = ఈ గొప్ప భూమిలో, ఒప్పార్ ఇలాద = నాకు సాటి లేని, ఉఱు వినైయేన్= ఒకటిగా చేరిన పాపాలను కల్గిన నేను, వఞ్జమ్ నెఞ్జిల్ = వంచన కల మనస్సులో, ము పోదు ఉమ్ = మూడు కాలాలలోను, వైత్తు వాళ్త్తువన్= పెట్టుకొని ఇక్కడ నిలుపగోరుతున్నాను, ఇది వారి, మొయ్ పుకళ్క్కు = అపకీర్తికి అవకాశం ఇవ్వకుండా ఉండే, గాఢమైన కీర్తికి, ఎన్ ఆమ్ ఏ = ఏమవుతుందో!

"మంచి హృదయాన్ని కలవారు అన్ని సమయాలలో నన్ను మనస్సులో నిలుపుకుంటున్నారుకదా" - అని తలచి, దుష్కృత్యాలను చేసిన నేను వంచనను కల నా మనస్సులో నిలిపి, **"శాశ్వతమైన క్షేమనిధి" (శేమవైప్పు)** అని క్షేమాన్ని వేడుతున్నాను. దీనివల్ల వారికి, "తగనిచోట వీరు నిలచి ఉన్నారు అనే దోషం వస్తుందేమో!" అనే దానిని గమనించ కుండా ఉన్నానే - అని భయపడతున్నారు. **"కొళ్ళక్కుఱైవట్రు"** అనే 27వ పాశురంలోకూడా ఇంకొక రీతిలో ఈ విధంగా (నైచ్యాన్ని) అనుసంధిస్తున్నారు. అక్కడ వారి సౌలభ్యం స్పష్టం అవుతున్నది. ఇక్కడ

తాము తమ మనస్సులో నిలుపుకోవడం తగదని తెలుపబడింది. ఆ మహానుభావునకు అపకీర్తిని కల్గించడం నాకు ఒక తగని పని అవుతుంది కదా! అనికూడా భయపడతున్నారు.

**24.** అవ :- బాణుని చరిత్రను బాగా తెలిసినపుడు శ్రీకృష్ణుడు పరదేవత అనే భావన కొనసాగితే, మిగిలిన ఆస్తిక-నాస్తిక- నిరీశ్వర -సేశ్వర మతాలు అన్నీ అసత్యాలు అవుతాయి. అంతేకాక, యుక్తి-ప్రమాణాలతో భగవద్రామానుజులు వాటిని నశింపజేశారు ఇందువల్ల **"వైప్పాయ వాన్ పొరుళ్"** - గొప్ప నిధి అయిన మహార్థం ఏది? అనే విషయం సులభంగా తెలిసికొని, ఆ అర్థమే భగవద్రామానుజులు - అని చక్కని భక్తిని కల్గి, సత్పురుషులు తమ మనస్సులో నిలుపుకొంటున్నారు- అని భావించి, ఇతర మతాలను శ్రీరామానుజులు నిరాకరించిన గొప్పతనాన్ని గూర్చి పల్కుతున్నారు. ఇంతేకాక, శ్రీరామానుజులను ఎల్లప్పుడు (ముప్పొద్దుల) మనస్సులో నిలుపుకొని మీరు మంగళాశాసనం చేయడం ఏమి ప్రయోజనాన్ని పొందడం కోసం ? అని అంటే, దానిని కూడా అముదనార్ తెలుపుతున్నారు.

**మొయ్త్త వెమ్ తీవినైయాల్ పల్లుడర్ తొఱుమ్ మూత్తు, అతనాల్**
**ఎయ్త్తొళిన్దేన్ మున నాళ్కళెల్లామ్, ఇన్ఱు కండుయర్న్దేన్**
**పొయ్త్తవమ్ పోట్రుమ్ పులైచ్చమయంగళ్ నిలత్తవియ**
**క్కైత్త మెయ్ఞ్ఞానత్తు, ఇరామానుశన్ ఎన్నుమ్ కార్తన్నైయే.**

మున నాళ్కళ్ ఎల్లామ్ =అనాదిగా అన్ని దినాలలో, మొయ్త్త = నిబిడంగా చేరిన, వెమ్ తీ వినైయాల్ = నరకగతికి హేతువైన క్రూరకర్మలతో, పల్ ఉడల్ తోఱుమ్ = లెక్క లేనన్ని శరీరాలను ఎత్తి, మూత్తు = ముసలితనం వరకు చిరకాలం పరిభ్రమించి, అదనాల్ = ఆవిధంగా పరిభ్రమించినందున, ఎయ్త్తు ఒళిన్దేన్ = అలసట చెంది, తాపత్రయంతో అసత్కల్పుడనయ్యాను, ఇన్ఱు = ఈ జన్మలో, పొయ్



తవమ్ = అశాస్త్రీయాలైన పలు తపస్సులను, పోట్రుమ్ = గొప్ప అని పలికే, పులై శమయఙ్గళ్ = నీచమతాలు, నిలత్తు అవియ =భూమిలో లేకుండా ఉండే రీతిలో నశించేటట్లు, కైత్త = వాటిని ఏరిపారవేసిన, మెయ్ ఞానత్తు = యథార్థజ్ఞానాన్ని కల, ఇరామానుశన్ ఎన్నుమ్ = శ్రీరామానుజులనే, కార్తన్నై = చల్లని మేఘాన్ని, కణ్డు= దర్శించి, ఉయర్న్దేన్ = పూర్ణమైన సత్తను పొందాను.

వేదాన్ని పక్కకు పెట్టి, దానికి తగని అర్థాలను పల్కి తత్త్వహిత పురుషార్థాలలో విపరీతంగా ప్రవర్తించే విపరీతజ్ఞానుల వాదాలను అన్నిటినీ భూమిలో మళ్ళీ తిరిగి అంకురించకుండా ఉండే రీతిలో శ్రీరామానుజులు సమూలంగా పెళ్ళగించారు, ఈ మేఘాన్ని దర్శించి నపుడే నా తాపత్రయాలు అన్నీ నశించాయి. పుట్టినా వెంటనే నశిస్తే పాపాలను చేయకుండా ఉండవచ్చు. పలు శరీరాలను అనాదిగా పొంది, వాటిలో చిరకాలం పూర్ణాయుస్సులో ఉన్నందువల్ల నేను మూటకట్టుకొన్న దుష్కర్మలచేత తాపం తీరే దారిని పొంద లేని నేను నీచమతాలలో ప్రవేశించి, నన్ను అసత్కల్పుడను అనే రీతిలో చేసికోకుండా తప్పి బయటపడి బతికి వర్ధిల్లడం అంతా ఈ చల్లని మేఘంవల్లనే. అందుచేత నాకు జరిగిన మంచిని గ్రహించి నేను దానిని మనస్సులో నిలిపి, మంగళాశాసనం చేస్తున్నాను - అని భావం.

**25.** అవ :- అనిష్టనివారణంతో పాటు ఇష్టప్రాప్తి కల్గడం మాత్రమే చాలదు. ఎవరైనా ఒక సదాచార్యులను ఆశ్రయించినా అవి సిద్ధిస్తాయి. ఆచార్య గుణగణ రసాస్వాదమనే మహాలాభం శ్రీరామానుజులు నన్ను చేర్చుకొన్నందువల్ల సిద్ధించింది-అని ఇందులో అముదనార్ అంటున్నారు.

**కారేయ్ కరుణై ఇరామానుశ! ఇక్కడలిడత్తిల్**
**ఆరే యఱివర్ నిన్నరుళిన్ తన్మై?, అల్లలుక్కు**
**నేరే యుఱైవిడమ్ నాన్ వన్దు నీ యెన్నై యుట్రపిన్ ఉన్**

శీరే ఉయిర్క్కుయిరాయ్, అడియేఱ్కిన్ఱు తిత్తిక్కుమే.

కార్ ఏయ్ = మేఘానికి సాటి వచ్చే, కరుణై = దయను కల, ఇరామానుశ= శ్రీరామానుజా!, నిన్ అరుళిన్ తన్మై = నీ దయాప్రవాహాన్ని, ఇ కడల్ ఇడత్తిల్ = సముద్రం చుట్టి ఉండే ఈ భూమిలో, ఆర్ అఱివార్= ఎవరు పూర్ణంగా తెలియగలరు? (ఎందుకంటే), అల్లలుక్కు = దుఃఖాలన్నిటికి, నేర్ ఏ నాన్ = నేరుగానే నేనే, కరుణతో మీరే శ్రీరంగానికి వచ్చి, ఎన్నై ఉఱ్ఱ పిన్ = అహంకారి అయిన నన్నుకూడా చేర్చుకొన్న తరువాత నాకు, ఇన్ఱు = ఇపుడు, అడియేఱ్కు = దాసత్వాన్ని తెలిసిన, ఉన్ శీర్ ఏ = పరమాచార్యులైన మీ కల్యాణగుణాలన్నీ, ఉయిర్క్కు = ఆత్మకు, ఉయిర్ ఆయ్ = ధారకపోషకాలై, తిత్తిక్కుమ్ = మిక్కిలి భోగ్యం అవుతున్నాయి.

ఈ ప్రకృతిమండలంలోనే అన్ని పురుషార్థాలకు మించిన ఆచార్యగుణానుభవరసాస్వాద పురుషార్థాన్ని పొందాను. దుఃఖాలు అన్నిటికి విరుద్ధమైన ఆనందసముద్రంలో మునిగిన దశ నాకు కల్గింది- అని భావం.

**26.** అవ :- భగవద్రామానుజులే కాదు, వారిని ఆశ్రయించినవారి వద్ద ఉండే హైన్యాలన్నీ నాకు పరమభోగ్యాలుగా ఉన్నవి- అని అంటున్నారు.

తిక్కుఱ్ఱ కీర్త్తి యిరామానుశనై, ఎన్శెయ్ వినైయామ్
మెయ్ క్కుఱ్ఱమ్ నీక్కి విళంగియ మేకత్తై, మేవుమ్ నల్లోర్
ఎక్కుఱ్ఱువాళర్ ఎతుపిఱప్పు ఏతియల్వాక నిన్ఱోర్
అక్కుఱ్ఱ మప్పిఱప్పు, అవ్వియల్వే నమ్మై యాట్కొళ్ళుమే.

ఎన్ శెయ్ వినై ఆమ్ = బుద్ధిపూర్వకంగా చేసిన కర్మలనే, మెయ్ కుఱ్ఱఙ్గళ్ = ఫలాన్ని ఇచ్చే నశించే అపరాధాలను, నీక్కి విళఙ్గియ = పోగొట్టినందున కీర్తిని పొందిన, మేకత్తై = నీలమేఘం వంటి, తిక్కు ఉఱ్ఱ కీర్త్తి = ముందుగానే దిక్కులన్నీ వ్యాపించే కీర్తిని కల, ఇరామానుశనై = శ్రీరామానుజులను, మేవుమ్ నల్లోర్ = ప్రీతిపూర్వకంగా ఆశ్రయించి ఉండే సత్పురుషులు, ఎ కుఱ్ఱ వాళర్ = ఏ అవరోధాన్ని చేసినవారో, ఎదుపిఱప్పు ఆక నిన్ఱోర్ = ఏ ఏ జాతిలో జన్మించారో, ఎదు ఇయల్పు ఆక నిన్ఱోర్ = ఏ కర్మను వృత్తిగా కలవారో, అ క్కుఱ్ఱమ్ = ఆ జన్మ, ఆ స్వభావం, నమ్మై = ఆ విధంగా లేని మనలను కూడా, ఆట్కొళ్ళుమ్ = వారికి దాసులుగా చేస్తాయి.



జ్ఞానానుష్ఠాన వైరాగ్యాలతో అన్ని దిక్కులలో వ్యాపించిన కీర్తిని కల భగవద్రామానుజులనే మేఘం నా దోషాలను పోగొట్టే శక్తిని కల్గినదని తెలియబడి గొప్ప ప్రసిద్ధిని పొందింది. లోకంలో ఎవరూ నేను పొందినంత నీచస్థితిని పొందలేదు. ఇటువంటి ఈ మేఘాన్ని ఆశ్రయించే సత్పురుషులకు దోషాలు, నీచజన్మ, నీచమైన జీవనోపాయం ఉన్నా, వారికి అవి ఏ మాత్రం నైచ్యాన్ని కల్గించవు. వారు గొప్ప దయతో ఆచార్య కటాక్షానికి పాత్రం కావడానికి అదే కారణం కావడంవల్ల, దాని మూలంగా ఏర్పడిన ఆచార్యసంబంధమహిమ కారణంగా మనలను వారికి దాసులను చేయడంకూడా అదే కాగలదు.

**"కుఱ్ఱమ్"** (దోషం) అంటే - అకృత్యాలను చేయడం. **పిఱప్పు**- జాతి, **ఇయల్పు** - వృత్తి, శీలం. హైన్యాలైన అవి వారికి ఉన్నా మనం వారికి ప్రేమతో కైంకర్యం చేస్తే, అపుడే మనకు రామానుజదాసదాసత్వం స్థిరంగా సిద్ధిస్తుంది కనుక, అవియే మనలను వారికి దాసులుగా చేస్తాయి- అని చెప్పవచ్చు. ఈ సత్పురుషులవద్ద ఉండే ఆ దోషాలు మొదలైనవి, వేఱు చోట ఉన్నట్లుగా మనం కైంకర్యం చేయడంలో అడ్డు కావు- అనే భావంతో **"అడిమై కొళ్ళుమ్"** అని చెప్పబడింది. ఏ - విరోధియే అనుకూలం అవుతుంది.

**27.** అవ :- నా దోషాలను పోగొట్టి ప్రకాశించిన మేఘం ("ఎన్ కుఱ్ఱమ్

నీక్కి విళఙ్గియ మేకమ్") అని గత పాశురంలో అన్నాను. మేఘం ఉన్న చోటికి మనం పోయి మన తాపాన్ని తీర్చుకోవడం, మేఘం మనపై నిలచి మన తాపాన్ని తీర్చడం - అనే ఈ రెండిటిని చూచినపుడు, మేఘమే తానుగా వచ్చి అనుగ్రహించడమే లోకరీతిలో ఉన్నది. కనుక, **"ముప్పోదుమ్ వాళ్త్తువన్, ఎన్నా మిదు అవన్ మెయ్‌పుకళ్క్కే!"** అని నేను తొలగి ఉండాలని తలచినా (శ్రీరామానుజులనే మేఘం) నాపైకి వచ్చి నన్ను కాపాడుతున్నది. ఇందువల్ల ఇది నా నైచ్యానుసంధానంగా పర్యవసించి, నాకు గుణాన్ని కల్గిస్తున్నది. శ్రీరామానుజులే స్వయంగా నన్ను అనుగ్రహించడం వారికి ఉదారస్వభావానికి దార్ఢ్యాన్ని కల్గిస్తున్నది- అని అంటున్నారు.

**కొళ్ళ క్కుఱైవఱ్ఱిలంగి, క్కొళున్దు విట్టోంగియ ఉన్**
**వళ్ళల్‌తనత్తినాల్ వల్వినైయేన్ మనమ్ నీ పుకుందాయ్,**
**వెళ్ళై చ్చుడర్‌విడు మున్ పెరుమేన్మైక్కు ఇళుక్కితెన్ఱు**
**తళ్ళుఱ్ఱిరంగుమ్, ఇరామానుశ! ఎన్ తని నెంజమే.**

ఇరామానుశ = ఆచార్యా!, కొళ్ళ = ఎంత గ్రహించినా, కుఱైవు అఱ్ఱు = నీటిని గ్రహించిన మేఘం తెల్లబడిపోయేటట్లు మాఱకుండా, ఇలఙ్గి = ప్రకాశించి, కొళున్దు విట్టు = ముందు కంటే ఎక్కువగా వృద్ధిని పొంది, ఓఙ్గి ఉన్ = ఆకాశంమధ్యలో ప్రకాశించే నీలమేఘంవంటి మీ, వళ్ళల్ తనత్తినాల్ = ఔదార్యగుణాతిశయం చేత, వల్ వినైయేన్ = నిబిడంగా ఉండే క్రూరపాపాలను కల నా, మనమ్ నీ పుకున్దాయ్ = మనస్సులో కూడా మీరే ప్రవేశించారు. ఇదు = ఈ విధంగా చేరడం, వెళ్ళై = మేఘం తెల్లబడి తేలిక కావడంవలె కాకుండా, సారాన్ని కల్గినదై, సాత్త్వికశుద్ధి అనే తెల్లదనాన్ని పొందినవారు, శుడర్ విడుమ్ ఉన్ = జ్ఞానప్రకాశం కలిగించేవారైన మీ, పెరు మేన్మైక్కు = ఘనంగా వ్యాపించిన గొప్పతనాన్ని, ఇళుక్కు ఎన్ఱు = అవద్యమవుతుందేమో! అని తలచి,



ఎన్ తని నెఞ్జమ్ = సహాయం లేని నామనస్సు, తళ్ ఉఱ్ఱు ఇరఙ్గుమ్ = శ్రమను పొంది క్లేశపడుతున్నది.

నా మనస్సు సహించలేదు. "తెలిసికొన్నాము" - అని అందఱు నిశ్చయాన్ని పొందేటట్లుగా నిర్ణయాన్ని కల్గినది అయినా, చేసిన అపరాధాలను తలచినపుడు నా మనస్సు నైచ్యాన్ని విడువకుండా ఉన్నది. అందువల్ల క్లేశపడే దీనికి రక్షకులు ఎవరూ లేరు. కనుక ఇది తల్లడిల్లినపుడు దీనిని పట్టుకొని ఉద్ధరించే వారెవరు లేరు - అని భావం. లేక, ఇంతటి నీచునివద్దకు వచ్చిన శ్రీరామానుజులు ఏకొఱత లేని వారైనా, కళంకాన్ని పొందుతారేమో! అని భావించే స్థితికి నేను నీచుడనై ఉన్నందువల్ల, అందఱి మనస్సులు సంకోచిస్తే, ఇక నాకు గతి ఎవరు? అందుచేత నా మనస్సు నిస్సహాయమై, క్లేశపడుతున్నదని -భావం. లేక, **"తని నెఞ్జమ్"** అనే దానికి దోషంగా భావిస్తున్నది నా మనస్సు మాత్రమే''- అని కూడాచెప్పవచ్చు.

28. అవ :- ఈ రీతిలో క్లేశాన్ని పొందిన మనస్సును కలవారైనా, తేఱుకొని "ఆచార్యులకు ఇది గౌరవమే'' అని నిశ్చయంతో తమ స్థితిని గూర్చి పల్కుతున్నారు. **"పరాఙ్ముఖానాం గోవిందే విషయాసక్త చేతసామ్, తేషాం తత్ పరమం బ్రహ్మ దూరాత్ దూరతరే స్థితమ్"** (గోవిందునకు పరాఙ్ముఖులై, లౌకిక విషయాల పట్ల ఆసక్తిని పొందిన మనస్సు కలవారికి, ఆ పరబ్రహ్మం చాలా దూరంలో ఉంటాడు.) అనే రీతిలో తన దరి చేరనివారికి ఆ గోవిందుడైన రామానుజుడు తాను దుర్లభుడు అవుతాడు. ఈ రామానుజులు, ఆ రామానుజుని శ్రీచరణాలను ఆశ్రయించనివారికి దుర్లభులు. తనను ఆశ్రయించాలని భావించడం లేదు. అదేరీతిలో మనంకూడా ఈ రామానుజుల సంబంధం లేనివారిని స్తుతించని వాక్కును కలవారమై ఉన్నాము- అని అంటున్నారు.

**నెంజిల్ కఱై కొండ కంజనై క్కాయ్‌న్ద నిమలన్, నంగళ్**
**పంజి త్తిరువడి పిన్నైతన్ కాతలన్, పాతమ్ నణ్ణా**

**వంజర్క్కరియ ఇరామానుశన్ పుకళన్ఱి యెన్ వాయ్**
**కొంజి ప్పరవకిల్లాతు, ఎన్న వాళ్విన్ఱు కూడియతే.**

నెఞ్జిల్= తన మనస్సులో, కఱై కొణ్డ = తొలగని మలినాన్ని తానే పొందిన, కఞ్జనై = కంసుని, కాయ్న్ద = వేఱు గతి లేనందున, నశింపజేసినవాడై, నిమలన్ = అతని శుద్ధునిగా చేసినవాడు, నఙ్గళ్ = మనకు పురుషకారభూతుడైన, పఞ్జి తిరు వడి = పత్తివంటి మెత్తని శ్రీచరణాలను కల, పిన్నైతన్ = నప్పిన్నైకు, కాతలన్= ప్రేమను కలవాడైన శ్రీకృష్ణుని, పాదమ్ నణ్ణా = శ్రీచరణాలలో ప్రేమ లేనివారు, అరియ = పొందలేని, ఇరామానుశన్ = శ్రీరామానుజుల, పుకళ్ అన్ఱి = దైవప్రకృతిని కల్గించే కీర్తిని విడచి, వేఱొకదానిని, ఎన్ వాయ్ = నా వాక్కు, కొఞ్జి = అభిమానించి, పరవకిల్లాదు = స్తుతించదు, ఇన్ఱు = ఈ జన్మలో, ఎన్న= ఇటువంటి, వాళ్వు= ఉజ్జీవనం, కూడియదే = కల్గిందే ! మహాభాగ్యం.

దేవకికి తాను పుత్రుడు కాబోయే విషయాన్ని తెలిసినప్పటినుండి ఆమెపట్ల పగను కల్గినవాడై, ఎంతగా ప్రయత్నించినా తొలగని ద్వేషంతో, శ్రీకృష్ణుడు అవతరించినప్పటినుండి అసురులను పంపి, అతనిని చంపించాలని ప్రయత్నించిన కంసుని వధించి నిర్మూలం చేసినవాడు, తనను నమ్మినవారికి ఏవిధంగా అయినా హాని కల్గని రీతిలో చూచేవాడు, **"నిశామయతు మాం నీళా యద్భోగపటలైః ధ్రువమ్, భావితం శ్రీనివాసస్య భక్తదోషేష్వదర్శనమ్"** (తన భోగపరంపరలతో శ్రీనివాసుడు భక్తుల దోషాలను చూడకుండా ఉండేటట్లు చేసే నీళాదేవి నన్ను కటాక్షించాలి) అనేటట్లుగా ఆశ్రితుల దోషాలు కన్పించని రీతిలో మఱుగుపరచడంవల్ల **"నీళా"** అనే పేరును పొందిన దివ్యదేవేరివద్ద మనపట్ల గల ప్రీతితో ప్రేమను శ్రీకృష్ణుడు పొందాడు- అని అతనిని ఆశ్రయించ వలసి ఉండగా, ఆ స్వభావాన్ని లేనివారికి శ్రీరామానుజులు దరి చేరడానికి వీలు కానివారు. ఇటువంటి శ్రీరామానుజుల కీర్తినే నా వాక్కు ఎల్లప్పుడు



పల్కుతుంది. అరుదైన గొప్ప ఉజ్జీవనం అప్రయత్నంగా లభించడం ఎంత ఆశ్చర్యం!

**29.** అవ :- **"కణ్ణన్ కణ్ణల్లతు ఇల్లైయోర్ కణ్ణే"** (శ్రీకృష్ణుడు తప్ప వేఱొక రక్షకుడు లేడు), **"పత్తుడై యడివర్క్కు ఎళియవన్"** (భక్తిని కలవారికి సులభుడు) అనే రీతిలో అభినివేశాన్ని పొందిన నమ్మాళ్వార్ల శ్రీసూక్తులలో ఆసక్తిని పొందడానికి శ్రీకృష్ణునిపట్ల గల భక్తియే కారణమవుతుంది - అని వారి దివ్యసూక్తులలో తమకు గల అభినివేశాన్ని తిరిగి అముదనార్ సూచిస్తున్నారు.

**కూట్టుమ్ వితి ఎన్ఱు కూడుంగొలో?, తెన్కురుకైప్పిరాన్**
**పాట్టెన్నుమ్ వేతప్పశుమ్ తమిళ్ తన్నై, త్తన్పత్తి యెన్నుమ్**
**వీట్టిన్కణ్ వైత్త ఇరామానుశన్ పుకళ్ మెయ్యుణర్న్దోర్**
**ఈట్టంగళ్తన్నై, ఎన్ నాట్టంగళ్ కణ్డిన్బమెయ్తిడవే.**

కూట్టుమ్ విది = గొప్పదైన విషయాన్ని కూర్చే భాగ్యం, తెన్ కురుకై ప్పిరాన్ = అందమైన కురుకాపురిలో ఆవిర్భవించిన ఆళ్వార్ల, పాట్టు ఎన్నుమ్ = పాశురాలనే, వేదమ్ = వేదాల, పశుమ్ తమిళ్ తన్నై = అందమైన ద్రావిడరూపాన్ని, తన్ పత్తి ఎన్నుమ్ = తన భక్తి అనే, వీట్టిన్ కణ్ = స్థిరమైన ఇంటిలో పెట్టుకొన్న శ్రీరామానుజుల, పుకళ్ మెయ్ ఉణర్న్దోర్ = కీర్తిని చక్కగా తెలిసినవారి, కూట్టఙ్గళ్ తన్నై = సంఘాలను, ఎన్ నాట్టఙ్గళ్ = నా నేత్రాలు, కణ్డు = ప్రతిచోట దర్శించి, ఇన్బమ్ ఎయ్దిడ = ఆనందాన్ని పొందేటట్లు, ఎన్ఱు కూడుమ్ కొల్ = ఎపుడు సంభవిస్తుందో కదా!

ఏ ఊరిలో అయినా, ఏ నగరంలో అయినా వేదాలకు మాఱు రూపం అయిన నమ్మాళ్వార్ల దివ్యప్రబంధంయొక్క రసానుభవాన్ని భక్తితో కల్గించే భగవద్రామానుజుల గొప్పతనాన్ని తెలిసిన మహానుభావుల సమూహాలు కలసి ఆడే అందాన్ని చూచి ఆనందించే అదృష్టం నాకు

ఫలించాలి.

30. అవ :- నమ్మాళ్వార్ల శ్రీసూక్తుల మూలమైన అనుభవంలో వ్యక్తమైన అర్థాన్ని చూపి, దానివల్ల కలిగే గొప్ప ఫలం - ఉభయవిభూతుల స్వామ్యం- అని అంటున్నారు. పాశురంలో **"నిరయమ్ పల"** అనే పదంతో నిజమైన నరక లోకాన్నే నిర్దేశిస్తున్నారని చెప్పదగి ఉన్నా, ప్రబంధాలలో పలు సందర్భాలలో సంసారాన్ని నరకంగా చెప్పబడుతున్నందున **"ఏతే వై నిరయాః"** అనే రీతిలో ప్రకృతిమండలంలో ఉన్నవాటిని అన్నిటిని గ్రహించవచ్చు.

> **ఇన్బమ్ తరు పెరువీడు వందెయ్‌తిలెన్?, ఎణ్ణిఅంద**
> **తున్బమ్ తరు నిరయమ్ పల శూళిలెన్?, తొల్లులకిల్**
> **మన్‌పల్లుయిర్‌కట్కు ఇఱైయవన్ మాయనెన మొళిన్ద**
> **అన్బననకన్, ఇరామానుశ నెన్నై యాండననే.**

తొల్ ఉలకిల్ = అనాదిగా ప్రవాహంగా సృష్టింపబడే లోకాలలో, మన్ పల్ ఉయర్‌కట్కు = స్థిరంగా సంసారానికి బ్రహ్మాది సర్వజీవులకు, ఇఱైవన్ = స్వామి అయినవాడు, మాయన్ = విష్ణువే, ఎన మొళిన్ద = అని స్థాపించిన, అన్బన్ = భాగవతప్రవణులైన శ్రీరామానుజులు నన్ను పాలించారు, ఇక, ఇన్బమ్ తరు= పరమానందాన్నే కల్గించే, పెరు వీడు = మహామోక్షమైన వైకుంఠాన్ని, ఉకన్దు = ఆనందంతో, ఎయ్‌తిల్ ఎన్ = పొందితే ఏమి?అక్కడ వెళ్ళకుండా ఇక్కడే, ఎణ్ ఇఱన్ద = లెక్కకు అందని, తున్బమ్ తరు= దుఃఖాలనే కల్గించే, పల నిరయమ్ = పలు పలు సంసారాలనే నరకయాతనలు, శూళిల్ ఎన్ = చుట్టుకుంటే ఏమి?

మోక్షాన్ని పొందడానికి ముందే పూర్వకర్మానుగుణంగా ఈ లోకంలో పలు దుఃఖాలకు లక్ష్యమైనా, మనకు దేవ-తిర్యక్- మనుష్య- స్థావర సర్వజీవకారణభూతుడు నారాయణుడే- అనే శ్రీరామానుజుల అనుభవం ఘనమైనది అయిన తరువాత, ఈ అనుభవంలో ఉండే ఆదరంచేత ఎంతటి సంసారయాతన అయినా మనస్సు కలత చెందడానికి కారణం కాదు. భగవానుని ఆశ్రయించి, దేహావసానంలో మోక్షాన్ని పొందేవారికి యముని లోకానికి వెళ్ళడంలో ప్రసక్తియే లేకుండా పోయినా, అది సంభవిస్తేకూడా బాధ లేదు - అనే మనోదార్ఢ్యం తెలుప బడుతున్నదనికూడా చెప్పవచ్చు. సంభవించే అవకాశం ఉన్నందున సంసారదుఃఖాలనే **"నిరయా"**లని పలికే రీతి ఉన్నందువల్ల వాటిని ఇక్కడ గ్రహించడం యుక్తం. 98వ పాశురంలోని **"ఇడుమే ఇనియ శువర్క్కత్తిల్? ఇన్నమ్ నరకిల్ ఇట్టు చ్చుడుమే?"** (ఇష్టమైన స్వర్గంలోకి తోసినా, ఇంకా నరకంలోకి గెంటిబాధలు పెట్టినా) అనే సూక్తికి అర్థం ఆ సందర్భంలోనే తెలుపబడుతుంది. రాబోయే 34వ పాశురంలో **"ఎన్‌పెయ్ వినైతెన్ పులత్తిల్ పొఱిత్త అప్పుత్తకచ్చుమ్మై పొఱుక్కియ పిన్"** (నరకంలో నా పాపాలను గూర్చి వ్రాయబడిన ఆ పుస్తక భారం దహింపజేసిన తరువాత) అని తమకు నరకప్రాప్తి లేదని అనబోతున్నారుకదా! **"తొల్లులకిల్ మన్‌పల్ ఉయిర్"** అనే ప్రయోగానికి ఉభయవిభూతులలో ఉండే నిత్య-ముక్త- బద్ధసర్వజీవులనే అర్థాన్ని గ్రహించవచ్చు. **"మన్"** అంటే - స్థిరమైన- అని అర్థం.

31. అవ :- ఆ కాలంలో శ్రీరంగంలో నిత్యవాసాన్ని చేసే భగవద్రామా నుజులు, మొదట అవతరించినది శ్రీపెరుంబూదూర్‌లో కనుక, కాంచీ పురంలో శ్రీవరదరాజస్వామి సన్నిధిలో యాదవప్రకాశులు, తిరుక్కచ్చి నంబి మొదలైనవారివద్ద ఇతరమతాల వైఖరిని, తమ మతప్రకారాన్ని తెలిసికొని, మధ్యలో ఆవరదరాజస్వామియొక్క విశేషాను గ్రహాన్ని ఆళవన్దార్ కటాక్ష మూలంగా పొంది, తరువాత పెరియనంబి శ్రీచరణాలను ఆశ్రయించి, తమ సంబంధాన్ని కలవారు అందఱికి తేజస్సును, బలిమిని అంతటిని కల్గించగల్గినవారై, పంచాయుధాలతో కలిగిన ఒక అద్వితీయ మైన అవతారమనే రీతిలో వెలిగి, శ్రీభాష్యాదులను అనుగ్రహించిన లేత పరువంలోని మహిమలను ఒక రీతిలో అనుసంధిస్తూ మూడు

పాశురాలను అముదనార్ అనుగ్రహిస్తున్నారు.

**ఆండుకళ్ నాళ్ తింగళాయ్, నికళ్ కాల మెల్లామ్ మనమే**
**ఈండు పల్‌యోనికళ్‌తోఱు ఉళల్వోమ్, ఇన్ఱోర్ ఎణ్ణిన్ఱియే**
**కాండకు తోళణ్ణల్ తెన్నత్తియూరర్ కళలిణైక్కీళ్**
**పూండవన్బాళన్, ఇరామానుశనై ప్పొరున్దినమే.**

మనమే = నామనసా!, ఆణ్డుకళ్ ఆయ్ = సంవత్సరాలుగా, నాళ్ తిజ్గళ్ ఆయ్ = అహోరాత్రులు, మాసాలై, నికళ్ కాలమ్ = గడచే అనాదికాలం, ఎల్లామ్ = అంతా, ఈణ్డు = పలు సత్కర్మలతో కూడుకొని, పల్ యోనికళ్ తోఱు = పలు విధాలైన జన్మలలో దేనిలోను, ఉళల్‌వోమ్= విడువకుండా పరిభ్రమించి వచ్చే మనం, ఇన్ఱు =ఈ జన్మలో, ఓర్ ఎణ్ ఇన్ఱియే = మొదట ఈ విషయమైన చింత లేనపుడే ఎదురు చూడకుండానే, ఇరామానుశరై ప్పొరున్దినమ్ =శ్రీరామానుజులను పొందాము, ఎటువంటి వారిని? అంటే, కాణ్ తకు తోళ్ = చూస్తే ఇంకా చూస్తూనే ఉండేటట్లు చేసే బాహువుల అందాన్ని, బలిమిని కల, అణ్ణల్ = స్వామి అయిన, తెన్ అత్తియూరర్ = అందమైన హస్తిగిరినాథుడైన వరదరాజస్వామి యొక్క, కళల్ ఇణై కళ్ = శ్రీచరణాలు రెండిటిలోను, పూణ్డ అన్బు ఆళన్ = పొందిన మహాభక్తిని కలమహానుభావుడు (ఇటువంటి వీరిని పొందాము).

ఒక పర్యాయానికి పలు పర్యాయాలు ఒక్కొక్క జాతిలోను జన్మించి పరిభ్రమించిన మనకు ఈనాడు ఇంతవరకు సంభవించని నూతనమైనది ఒకటి పొందడానికి సాధ్యమైనది. ఆదిలో అవతరించినది మొదలు హస్తిగిరి నాథుడైన వరదరాజస్వామి విశేషకటాక్షానికి పాత్రమై, వేదవేదాంత సర్వశాస్త్రాలు తమ వద్ద చేరి, కొత్త ప్రాణాన్ని పొందే రీతిలోని తమ సామర్థ్యాన్ని తలచి, "ఏమి వరదరాజస్వామి కరుణ ! నన్ను యతిరాజుగా చేశాడే!'' అని తలుస్తూ ఒక్కొక్క దినం శ్రీరంగంలో ఈనాడు కూడా ఎల్లప్పుడు దర్శించదగిన బాహువులను, వక్షఃస్థలాన్ని కల శ్రీరంగనాథుని అనుభవించే భగవద్రామానుజులను ఆశ్రయించాము. ఇక వారిని విడచి



పోము. **"అత్ర పరత్ర"** - ఇక్కడ అక్కడ - ఎక్కడైనా వారి శ్రీచరణాలలోనే పొందికగా ఉండేటట్లుగా ఓ మనసా ! నన్ను చేశావు. నీ సహకారంవల్లనే ఈ గొప్ప ఫలం లభించింది. ఓ మంచి మనసా! మంచిది! బాగు బాగు- అని భావం.

**"ఆణ్డుకళ్ నాళ్ తిజ్గళ్"** అని విడదీసి పల్కడం ఎందుకు ? అంటే- కొన్ని జన్మలలో కొన్ని దినాలలోనే మరణించాము, కొన్నిటిలో మాసాల వ్యవధిలో, మఱికొన్నిటిలో సంవత్సరాల అవధిలో మరణించాము - అని తెలుపడంకోసం. అన్ని జన్మలలోను ఒకనాడు కూడా ఈ విధంగా హితాన్ని కల్గినదినం లేదు- అని చెప్పడంకోసం.

**32.** అవ :- భగవద్రామానుజుల చేరికవల్ల గురువైన యాదవప్రకాశులు కూడ సంస్కరింపబడ్డారు. మన పూర్వాచార్యులు కూడా వీరు దర్శన స్థాపనాన్ని చేసినందువల్ల సత్సంప్రదాయనిష్ఠులు - అనే గొప్పతనాన్ని పొందారు. వీరి శ్రీచరణాలను ఆశ్రయించినవారికి అన్నీ లభించడం తెలిసిన విషయమే. **"యత్పాదకోటీరయోః సంబంధేన సమిథ్యమానవి భవాన్ ధన్యాన్ తథాఽన్యాన్ గురూన్"** (శ్రీరామానుజుల శ్రీచరణ, శిరస్సంబంధం వల్ల ప్రకాశించే వైభవాన్ని కలవారు ధన్యులైన ఆచార్యులను) అనే విశేషణాన్ని ప్రయోగించి, **"పత్యుః సంయమినాం చరణౌ"** (యతీంద్రుల శ్రీచరణాలలో) అని అన్నారు కదా శ్రీదేశికులు. భగవద్రామానుజుల సంబంధంచేత పూర్వాచార్యులుకూడా ముక్తిని పొందారు - అని భట్టర్ వచించారని అంటారు. **"కీళ్ మేల్ ఎళు ప్పిఱప్పు"** (క్రింద పైన ఏడేడు జన్మలు) సంసారిగా ఉంటే వీరి సంబంధంవల్ల ముక్తిని పొందుతారు- అని చెప్పవచ్చు. పూర్వమే మోక్షాన్ని పొందిన పూర్వాచార్యుల విషయంలో అది తగదు కనుక, "ముక్తిని పొందారు'' అనే దానికి "మన సిద్ధాంతం తరువాత కొనసాగలేదే''- అనే చింతనుండి ముక్తిని పొందారు'' అని, పూర్వాచార్యులు విత్తిన విత్తుకదా భగవద్రామానుజుల వలన శాఖోపశాఖలుగా విస్తరించింది- అని కీర్తింపబడినందున

వైభవాన్ని పొందారు- అని భావం - అని అంటూ **"సమిధ్యమానవిభవాన్"** అనే ప్రయోగంతో దేశికులు తెలిపారు. ఇటువంటి గొప్పతనాన్ని భావిస్తూ అముదనార్ ఈ పాశురాన్ని అనుగ్రహిస్తున్నారు.

> **పొరున్దియ తేశుమ్ పొఱైయుమ్ తిఱలుమ్ పుకళుమ్, నల్ల**
> **తిరున్దియ ఞానముమ్ శెల్వముమ్ శేరుమ్, శెఱు కలియాల్**
> **వరున్దియ ఞాలత్తై వణ్మైయినాల్ వన్దెడుత్తళిత్త**
> **అరున్దవన్, ఎంగళ్ ఇరామానుశనై యడైపవర్క్కే.**

శెఱు కలియాల్ = సన్మార్గాన్ని పాడు చేసే కలిచే, వరున్దియ = క్లేశాన్నే పొందిన, ఞాలత్తై = భూమిలో, వన్దు = అవతరించి, వణ్మైయినాల్ = తమ శక్తితో, ఎడుత్తు అళిత్త = ఉద్ధరించి రక్షించిన, అరుతవన్ = అరుదైన సంకల్ప శక్తిని కల్గిన, ఇరామానుశనై = శ్రీవైష్ణవతిలకమైన శ్రీయతిరాజులను, అడైపవర్క్కు = పొందినవారికి సంబంధాన్ని పొందిన పూర్వోత్తర జీవులకు, పొరున్దియ తేశు ఉమ్ = విడచిపోని తేజస్సు, పొఱై ఉమ్ = సహనం, తిఱల్ ఉమ్ = సామర్థ్యం, పుకళ్ ఉమ్ = కీర్తి, నల్ల = పరమ పురుషార్థంలో పర్యవసించే, తిరున్దియ = కలతకు చోటు లేని, ఞానమ్ ఉమ్ = శాస్త్రార్థజ్ఞానం, శెల్వమ్ ఉమ్ = అన్ని సంపదలు, శేరుమ్ = ఒకటిగా చేరి ఉంటాయి.

**"కప్యాసం పుండరీకమ్"** ఇత్యాదిగా ఆ యా శ్రుతివాక్యాల నిర్వాహం చేసి, అన్యమతనిరాసాన్ని చేసినందువల్ల శ్రీభాష్యకారుల తేజస్సు ప్రసిద్ధం. మతాంతరస్థులు రాజ్యపాలన చేసే సందర్భంలో భిక్ష, విద్య (చదువు) మొదలైన వానికి అన్నిటికి వారు చేసిన ద్రోహాలను అన్నిటిని సహించడం వీరి చరిత్రద్వారా తెలియవచ్చు. రాగద్వేషాదులు లేకుండా ఇంద్రియ జయాన్ని పొందిన సామర్థ్యం, తానే వ్యాపించిన యశస్సు, తమకు పిమ్మట రాబోయే మతాలను నిరసించ గల్గిన నిర్మల జ్ఞానం, భగవద్భక్తి, కైంకర్యం - అనే సంపద అంతా వారివద్ద ప్రసిద్ధం. వారిని ఆశ్రయించిన వారిలో శ్రీవైష్ణవులు కాకుండా, కొంచెం సంబంధాన్ని పొందినవారై, శ్రీరామానుజుమతానికి



దగ్గరగా ఉండే వైష్ణవ మతస్థులకుకూడ ఇవి అన్నీ తగిన రీతిలో చేరుతాయి.

**33.** అవ :- **"వన్దు ఎడుత్తళిత్త"** అని పల్కినందువల్ల శ్రీరామానుజులు ఒక అవతార విశేషమని స్ఫురిస్తున్నది. "ఎవరి అవతారం ?" అని అంటే, దానిని ఒకవిధంగా వివరిస్తున్నారు. ఒక్కొక్క దివ్యాయుధమే పర్యాప్త మైనా, అన్ని ఆయుధాలు ఒకటిగా చేరడం విశిష్టాద్వైతంలో గల విశేషాభిమానంతో, పంచభూత-పంచప్రాణ-పంచేంద్రియ - కర్మవిద్యాది పంచక-సాంఖ్యతార్కిక బౌద్ధజైన పాశుపాదులైన పలు పంచకాలను నిరసించడం కోసం ఈ పంచకం అవతరించింది.

> **అడైయార్ కమలత్తలర్మకళ్ కేళ్వన్, కైయాళి యెన్నుమ్**
> **పడైయొడు నాందకముమ్ పడర్తండుమ్, ఒణ్ శార్ఙ్గవిల్లుమ్**
> **పుడైయార్ పురిశంగము మిన్ద ప్పూతలమ్ కాప్పతఱ్కెన్ఱు,**
> **ఇడైయే ఇరామానుశముని యాయిన ఇన్నిలత్తే.**

అడై ఆర్ = రేకులునిండిన, కమలత్తు = తామరలో ఉండే, అలర్ మకళ్ = పూవుపై ఉండే లక్ష్మీదేవియొక్క, కేళ్వన్ = పతి అయిన భగవంతుని, కై = చేతిలో వెలిగే, ఆళి ఎన్నుమ్ పడై యొడు = శ్రీసుదర్శనమనే ఆయుధంతో, నాన్దకమ్ ఉమ్ = నందకమనే ఖడ్గం, పడర్ తణ్డుమ్ ఉమ్ = శత్రువులపై వ్యాపించే గదను, ఒణ్ శార్ఙ్గమ్ విల్లుమ్ = శార్ఙ్గమనే అందమైన ధనుస్సు, పుడై ఆర్ = పార్శ్వం నిండిన పురి శజ్గమ్ ఉమ్ = దక్షిణావర్తశంఖం పాంచజన్యం, అనే ఈ అయిదు, ఇన్ద పూతలమ్ = ఈ భూమండలాన్ని, కాప్పదఱ్కు ఎన్ఱు = కాపాడడంకోసం, ఇ నిలత్తు = ఈభరతమండలంలో, ఇడై ఏ = నడుమన, ఇరామానుశన్ ముని = యతిరాజులుగా, ఆయిన = అవతరించాయి.

**"అడైయార్"** అనే విశేషణం పూవు యొక్క సాంద్రతను, నీటిలో ఉండడం వల్ల కల్గిన చల్లదనాన్ని తెలుపుతుంది. తామరాకును, పూవును చేరినట్లుగా ఉంటుంది - లక్ష్మీదేవి, భగవానుల చేరిక - అనికూడా చెప్పవచ్చు. **'కై'** అనే పదం అంతటా అన్వయిస్తుంది. **"పడైయొడు"** అని

అన్నందువల్ల సుదర్శనం ఒక్కటే రక్షణలో సరిపోయినా, అన్నీ దీని మూలంగా కీర్తి, కైంకర్యం పొందాలని చేరాయి - అని తెలుపబడింది. **"పుడైయార్"** - భగవానుని ఎడమవైపున ఉండే శంఖం రెండు వైపుల వ్యాపించి, వైశాల్యాన్ని కల శంఖం - అనేటట్లున్నదని భావం. ఈ పాశురానికి పంచాయుధాలు శ్రీరామానుజమునిగా అవతరించాయి- అనే అర్థమే సరసం. **"ఇడైయే"** అనేటపుడు **"ఇన్నిలత్తు ఇడైయే"** - (ఈ భూమిలో) అని కలుపుకోవాలి. లేక, గురుపంక్తిమధ్యలో- అని భావం. ముందు లేక, వెనుకలలో పలువురు ఆచార్యులు ఉండగా, పంచాయుధాలు అవతరించి శ్రీరామానుజులు కాగా - అని భావం. దీనిని విడచి, శేషావతారమే శ్రీరామానుజులని స్థాపించడంకోసం, పంచాయుధాలు శ్రీరామానుజుల పక్షంలో అయినవి - వారివద్ద చేరినవి అనే అన్వయం, అర్థం అంత సరసం కాదు. **"ప్రథయన్ విమతేషు"** అనే యతిరాజసప్తతి శ్లోకంకూడా అయిదు చేరి యతిరాజులుగా ఆవిర్భవించాయని తెలుపుతున్నది. ఒక తిరుమేనికి అయిదు నిత్యసూరులు ఆత్మ- అనేమాట పొసగదు కదా - అని అంటే, **"ఇరామానుశముని యాయిన"** అనే దానికి వీరిలో పంచాయుధాల అనుప్రవేశమనే భావాన్ని చెప్పవచ్చు. వీరిలో ఒకటి చేరి, పంచాయుధాల వృత్తిని- గొప్పతనాన్ని పొందినది- అనే భావాన్ని గ్రహించవలసివస్తే **"ఇరామానుశ మునియాయిన"** అని అన్నందువలననే ఆ అర్థం లభిస్తుంది. శేషావతారం - అనే దానికి కూడా ఆదిశేషుని అంశ- అనే అర్థం వస్తుంది. **"సా మూర్తిః మురమర్దనస్య జయతి త్రయ్యంత సంరక్షిణీ"** (వేదాంతాలను రక్షించే ఆ మురారి రూపం) అని సాక్షాత్ శ్రీమన్నారాయణుని అవతారమే శ్రీరామానుజులని అన్నారు. **"నను రామావరజః స ఏష భూయః"** (ఆ రామానుజులే కదా ఈ రామానుజులు) అనే సూక్తికూడా గమనార్హం. ఈ పాశురంలోని మొదటి పాదంలో పిరాట్టియొక్క, భగవానునియొక్క అవతారరూపులని సూచింపబడింది. వీరిరువురి గుణాలు ప్రకాశించడంవల్ల ఆళ్వార్లను భగవానుని



అభినవదశావతారాలుగా, నిత్యసూరుల అవతారాలుగా పల్కుతున్నాము. కీర్తించేటపుడు ఆ యా విశిష్టవ్యక్తులుగా పల్కడమే తగును. యథార్థాన్ని తగిన రీతిలో గ్రహించాలి.

**34.** అవ :- పంచాయుధాలు ఆయుధరూపాలలో ఉన్నపుడు, శత్రువుల ఉసురును తీయడం ప్రధానమై ఉన్నది. శ్రీరామానుజమునిగా అవతరించి నపుడు ప్రాణాలకు ఛేదం లేదు. వారి మనోభావమే మాఱింది. అందువల్ల కలియొక్క క్రౌర్యం నశించింది - అని అంటూ, తమ చెడ్డను తొలగించడమే వాటిలో ప్రధానమైనది - అని అంటున్నారు.

**నిలత్తై చ్చెఱుత్తుణ్ణుమ్ నీశక్కలియై, నినైప్పరియ**
**పెలత్తై చ్చెఱుత్తుమ్ పిఱంగియతిల్లై, ఎన్ పెయ్వినై తెన్**
**పులత్తిల్ పొఱిత్త అప్పుత్తకచ్చుమ్మై పొఱుక్కియ పిన్**
**నలత్తై ప్పొఱుత్తతు, ఇరామానుశన్తన్ నయప్పుకళే.**

ఇరామానుశన్తన్ = భగవద్రామానుజుల, నయమ్ పుకళ్ = అహింసాదిమయమైన శుభగుణాల, పుకళ్ = ప్రసిద్ధి, నిలత్తై = ఈ భూమిని, శెఱుత్తు = హింసించి, ఉణ్ణుమ్ = తనకు వశం చేసికొన్న, నీశమ్ కలియై = నీచుడైన కలియొక్క, నినైప్పు అరియ = ఇంత మాత్రం అని భావించలేని, పలత్తై = బలిమిని, శెఱుత్తుమ్ = నశింపజేసినతరువాత కూడా, పిఱజ్గియదు ఇల్లై = బాగా ప్రకాశం పొందలేదు, ఎపుడు ప్రకాశాన్ని పొందాయి? అంటే, ఎన్ పెయ్ వినై = నేను చేసిన పాపాలను, తెన్ పులత్తిల్ = నరకలోకంలో, పొఱిత్త =లిఖించబడిన, అప్పుత్తకమ్ శుమ్మై= ఆ పుస్తకాలకట్ట, పొఱుక్కియ పిన్ = నశింపజేసిన తరువాతనే, నలత్తై= గొప్పప్రకాశాన్ని, పొఱుత్తదు = సహించింది.

**"కలియై"** -ఇది విభక్తివ్యత్యయప్రయోగం. కలియొక్క - అని అర్థం. కలిబలం నశించినందువల్ల ఈ భూమి అంతా విష్ణుమయమై, నరకంలో జనం లేని రీతిలో అయినది. అయినా నా ప్రబల కర్మలను

సూచించే పుస్తకాల కట్టలను యమలోకంలో ఉన్నందువల్ల నేను ఒక్కడనుమాత్రం అక్కడ బాధపడవలసి ఉన్నది- అని తలచాను. ఆ కట్టలు కూడా శ్రీరామానుజుల ప్రభావాగ్ని దహించివేసింది. నిజానికి దీనికంటే గొప్పవానినికూడా నశింపజేసే శక్తి వారి కల్యాణగుణాలకు ఉన్నా, నాకు మించిన పాపి ఈ లోకంలో లేనందువల్ల నామూలంగా ఏర్పడిన గొప్ప ప్రకారాన్ని చూచి దీనికి మించిన కర్మల సమూహాన్ని నశింపజేయగల కల్యాణగుణాలకు ఇది ఏమాత్రం ! అని తలచి ఇంతకంటే ఏమీ దొరకనందువల్ల నశించింది. ఇదే కదా **"నయప్పుకళ్"**- అని భావం.

**35.** అవ :- "ఇక, విపరీతజ్ఞానమూలమో, అజ్ఞానమూలమో, అకృత్యకరణమో, కృత్యాకరణమో - ఇవేమీ సంభవించవు. కనుక ప్రబలకర్మలకు చోటు లేదు'' - అని అంటున్నారు.

**నయవే నొరు దెయ్వమ్ నానిలత్తే, శిల మానిడత్తై**
**ప్పుయలే యెన క్కవిపోఱ్ఱి శెయ్యేన్, పొన్నరంగమెన్నిల్**
**మయలే పెరుకు మిరామానుశన్ మన్ను మామలర్త్తాళ్**
**అయరేన్, అరువినై ఎన్నై ఎవ్వాఱు ఇన్ఱడర్ప్పతువే?**

నాల్ నిలత్తు = జనులుండే నాల్గు విధాలైన భాగాలున్న భూమిలో నమస్కరించే, ఒరు దెయ్వమ్ = వేఱుదైవం దేనినీ, నయవేన్ = వేడబోను, శిల మానిడత్తై = విష్ణుభక్తి లేని లౌకిక మానవులను, పుయల్ ఏ ఎన = మంచిని కల్గించే నీలమేఘమే నీవు అని, కవి = పాశురాలతో, పోఱ్ఱి శెయ్యేన్ = స్తుతిని చేయబోను, పొన్ అరఙ్గమ్ ఎన్నిల్ =భోగ్యమైన శ్రీరంగం అనేటపుడే, మయల్ ఏ పెరుకుమ్ = వ్యామోహం ప్రవహించే, ఇరామానుశన్ = శ్రీరామానుజుల, మన్ను = ఆశ్రితరక్షణలో స్థైర్యాన్ని కల, మా మలర్ = తామరపూవువంటి, తాళ్ = శ్రీచరణాలను, అయరేన్ = మఱువను, ఈ స్థితిలోఉండే నన్ను, అరు వినై = క్రూరకర్మలనేవి, ఏ ఆఱు = ఏవిధంగా ప్రవేశించి, అడర్ప్పదు = పైబడిన నశింపజేయ గలదు?



**"అచ్యుతపదాంబుజ యుగ్మరుక్మవ్యామోహ"** (అచ్యుతుని పదాంబుజాల అనే బంగారం పట్ల వ్యామోహం) వెల్లువగా ప్రవహించే భగవద్రామానుజుల శ్రీచరణయుగ్మం అనే బంగారు పద్మాన్ని మరచిపోని నాకు అజ్ఞాన-విపరీత జ్ఞానమూలమైన మానవవిషయం, అన్యదేవతావిషయమై వాక్కు ఇక నాకు రాదు.

**36.** అవ :- పంచాయుధాలు శ్రీరామానుజులే - అని పూర్వం అన్నారు. పంచాయుధాలను ఒక విధంగా విడచి పెట్టి, ఆదిశేషుని అవతారం అయిన బలరామునకు తమ్మునిగా అవతరించి, రామానుజులనబడే శ్రీకృష్ణుడే ఈ రామానుజులు. అందువల్లనేకదా శ్రీకృష్ణుడు అనుగ్రహించిన శ్రీగీతయొక్క యథార్థంలో జీవులనందఱిని ఉజ్జీవింప జేసి, అపుడు ఉపయోగపడని (ఫలించని) గీతను ఈనాడు పూర్తిగా ఫలవంతంగా అయేటట్లు చేశారు - అని అంటున్నారు.

**అడల్ కొండ నేమియన్ ఆరుయిర్నాతన్, అన్ఱారణచ్చొల్**
**కడల్ కొండ వొణ్ పొరుళ్ కండళిప్ప, ప్పిన్నుమ్ కాశినియోర్**
**ఇడరిన్ కణ్ వీళ్న్దిడ త్తానుమవ్వొణ్ పొరుళ్ కొండు అవర్పిన్**
**పడరుమ్ కుణన్, ఎమ్ ఇరామానుశన్ఱన్ పడి యితువే.**

అడల్ కొణ్డ = మిక్కిలి బలిమిని కల్గిన, నేమియన్ = శ్రీసుదర్శనాన్ని కలవాడై, ఆర్ ఉయిర్ నాదన్ == అరుదైన జీవులకందఱికి స్వామి అయినవాడు, అన్ఱు = అర్జునుడు ఆనాడు తికమకపడి ప్రపన్నుడైనపుడు, ఆరణమ్ శొల్ కడల్ = వేదరూపమైన శబ్దాలనే సముద్రంలో, కొణ్డ = లోతులో మఱుగుపడి ఉండే, ఒణ్ పొరుళ్ = ప్రకాశాన్ని కల రత్నాలను, కణ్డు ఆళిప్ప పిన్నుమ్ = దర్శించేటట్లు అనుగ్రహించిన తరువాత కూడా, కాశినియోర్ = సంసారంలో ఉండేవారు (పలువురు కలత పొందించినందున, విశదమైన వస్తువులను చూడలేక), ఇడరిన్ కణ్ = దుఃఖంలోనే, విళున్దిడ = పడి ఉండేటపుడే, అ ఒణ్ పొరుళ్ = ఆనాడు

చూపిన గొప్ప విషయాన్నే, కొణ్డు = తిరిగి ఉద్ధరించి, అవర్ పిన్ = ఆ లోకంలోని వారి వెంటనే, తానుమ్ పడరుమ్ కుణన్ = భూమిలో వ్యాపించి ఉండే వారి వద్ద తాము యతిరాజులై వ్యాపించే దయాదిగుణాలను కలవారైనారు, ఇదు ఏ = ఈ విధమైన అవతారమా? ఎమ్ ఇరామానుశన్ తన్ పడి = శ్రీరామానుజులైనవారి ప్రకారం.

శ్రీకృష్ణుడు పూర్వం గీతను ఉపదేశించిన తరువాతకూడా లోకులు చెడిపోయినా, శ్రీరామానుజులు శ్రీకృష్ణునివలె తాము కూడా ఆ అర్థాలనే గ్రహించి ఆ లోకులకు ఉపదేశించి ఉజ్జీవింపజేసిన గుణాన్ని కల ఆచార్యులైన విషయాన్ని ఈ పాశురం తెలుపుతున్నది - అని ఏతావన్మాత్రమే గ్రహించవచ్చు. శ్రీకృష్ణుని అవతారమే వీరు అని రామానుజపదానికి అనుగుణంగా ఒక విధంగా ప్రతిపదార్థం తెలుపబడింది. దీనివల్ల **"వను రామావరజః స ఏష భూయః"** అనే విషయం స్పష్టమైనది. **"తానుమ్"** అనే పదంలో **"తాన్"** అనేది భగవద్రామానుజులను వలె శ్రీకృష్ణునికూడా సూచిస్తుంది. అదే రీతిలో, ఆ శ్రీకృష్ణుడే తాను **"యత్ర కృష్ణః కృతాదరః"** అనే రీతిలో ఎవరిపట్ల (శౌట్టైకులంపట్ల) ఆదరాన్ని, కల్గి ఉన్నాడో, ఆ యామునేయులైన ఆళవన్దార్ద్వారా గీతార్థ సంగ్రహమనే గ్రంథంతో ఆ మహార్థాలను దర్శింపజేసి, తావన్మాత్రంతో చాలదని తాను సాక్షాత్తుగా తిరిగి అవతరించి వ్యాపించిన దయాది గుణాలను కలవాడయ్యాడు - అనే భావాన్ని **"ఎమ్"** అనే పదంలో గ్రహించవచ్చు.

**37.** అవ :- ఈ రీతిలో (గత పాశురంలో) శ్రీరామానుజులు గీతా భాష్యాన్ని అనుగ్రహించిన రీతి సూచింపబడింది. ఇక శ్రీమద్రామాయణంలో అవగాహించి, భక్తిని వృద్ధి చేసిన రీతిని గూర్చి పల్కుతున్నారు.

**పడికొండ కీర్త్తి ఇరామాయణ మెన్నుమ్ పత్తివెళ్ళమ్,**
**కుడికొండ కోయిల్ ఇరామానుశన్ కుణమ్ కూఱుమ్, అన్బర్**
**కడికొండ మామలర్త్తాళ్ కలన్దుళ్ళమ్ కనియుమ్ నల్లోర్**
**అడి కండుకొండుకన్దు, ఎన్నైయుమ్ ఆళవర్క్కాక్కినరే.**



పడి కొణ్డ = భూమిని తనలో ఇముడ్చుకొన్న, కీర్త్తి =కీర్తిని కల, ఇరామాయణమ్ ఎన్నుమ్ = రామాయణమనబడే, పత్తి వెళ్ళమ్ = శ్రీరామభక్తి పరీవాహరూపమైన వాక్కుతో, కుడి కొణ్డ = వాసభూమిగా గ్రహింపబడిన, కోయిల్ = భగవత్స్థానమైన, ఇరామానుశన్ = శ్రీరామానుజుల, కుణమ్ కూఱుమ్ = రామాయణానుభవ పాశురాలను పలికే, అన్బర్ = భక్తులైన కూరేశులు మొదలైనవారు, కడి కొణ్డ = పరిమళం అతిశయించిన, మా మలర్ = తామరపూవువంటి, తాళ్ కలన్ద = శ్రీచరణాలకు ధ్యానించి, ఉళ్ళమ్ కనియుమ్ = మనస్సులో రసజ్ఞులైన, నల్లోర్ = భట్టర్వంటివారు, అడి కణ్డు = దాసుని వద్ద ఏదో మంచికి చోటు ఉన్నట్లుగా చూచి, కొణ్డు = నన్ను స్వీకరించి, ఉకన్దు = ఒక జీవుని రక్షిస్తున్నాము - అని ఆనందించి, ఎన్నై ఉమ్ = నీచుడనైన నన్నుకూడా, అవర్క్కు= ఆ కూరేశులు, శ్రీరామానుజులు- మొదలైనవారికి అందటికి, ఆళ్ ఆక్కినార్ = దాసునిగా చేశారు.

**"పడి కొణ్డ"** కీర్తి భూమిని దాటి వ్యాపించినందువల్ల భూమి దానిలో అణగిపోయింది. **"కీర్త్తి"** అనే పదం శ్రీరామాయణానికి, శ్రీరామానుజులకు అన్వయిస్తుంది. **"పత్తివెళ్ళమ్"** బ్రహ్మ-నారద-వాల్మీకి భక్తి పరీవాహం. ఆ రామాయణం తానుగానే తిరుమలనంబిమూలంగా రామానుజుల వద్ద నివాసాన్ని పొందింది. దానికి రామానుజులనే తిరునామానికి తగినట్లు రామభక్తులై, నివాసభూతులు కావడమే కారణం. **"లక్ష్మణో లక్ష్మిసంపన్నః"** అని రామానుజులు ప్రశంసింపబడ్డారు కదా! భగవదనుభవకైంకర్యాలను వేదాంతార్థస్థాపనంతో చేయగోరి భగవద్రామానుజులుగా అవతరించినట్లు తెలిసికొనికదా, వీరి మేనమామ అయిన తిరుమలనంబి రామానుజులనే నామకరణాన్ని ప్రారంభంలో చేశారు. అందువల్ల వారివద్ద రామాయణాన్ని వినడం వీరికి ఇష్టమైనది. గుణం అంటే అభ్యాసం, ఆవృత్తి - అని అర్థం.

తిరుమలనంబి దగ్గరనుండి పలుమార్లు పద్దెనిమిది అర్థాలను విని గ్రహించి, ఇంకా పలు అర్థాలను పరిశీలించి, పదార్థ - వాక్యార్థ స్వారస్యాలను, యోజనాభేదాలను, ఆధ్యాత్మికార్థాలను అనుభవించే సౌందర్యం ఇందులో తెలుపబడింది. దీనిని వెంటనే ఉండి అనుభవించేవారు మడప్పళ్ళి ఆచ్చాన్, కూరత్తాళ్వాన్ వంటివారు. వారు అనుగ్రహించిన శ్రీసూక్తులు అతిమానుష స్తవాదులు. పెరియతిరుమొళిలోని **"అఞ్జువన్" (3-7-3)** అనే పాశురంలో **"అరక్కర్ కులప్పావైతన్నై వెఞ్జిన మూక్కరిత్త తిఱలోన్"** (రాక్షస కులంలో పుట్టిన స్త్రీ శూర్పణఖ ముక్కు, చెవులను కోసిన బలశాలి) అనేదానికి తాత్పర్య మేమి? - అని భట్టర్ ప్రశ్నించినపుడు, మడప్పళ్ళి ఆచ్చాన్ భగవద్రామానుజుల తాత్పర్యం ఇది'' - అని తెలిపారు- అనే విషయం ఇక్కడ వ్యాఖ్యానంలో గమనించవచ్చు. **"అడి కొణ్డ"** - రామునకు ఆరాధ్యదేవత అయిన శ్రీరంగనాథునిపట్ల భక్తి మిక్కిలిగా కలవాడు ఇతడు- అని నన్ను చూచి ఆనందించారు. అందువల్ల కూరేశులకు దాసుడనై, భగవద్రామానుజులకు దాసుడనైన అధికారాన్ని (యోగ్యతను) పొందాను. ఇపుడే శ్రీరంగనాథునకు దాసుడను కావడానికి పూర్ణమైన అధికారాన్ని పొందాను.

**38.** అవ :- ''ఈ దాస్యం తమకు పలు సంవత్సరాలకు ముందే లభించి ఉంటే ఎంతగానో అనుభవించి ఉండవచ్చు. పలు సంవత్సరాలు వ్యర్థంగా గడచిపోయాయే'' అని అముదనార్ ఇందులో నిర్వేదాన్ని పొందుతున్నారు. ఈ జన్మలో కూడా, శ్రీరామానుజులు ఆవిర్భవించి చాలా నాళ్ళు అయినా, నేను కూడా పలు సంవత్సరాలకు ముందు జన్మించినా, ఎందువల్లనో మా ఇద్దఱి కలయిక ఇంతకుముందే లభించలేదు. పూర్వం నేను అక్కడకు చేరి ఆశ్రయించకపోవడమే కారణం- అనుకుంటే ఇపుడు కూడా నేను దగ్గరకు రాకుండా ఉన్నా, భగవద్రామానుజులేకదా దగ్గరకు చేర్చుకొన్నది. ఇది పూర్వంకూడ సంభవించి ఉండవచ్చునే! అనే భావంతో పల్కుతున్నారు; ఈ పాశురాన్ని. **"అన్ఱెన్నై ప్పుఱమ్ పోక పుణర్త్తల్ ఎన్శెయ్వాన్"** (ఆనాడు నన్ను బాహ్యవిషయాల వైపు పోయేటట్లు



చేయడం ఎందుకోసం?) అనే తిరువాయ్మొళి **(10-8-9)** పాశురంవలె ఈ పాశురం అనుగ్రహింపబడింది.

**ఆక్కి యడిమై నిలైప్పిత్తనై, ఎన్నై యిన్ఱవమే**
**పోక్కి ప్పుఱత్తిట్టతెన్ పొరుళా మున్బు?, పుణ్ణియర్తమ్**
**వాక్కిల్ పిరియా ఇరామానుశ! నిన్నరుళిన్ వణ్ణమ్**
**నోక్కిల్ తెరివరితాల్, ఉరైయాయ్ ఇన్ద నుణ్పొరుళే.**

పుణ్ణియర్తమ్ = పుణ్యాత్ములయొక్క, వాక్కిల్ పిరియా = స్తోత్రానికి విషయమే అయిన, ఇరామానుశ = శ్రీరామానుజా!, నిన్ అరుళిన్ = దేవరవారికృపయొక్క, వణ్ణమ్ నోక్కిల్ = ప్రకారాన్ని గమనించినట్లయితే, ఇన్ఱు = ఇంత వయస్సు అయిన తరువాత ఇపుడు, ఎన్నై ఆక్కి= నన్ను పాత్రంగా చేసి, అడిమై = దాస్యాన్ని, నిలైప్పిత్తనై = స్థిరంగా చేయడం, మున్బు = ఇదే జన్మలో ఇన్ని దినాలు, అవమ్ ఏ పోక్కి = వ్యర్థంగానే గడపివేసి, పుఱత్తు ఇట్టదు = విషయప్రవణుడుగా, గెంటివేయడం, ఎన్ పొరుళ్ = ఎందుకు? ఆ = కష్టం, తెరివు అరిదు = దీనికి కారణం తెలిసికోవడం సాధ్యం కాలేదు, ఆ =పోయినది పోయినదే, హా!, ఇన్ద నుణ్ పొరుళ్ = కారణమైన సూక్ష్మార్థాన్ని, ఉరైయాయ్ = దాసునకు పల్కి దుఃఖాన్ని తీర్చాలి.

**"నినైప్పిత్తనై"**- నీవు తలచేటట్లు చేశావు - అని భావం. **"ఇన్ఱెన్నై"** అనే పాశురంలో నమ్మాళ్వార్లు భావించిన భగవానుని స్వాతంత్ర్యమే దీనికి కారణమై ఉండాలి. భగవానుడంటే ఎవరు? శ్రీరామానుజులనబడే మీరేకదా! అదే కారణం అని పల్కినా సరే, ఇంకా అంతేకాక, ప్రాకృతాలైన దుర్గతులు కారణం- అని పల్కినా సరే- అని భావం.

**39.** అవ :- ఈ విధంగా (కాలం) వ్యర్థమైనందుకు తపించారు. ''నిజమే తెలిసికొన్నాను. ఇంతవరకు నన్ను దాసునిగా చేసికొనకపోవడానికి

కారణం - **"పొరుళుమ్ పుడల్ పరుమ్ పూమియుమ్ పూమ్ కుళలారుమే"** (ధనం, పుత్రుడు, భూమి, అందమైన కేశాలను కల స్త్రీలు) మనకు కావలసినవని తలుస్తూ, పరమపురుషార్థాన్ని గణించకుండా, అహంకారియై తిరిగిన నన్ను సంస్కరించనందువల్ల భగవద్రామానుజుల కృప అవకాశం పొందకుండా పోవడమే ఇంతగా నేను వ్యర్థుడను కావడానికి కారణం - అని వ్యక్తం చేస్తున్నారు.

**పొరుళుమ్ పుతల్వరుమ్ పూమియుమ్, పూమ్ కుళలారు మెన్ఱే**
**మరుళ్కొండిళైక్కుమ్ నమక్కు నెంజే!, మఱ్ఱుళార్తరమో**
**ఇరుళ్ కొండ వెన్దుయర్ మాఱ్ఱి త్తన్నీఱిల్ పెరుమ్ పుకళే**
**తెరుళుమ్ తెరుళ్ తన్దు, ఇరామానుశన్ శెయ్యుమ్ శేమంగళే.**

పొరుళ్ ఉమ్ = ధనం, పుదల్వర్ ఉమ్ = పుత్రులు, పూమి ఉమ్ = స్థావరమైన సొత్తు, కేశాలను కల భార్యలు, ఏ ఎన్ఱు = వీరే పురుషార్థమని తలచి, మరుళ్ కొణ్డు = అజ్ఞానం చుట్టుకొని, (వ్యాపించి), నినైక్కుమ్ తమక్కు = ఆత్మయొక్క గుణాన్ని లేకుండా చేసినమనకు, నెఞ్జే! = ఇన్నినాళ్ళు అనుభవించిన మనసా! పల్కు, మఱ్ఱు ఉళార్ తాయ్ = అన్యులు బాధపడకుండా ఉండేటట్లుచేసేవారు, ఓ = ఉన్నారా ?లేరు, ఇరుళ్ కొణ్డు = చీకటివల్ల వచ్చిన, చీకటిని కల్గించే, వెమ్ తుయర్ = మహాదుఃఖాలను, మాఱ్ఱి = మనకు రాకుండా ఉండేటట్లు అడ్డుకొని, ఈర్ ఇల్ = అంతులేని, తన్ పెరు పుకళే = తమ గొప్ప కీర్తినే, భగవద్భాగవత మహిమలనే, తెరుళుమ్ తెరుళ్ = తెలిసేతెలివిని, తన్దు = కల్గించి, సంసారంలో పెంచి, ఇరామానుశర్ = శ్రీరామానుజులు, శెయ్యుమ్ = చేస్తున్న, శేమఙ్గళ్ = స్థిరమైన హితాలే మనకు కావాలి.

మనకు మాత్రమేకాక, లోకంలో అందఱికికూడా తీవ్రమైన క్లేశాలను తొలగించి, తాము పొందిన కీర్తిని ఇతరులు కూడా పొందాలి- అని (వారికి) జ్ఞానాన్ని అనుగ్రహించి, భగవద్రామానుజులు క్షేమాలను కల్గిస్తున్నారు. వారే మనకు రక్షకులై ఉన్నారు. వేఱెవ్వరూ లేరు.



మిగిలినవారిని ఆశ్రయిస్తే ధనం, బిడ్డలు-అనే రీతిలో సంసారదుఃఖమే తొలగకుండా అనువర్తిస్తుంది. ఇందువల్లనే ఇన్నినాళ్ళుగా కృశించాము- అని తాత్పర్యం.

40. అవ :- **"పొరుళుమ్ పుదల్వరుమ్ పూమియుమ్"** (ధనం, పుత్రులు, భూమి) అని భావించేవారిని, **"పూమ్కుళలారుమ్"** (అందమైన కేశాలను కల కాంతలు) అని భావించేవారిని **"విత్తైషణాయాః పుత్రైషణాయాః లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యాం చరంతి"** (ధనంలో ఆశను, పుత్రులలో ఆశను, లోకంలోని ఆశను వదలి భిక్షను ఆచరిస్తారు) అనే రీతిలో యతిరాజులై, బ్రహ్మచర్యాన్ని ప్రధానంగా గ్రహించి, లక్ష్మీదేవిని కూడా కృష్ణాజినంతో మఱుగుపరచిన వామనుడై చూపిన రీతిలో కామం (కోరిక) లేకుండా ఉండడమే గొప్ప- అని ఉపదేశించినవారయ్యారు. "వామనశీలు"లైన శ్రీరామానుజులు చేసిన ఆ ఉపదేశంతో సంస్కరింప బడ్డాము - అని ఆ ఉపదేశాన్ని సూచిస్తున్నారు. ఈ ఉపదేశం తిరుమఙ్గై ఆళ్వార్ల తిరుమడల్ ప్రబంధాలలో చక్కగా తెలిపిన విషయమే. అముదనార్ దీనిని పరిష్కరించి పల్కుతున్నారు ఇందులో.

**శేమ నల్వీడుమ్ పొరుళుమ్ తరుమముమ్, శీరియ నల్**
**కామము మెన్ఱివై నాన్గెన్బర్, నాన్గినుమ్ కణ్ణనుక్కే**
**ఆమతు కామ మఱమ్ పొరుళ్ వీడితఱ్కు ఎన్ఱురైత్తాన్**
**వామనన్ శీలన్, ఇరామానుశన్ ఇన్ద మణ్ మిశైయే.**

ఇన్ద మణ్ మిశై = ఈభూలోకంలో, వామనన్ శీలన్ = వామనావతారంలో వలె బ్రహ్మచర్యాన్నే ప్రధానంగా గ్రహించిన, ఇరామానుశన్ = యతిరాజులు, ఉరైత్తాన్= ఉపదేశించారు ఏమని? అంటే, శేమమ్ నల్ వీడు ఉమ్ = స్థిరమై, భోగ్యమైన మోక్షం, పొరుళ్ ఉమ్ = అర్థంఅనేది, తరుమమ్ ఉమ్ = ధర్మం అనేది, శీరియ = సుఖరూప మైనందున

మిగిలినవాని కంటే గొప్పదైన, నల్ కామమ్ ఉమ్ = దుఃఖాన్ని కల్గించని కామసుఖం, ఎన్ఱ ఇవై = అనబడే పురుషార్థాలు, నాన్గు ఎన్బర్ = వేదాది ప్రమాణాలను తెలిసినవారు నాల్గు అని అంటారు, నాన్గిన్ ఉమ్ = ఈ నాల్గింటిలోను, కణ్ణనుక్కే = భగవంతునికే, ఆమ్ అదు = అయిన కామమే, కామమ్ = కామమవుతుంది, ధర్మ-అర్థ-కామాలనేవి, ఇదఱ్కు = ఈ కామానికే (అంగాలు) అవుతున్నాయి - అని అన్నారు.

భగవద్రామానుజుల ఉపదేశసారం ఏమంటే- తిరుమఙ్గైయాళ్వారు అనుగ్రహించినదికూడా ఇదే. "వీడు"(మోక్షం) అన్నది లేదని అనవద్దు. అదే "శేమమ్" (స్థిరం) నశించని పురుషార్థం అయినందువల్ల **"శేమమ్"** (స్థిరం). ఆనందరూపబ్రహ్మానుభవమై దుఃఖమిశ్రితం కానందువల్ల భోగ్యం మంచిది. అర్థం, ధర్మం సుఖరూపాలు కావు. సుఖసాధనాలు మాత్రమే. అందువల్ల అవి ముఖ్యపురుషార్థాలు కాబోవు. అయినా, వాటికోసం లోకంలో ప్రార్థింపబడుతున్నది. సుఖరూపమై ఉన్నందువల్ల వాటికంటె గొప్పది కామపురుషార్థమే. అందులో **"ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ !"** (నేను ధర్మానికి విరుద్ధం కానికామపురుషార్థాన్ని) అనే రీతిలో శాస్త్రసమ్మతమైన కామమే గ్రహించదగినది. నరకాదులకు కారణమైన నిషిద్ధకామం త్యాజ్యం. అయితే ఈ ఆనందం అల్పానందమే. **"శేమనల్వీడు"**కు (స్థిరమైన, భోగ్యమైన మోక్షానికి) ఇది సాటి రాదు. అయితే, కామ మనేది రెండు విధాలు. అన్యపురుషులను భర్తలుగా చేసికొని పొందే సుఖమనే కామం ఒకటి. శ్రీకృష్ణునే భర్తగా పొందడంవల్ల గోదాదేవియొక్క, గోపికలయొక్క కామంవంటి కామం ఇంకొకటి. దీనిని అల్పానందనంలో చేర్చడానికి వీలు కాదు. ఈ కామం తమను స్త్రీలుగా భావించినవారికి లోకంలోని అల్పానందంవలె తోచి, స్తనపరిరంభణాది ప్రకారాలను పొందుతుంది. పురుషులై ఉండేవారికి పాదసంవాహనం చేయడం, భోగభాగ్యాలతో ఆరాధించడంవంటి కృత్యాలలో పర్యవసిస్తుంది. స్త్రీభావనలో నిలచి, శ్రీకృష్ణునిపట్ల ప్రేమను పొంది, అతనికి దాస్యం చేయడమనే కామం ఈ భూమిలో కలుగవలసినది. కొందఱికి పుత్రునిగా, యువరాజుగా, అతిథిగా, తండ్రిగా -పలు రీతులలో తోచేటట్లే, భర్తగా కూడా ఇక్కడ తోచడం సహజమే. ఇందువల్ల గోపికలు బంధువులను, బిడ్డలను అందఱిని విడచి శ్రీకృష్ణునే వాంఛించారు. ఆ విధంగా ఉండాలని తలచినపుడు **"వీడు"** (మోక్షం) అనే పురుషార్థాన్ని పొంది, దీనినికూడా పొందితే మంచిది - అనే ఆశ వృద్ధి అవుతుంది. **"వీడు"** అనే మోక్షానుభవం భగవత్కైంకర్యమనే కామం కోసమే- అని భావించినపుడు **"వీడు"** అనేది శ్రీకృష్ణుని విషయమైన కామరూపమైన కైంకర్యంకోసం -అని చెప్పవచ్చు. దీనిని ఇక్కడే పొందలేనివారు **"వీడు"** (మోక్షం) కావాలని అంటారు. ఇది నేరుగా పొందబడినట్లయితే, "వీడు" గొప్పది కాదని అనవచ్చు. అందువల్ల, కామం అనేది శ్రీకృష్ణుని విషయంలోనిది, అన్యవిషయంలోనిది- అని రెండు విధాలు. ఆ శ్రీకృష్ణుని విషయంలోని కామం స్త్రీగా తమను భావించినవారికి తదనుగుణమైన సంశ్లేషం మొదలైనవిగా ఈలోకంలో కల్గుతుంది. మిగిలినవారికి భగవత్కైంకర్య ప్రవాహమై, అది స్థిరంగా కలుగడంకోసం **"శేమనల్ వీడు"** కావాలని అనే భావన కూడా కల్గుతుంది - అని ఈ రీతిలో శ్రీరామానుజులు వివరించారు- అని తాత్పర్యం.

**41.** అవ :- "భగవద్రామానుజుల ఉపదేశం ఫలించిన అవధిలో భగవానుని ఉపదేశాలు కూడా ఫలించలేదే" - అని అంటున్నారు.

**మణ్మిశై యోనికళ్ తోఱుమ్ పిఱన్దు, ఎంగళ్ మాతవనే**
**కణ్ణుఱ నిఱ్కిలుమ్ కాణకిల్లా, ఉలకోర్కళ్ ఎల్లామ్**
**అణ్ణల్ ఇరామానుశన్ వన్దు తోన్ఱియ అప్పొళుతే**
**నణ్ణరు ఞానమ్ తలైక్కొండు, నారణఱ్కాయినరే.**

ఎఙ్గళ్ మాదవనే = మనకందఱికి స్వామిఅయిన శ్రియఃపతియే, మణ్ మిశై = ఈ భూమిలో, యోనికళ్ తోఱుమ్ = ఒక్కొక్క జాతిలోను, పిఱన్దు = అవతరించి, కణ్ ఉఱ = కన్నులను ఆకర్షించేటట్లుగా,

నిఱ్కిలుమ్ = ఎదురుగా నిలచినా కూడా, కాణకిల్లా = అతనిని మన నాథుడని దర్శించి గ్రహించలేని, ఉలకోర్‌కళ్ ఎల్లామ్ = లోకంలో ఉండే వారందఱు, అణ్ణల్ = స్వామియైన, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, వన్దు = పరమపదంనుండి వచ్చి, తోన్ఱియ అప్పొళుదే = ఒకమారు అవతరించినపుడే, నణ్ (ణ) అరు = పొందడానికి అరుదైన, ఞానమ్ = సిద్ధాంతరహస్యవివేకాన్ని, తలైక్కొణ్డు = పూర్తిగా పొంది, నారణఱ్కు = ఆ శ్రియఃపతికి, ఆయినర్ = దాసులయ్యారు.

భగవానుడు అప్రాకృతమైన తిరుమేనితో ఎదురుగా సాక్షాత్కరించినా, లోకంలో వేఱు విధమైన ఆభాస శరీరాలను కల అందఱు తమవలె అతనిని భావిస్తున్నారు. (ఆభాసశరీరాన్ని కలవానినిగా భావిస్తున్నారు). ఆ స్థితిలో అతడు, "నేనే సర్వేశ్వరుడను" అని ఉపదేశిస్తే నమ్మిక కల్గడం లేదు. "వేఱొకడున్నాడు" అంటే అది అసత్యమవతున్నది. అందుకోసం తనయొక్క ఈశ్వరత్వాన్ని అతడు ప్రదర్శిస్తున్నాడు. అపుడుకూడా ఏదో ఇంద్రజాలమని తలచి తొలగిపోతున్నారు. ఇటువంటి సంకటానికి అవకాశం లేనట్లు భగవద్రామానుజులు అవతరించి, సర్వేశ్వరునిగూర్చి ఉపదేశించినపుడు అందఱు చక్కగా గ్రహించారు. అంతేకాక, గీతలో శ్రీకృష్ణుడు స్పష్టంగా అనుగ్రహించినా కూడా పలు నూతనసిద్ధాంతాల చేత యథార్థం మఱుగుపడింది. వాటిని నిరసించి, వాస్తవాన్ని తిరగి అజ్ఞానానికి వీలు లేని రీతిలో భగవద్రామానుజులే వ్యక్తం చేశారు.

**42.** అవ :- భగవానునికంటే భగవద్రామానుజులకు పూర్వం తెల్పిన అతిశయాన్ని ఇంకొక విధంగా వివరిస్తున్నారు.

**ఆయిళైయార్‌కొంగై తంగుమ్, అక్కాతలల్ అళఱ్ఱళున్ది**
**మాయు మెన్నావియై వన్దెడుత్తానిన్ఱు, మామలరాళ్**
**నాయక నెల్లా ఉయిర్‌కట్కుమ్ నాత నరంగ నెన్నుమ్**
**తూయవన్, తీతిల్ ఇరామానుశన్ తొల్లరుళ్ శురన్దే.**

మా మలరాళ్ = తామరపూవులో అవతరించిన లక్ష్మికి, నాయకన్ = నాయకుడై ఉండి, ఎల్లా ఉయిర్‌కట్కుమ్ = జీవులకు అందఱికి, నాదన్ = ఆమెకువలె నాథుడై ఉండేవాడైన, అరఙ్గన్ = ఈ అర్చామూర్తి అయిన శ్రీరంగనాథుడు, ఎన్నుమ్ = అని ఉపదేశించిన, తూయవన్ = పరిశుద్ధులైన, తీదు ఇల్ = దోషం ఏమీ లేని, ఇరామానువన్ = శ్రీరామానుజుల, తొల్ అరుళ్ = అనాది అయిన దయను, శురన్దు = నాపట్ల ప్రవహింప జేసి, ఆయ్ ఇళైయార్ = అందమైన ఆభరణాలను కల స్త్రీల, కొఙ్గై తఙ్గుమ్ = స్తనాలలో నిలచి ఉండే, అ కాదల్ = ఇంతటిని చెప్పడానికి వీలుకాని ప్రేమ అనే, అళఱ్ఱు = బురదలో, అళున్ది మాయుమ్ = నా ఆత్మను, ఇన్ఱు వన్దు = ఈ జన్మలో దరిచేరి, ఎడుత్తాన్ = ఉద్ధరించారు.

నేత్రాలను, మనస్సును అపహరించే నల్లని మేనిని దర్శింపజేసే విభవమూర్తి అయిన శ్రీకృష్ణుని ఉపదేశం ఫలించలేదు. అతనికంటే, అందమైన ఆభరణాలను కల్గిన స్త్రీలే అందమైనవారని మోహించి, వారి స్తనాలను కౌగలించుకొని నశించాను. శ్రీరామానుజుల సామర్థ్యాన్ని చూడండి. "లక్ష్మీదేవి **"అకలకిల్లేన్"** అని క్షణంకూడా ఎడబాయలేని మూర్తి ఇది. ఆమెవలె జీవులందఱు దర్శించి ఆనందించే ప్రేమను పొందదగిన మూర్తి ఇది"- అని అర్చామూర్తి అయిన శ్రీరంగనాథుని దర్శింపజేసి, "ఇది యథార్థం" అని దృఢంగా మనస్సులో నిలిచేట్లు అనుగ్రహించారు. ఈ విధంగా శ్రీరంగనాథుని దర్శించినపుడే ఆ తగని ప్రేమలో చిక్కుకొన్నవాడనైన నేను దానిలోనుండి బయటపడి ఉజ్జీవించాను. ఇపుడు **"కణ్ణనుక్కే యామదు కామమ్"** అని స్పష్టపడింది- అని తాత్పర్యం. ఇక్కడ ఒక స్త్రీ విషయంలోనే ప్రేమను కలవానిని **(పిళ్ళై ఉఱఙ్గా విల్లిదాసర్)** పిలిచి, శ్రీరంగనాథుని దర్శింపజేసి, అతనిని మార్చి శ్రీరామానుజులు సంస్కరించారు - అనే చరిత్ర ఇక్కడ అనుసంధేయం.

**43.** అవ :- శ్రీరామానుజుల ఉపదేశాన్ని ఆలకించే తరుణం ఇంకా లభించలేకపోయినా, శ్రీరామానుజులు అని పల్కితేనే చాలు, అన్ని ప్రయోజనాలు సిద్ధిస్తాయి - అని అంటున్నారు.

**శురక్కుమ్ తిరువు మొణర్వుమ్, శొలప్పుకిల్ వాయముతమ్**
**పరక్కు మిరువినై పఱ్ఱఱ వోడుమ్, పడియిలుళ్ళీర్ !**
**ఉరైక్కిన్ఱన నుమక్కియానఱమ్ శీఱు ముఱుకలియై**
**త్తురక్కుమ్ పెరుమై, ఇరామానుశన్ ఎన్ఱు శొల్లుమినే.**

పడియిల్ ఉళ్ళీర్ = భూమిలో ఉండే వారలారా!, ఉమక్కు యాన్ = మీకు నేను, అఱమ్ శీఱుమ్ = ధర్మంపట్ల కోపాన్ని పొందిన, ఉఱు కలియై = ఆవలికి పోని కలిని, తురక్కుమ్ పెరుమై = తరిమి వేసే గొప్పతనానికి దారిని, ఉరైక్కిన్ఱనన్ = చెబుతున్నాను. అది ఏది? అంటే, ఇరామానుశన్ ఎన్ఱు శొల్లుమిన్ = రామానుజులు అని పలకండి, శొల ప్పుకిల్ = పల్కడానికి ఆరంభించినపుడే, తిరువుమ్ = పుణ్యమైన తేజస్సు, శురక్కుమ్ = కల్గుతుంది, ఉణర్వు ఉమ్ = గొప్ప జ్ఞానం కల్గుతుంది, వాయ్ అముదమ్ పరక్కుమ్ = నోటిలో అమృతరసాస్వాదం కల్గుతుంది, ఇరు వినై = రెండు విధాలైన కర్మలు కూడా, పఱ్ఱు అఱ = కొంచెం కూడా అంటుకోకుండా, ఓడుమ్ = పరుగెత్తిపోతాయి.

శ్రీరామనామంయొక్క మహిమకు మించిన మహిమ శ్రీరామానుజ నామానికి ఉన్నది. శ్రీరామనామం కొన్ని పాపాలను మాత్రమే పోగొడు తుంది. ఆ తరువాత భక్తియోగాదులను అనుష్ఠించి ద్వివిధ కర్మలను తీర్చుకోవాలి. శ్రీరామానుజనామం అటువంటిది కాకుండా, వేఱొకదానిని మనం ఆచరించనక్కరలేని రీతిలో రీతిలో తానే ఇక్కడ అన్నిటినీ ఇచ్చి, రెండు విధాలైన కర్మలను పోగొడుతుంది. అంటే, ఆ తిరునామాన్ని అనుసంధించినంతలోనే ఆ ఆచార్యవర్యులు దయచూపి, తగినది చేసి, ఉజ్జీవింపచేస్తారని భావం. **“శొలప్పుకిల్”** అనే దానికి ఇంకా ఇంకా (పునః పునః) పల్కితే - అనే అర్థాన్ని తెల్పుతారు. ఒకసారి పల్కితేనే చాలు. **“పెరుమై”** అనే పదాన్ని ద్వితీయావిభక్త్యంతరూపంగా గ్రహించకుండా, శ్రీరామానుజులకు విశేషణంగాకూడా చేయవచ్చు. **“ఉమక్కియాన్”** - **“ఉమ్మకు్కు”** అనేచోట ఉకారం ఇకారంగా మారింది, తరువాత యకారం వచ్చినందువల్ల.



**44.** అవ :- గతంలో, శ్రీరామానుజులకు గల దివ్యప్రబంధాలలోని అభినివేశాన్నిగూర్చి పల్కి, శ్రీరామాయణం, గీత మొదలైన సంస్కృత గ్రంథాలలోని విశేషానుభవాన్ని, అన్యమతాలను నిరసించేవారి సామర్థ్యాన్ని తెలిపారు. ఇపుడు వాటికికూడ మూలమైన ద్రావిడవిభాగాలను, వేదాలను పూర్తిగా గ్రహించిన మహానుభావులు శ్రీరామానుజులు -అనిఅంటున్నారు.

**శొల్లార్ తమిళొరు మూన్ఱుమ్, శురుతికళ్ నాన్గుమ్ ఎల్లై**
**యిల్లా అఱనెఱి యావుమ్ తెరిన్దవన్, ఎణ్ణరుమ్ శీర్**
**నల్లార్ పరవు మిరామానుశన్ తిరునామమ్ నంబి**
**క్కల్లార్ అకలిడత్తోర్, ఎతు పేఱెన్ఱు కామిప్పరే.**

శొల్ ఆర్ = శబ్దాలు నిండుగా ఉండే, తమిళ్ = ద్రావిడభాషలో ఉండే, ఒరు మూన్ఱు ఉమ్ = ఇయల్, ఇశై, నాటకమ్- అనే విభాగాలను, శురుతికళ్ = వేదాలైన, నాన్గు ఉమ్ = ఋక్, యజుస్సు, సామం, అథర్వమనే విభాగాలను, ఎల్లై ఇల్లా = లెక్కలేని, అఱమ్‌నెఱి = ధర్మమార్గాలు, యావుమ్ = అన్నిటిని, తెరిన్దవన్ = విశదంగా తెలిసినవారు, ఎణ్ అరు శీర్ = లెక్కకట్టలేని కల్యాణగుణాలను కలవారు, నల్లార్ పరవుమ్ = సత్పురుషులచే స్తుతింపబడినవారైన, ఇరామానుశన్ = శ్రీరామానుజుల, తిరు నామమ్ = తిరునామాన్ని, నమ్బి = రెండు విధాలైన కర్మలను తొలగిపోతుందని విశ్వసించి, కల్లార్ = ఎవరు అభ్యసించలేదో, అకల్ ఇడత్తోర్ = విశాలమైన భూమిలోఉండేవారిలో, వారే, ఏదు పేఱు = ఏ పురుషార్థాన్ని, ఎన్ఱు కామిప్పర్ = ఎపుడు కోరతారు?

"తమిళ్ ఒరు మూన్఺ుమ్" - ఇయల్, ఇశై, నాడకమ్ - అని ద్రావిడంలో మూడు విభాగాలు తెల్పుతారు. ఇయల్ విషయంలోని జ్ఞానం అంటే - అక్షరసంఖ్య, ప్రాణ- వ్యంజనాలనే (అచ్చులు- హల్లులు అనే) వర్ణవిభాగం, వాటి ఉత్పత్తి ప్రకారం, వర్ణసంయోగం, గణాలు, దళం, ప్రయోగం, ఛందస్సు - మొదలైన అన్నివిషయాలు. "ఇశై" అంటే రాగాలు, వాటి అంతర్విభాగాలు, నాటకం- అంటే ఈ రెండిటి చేరికలో ఆ యా అర్థాలకు తగిన రీతిలో వాటిని అభినయంతో ప్రదర్శించడం మొదలైనవి. నాల్గు శ్రుతులు - ఋగ్వేదాదులు. ఋక్కు అంటే ఛందోబద్ధమైన వాక్కు. వీటికి, ఇయల్‌కు సంబంధం ఉన్నది. సామం అంటే గీతికలు. ఇదికూడా తమిళంలోని ఇశైతో చేరుతుంది. యజుర్వేదం, అథర్వవేదం- యాగం, హోమం, శాంతి, అభిచారం మొదలైన కర్మలను అనుష్ఠించే విధాలను తెలుపుతుంది. లౌకికవ్యాపారాలలో మాత్రం నాటకమనే ప్రసిద్ధి అయినా, సాధారణంగా వ్యాపారాలు అన్నీ తెలుప బడతాయి. అందువల్ల, నాటకమనే దానికి యజుర్వేదాదులకు ఒక విధంగా సంబంధం ఉన్నది. ఇవి అన్నీ ఇక్కడ పాశురంలోని మొదటి పాదంలో తెలుపబడ్డాయి. ఉభయభాషలలోను, వాటిలో రచింపబడిన ప్రమాణగ్రంథాలలోను, వాటి ప్రతిపాద్యార్థమైన హితాలలోను భగవద్రామానుజులచే తెలియబడనిది- ఏదీ లేదు. జ్ఞానానికి తగినట్లు అనుష్ఠానం, శీలం, వైరాగ్యం, కారుణ్యం మొదలైన కల్యాణగుణాలు కూడా నిండినవారు. దీనిని చక్కగా తెలిసికొని సత్పురుషులు విశాలభూమిలోని జనులు బాగా పొగడుతున్నారు "నల్లానెన్ఱ కాలమేకమ్ నడునాట్టిల్ వర్షిత్తదే" (నల్లాన్- అనే కాలమేఘం మధ్యదేశంలో వర్షించిందే) అని యతిరాజులు పొగడే రీతిలో ఉన్నవారినికూడా గ్రహించవచ్చు. ఈ విధంగా ఉన్నా, దీనిని కొందఱు అభ్యసించలేదంటే వారికి ఏమి ప్రయోజనం? తద్విషయంలో కోరిక వారికి కల్గుతుందా? ఏది యథార్థమైన పురుషార్థమో, దానిని కోరడంలేదు. వేఱు అల్పానందాలలో



పడి పరిభ్రమిస్తున్నారు. లేక, జీవబ్రహ్మైక్యం వంటి అప్రామాణికమైన పురుషార్థాన్ని కల్పించి, దానిని కామిస్తారు. వైకుంఠనాథుని అనుభవ కైంకర్యాల గొప్పతనాన్ని తెలియనివారుకదా వారు- అని భావం. "ఏతు పేఱెన్ఱు కామిప్పరే?" అనే ప్రయోగానికి, పురుషార్థం ఏది? అని అడిగి వింటారు - అని కొందఱు వ్యాఖ్యానించారు. "కామిప్పర్" అనే అర్థానికి తగినట్లు, "ఎన్ఱు?" అనేదానికి "ఎపుడు?" అనే అర్థం తెలుపబడింది. భగద్రామానుజుల జ్ఞానశీలాదులను చక్కగా గ్రహించి ఆ తిరునామాన్ని నమ్మేవారి చివరగా పొందిన ఫలమేది? అంటే, మోక్షపురుషార్థమని తెలుస్తుంది. దానికి మించినది ఉన్నది - అనే అర్థాన్ని తరువాత పాశురంలో తెల్పుతున్నారు.

**45.** అవ :- పరమపదాన్ని చేరిన తరువాత భగవద్రామానుజుల కైంకర్యం చేస్తున్నారా? భగవానుని కైంకర్యమా? అనే చర్చ ఎందుకు? ఇక్కడ మనం పొందవలసిన ప్రాప్యం భగవద్భాగవతాచార్య కైంకర్యాలలో ఆచార్య కైంకర్యమని దానికి ఆధిక్యం ప్రామాణికం. అది గుణాతిశయం వల్ల భగవద్రామానుజులలో పర్యవసిస్తున్నది - అని తెల్పుతున్నారు. భగవద్రామానుజులను సేవించే సత్పురుషులవరకు నాకు కల్గిన కృతజ్ఞతనుబట్టే ఆ తిరునామానికి గల గొప్పతనాన్ని విశాలమైన భూమిలోని వారు నమ్మవచ్చు- అని అంటున్నారు.

పేఱొన్ఱు మఱ్ఱిల్లై నిన్ శరణన్ఱి, అప్పేఱళిత్తఱ్కు
ఆఱొన్ఱు మిల్లై మఱ్ఱ చ్చరణన్ఱి, ఎన్ఱిప్పొరుళై
త్తేఱుమ వర్క్కు మెనక్కు మునై త్తన్ద శెమ్మైశొల్లాల్
కూఱుమ్ పరమన్ఱు, ఇరామానుశ! మెయ్మ్మై కూఱిడిలే.

ఇరామానుశా = శ్రీరామానుజా!, పేఱు = పురుషార్థం, నిన్ శరణ్ అన్ఱి = మీ శ్రీచరణాలు తప్ప మఱి ఏమీ లేదు, అ పేఱు = ఆ పురుషార్థాన్ని, అళిత్తఱ్కు = ఇవ్వడానికి, ఆఱు = ఉపాయంకూడా,

అ శరణ్ అన్ఱి = ఆ శ్రీచరణాలు తప్ప, వేరేమీ లేదు, ఎన్ఱు = అనే రీతిలోని, ఇ పొరుళై = ఈ వాస్తవాన్ని, తేఱుమవర్క్కు ఉమ్= ఈ విధంగా తెలియలేని నాకుకూడా, ఉనై = మీరు మిమ్ములను, తన్ద శెమ్మై = అనుగ్రహించడమనే ఆర్జవగుణం, మెయ్మ్మై = వాస్తవంగా, కూఱిడ = చెప్పబడినట్లయితే, శొల్లాల్ కూఱుమ్ పరమ్ అన్ఱు = అది పలుకడానికి సాధ్యం కానిది.

మీ శ్రీచరణమే ఉపాయం, ఉపేయం కావడం తగినది. **"అనుకల్పభూత మురభిత్పదం సతాం .... శరణం యతీంద్రచరణం వృణీమహే"** (మురారి పదాలు రెండవ పక్షం అనేరీతిలో ఉండేవి, సత్పురుషులకు రక్షకమైనవి అయిన యతీంద్రుల చరణాలను ఆశ్రయిస్తున్నాము) అని అన్నారు యతిరాజసప్తతిలో దీనిని తెలిసినవారు ఎంతటి ఫలాన్ని పొందారో నేను కూడా అంతటి ఫలాన్ని పొందాను- అని అంటున్నారు. యతిరాజులపట్ల అద్వేషం ఉన్నా చాలు, అది వారి గుణాల తత్త్వాన్ని తెలుపుతుంది. మంచిని పొందిస్తుంది. దానిని గొప్పతనం అనంతం.

**46.** అవ :- "ఎనక్కు మునై త్తన్ద శెమ్మై" (నాకు కూడా మీరు అనుగ్రహించిన ఆర్జవ గుణం) అని అంటున్నారే. అయితే మీరు పొందినది ఏది? మిమ్ములను మీరు తక్కువగా పల్కడం ఎందుకు?'' అని అంటే, వివరిస్తున్నారు.

**కూఱుమ్ శమయంగళ్ ఆఱుమ్ కులైయ, కువలయత్తే**
**మాఱన్ పణిత్త మఱై యుణర్న్దోనై, మతియిలియేన్**
**తేఱుమ్పడి ఎన్ మనమ్ పుకున్దానై త్తిశైయనైత్తుమ్**
**ఏఱుమ్ కుణనై, ఇరామానుశనై ఇఱైంజినమే.**

కువలయత్తు ఏ = భూమండలంలో అంతటా, కూఱుమ్ = వేదాంతాన్ని తెలియనివారిచే చెప్పబడే, శమయఙ్గళ్ ఆఱు ఉమ్ = ఆఱుమతాలు, కులైయ = నశించినపుడు, మాఱన్ పణిత్త = నమ్మాళ్వార్లు అనుగ్రహించిన, మఱై = వేదమనే దివ్యప్రబంధాన్ని, ఉణర్న్దోనై = యథాతథంగా తెలిసినవార్నై, మతి యిలేన్ = బుద్ధి లేని లేను, తేఱుమ్పడి = దృఢమైన బుద్ధిని పొందేటట్లు, ఎన్ మనమ్ = నా మనస్సులో, పుకున్దానై = ప్రవేశించి నిలచి ఉండేవారు, దిశై అనైత్తుమ్ = అన్ని దిక్కులలోను, ఏఱు కుణనై = మిగిలినవారి కంటే గొప్పగా వ్యాపించే గుణాలను కలవారైన శ్రీరామానుజులను, ఇఱైఞ్జినమ్= ఆశ్రయించాము.

సాంఖ్యం, యోగం, తర్కం, బౌద్ధం, జైనం, పాశుపతం- అనే సిద్ధాంతాలను వేదవ్యాసులు బ్రహ్మసూత్రాలలో నిరాకరించారు. చార్వాకమతానికి తగినట్లు లోకంలో జనులు నడచుకొంటున్నా, పరిశీలించినపుడు దానిని అందఱు ఒక విధంగా విడచినవారే. అందువల్లనే బౌద్ధాదిమతాలు పుట్టాయి. ఆ ఆఱు మతాలను వివరించినపుడు వాటి వాసనవల్ల పుట్టిన పలు విధాలైన అద్వైతాదిమతాలు నిరాకరింపబడ్డాయి- అనే విషయాన్ని భగవద్రామానుజులు అంశాధికరణ- అహికుండలాధి కరణ సూత్రాలలో విస్తృతంగా నిరూపించారు. వాటిని అన్నిటినీ పరిశీలించి, తెలిసికోగల్గిన శక్తి లేని నేను ఏవో తెలిసిన కొన్ని నమ్మాళ్వార్ల పాశురాలను పురస్కరించుకొని మతాలను, వాటిని నిరాకరించే సామర్థ్యాన్ని కల్గించి శ్రీరామానుజులు తాము నా మనస్సులో వేంచేసిఉన్నారు. ఆఱు మతాలకు చెందినవారు కూడా ద్వేషం లేకపోతే నావలెనే తేటపడవచ్చు. దిక్కులన్నిటిలో వ్యాపించిన కల్యాణగుణాలను కల్గినవారు కావడంవల్ల వారుకూడా సంస్కరింపబడతారుఅని చెప్పవచ్చు. తిరువాయ్మొళిలోని మొదటి ముప్పై పాశురాలు, **"ఒన్ఱుమ్ తేవుమ్"** (4-10) ఇత్యాదులే చాలునే. అందువల్ల వీరి శ్రీచరణాలే ప్రాప్యప్రాపకాలని తెలిసికొన్నాను. **"కువలయత్తే"** కు=భూమి, వలయమ్ =మండలమ్. అందులో - (భూమండలంలో) అని అర్థం.

**47.** అవ :- "శ్రీరామానుజుల శ్రీచరణాలే ఉపాయం, ఉపేయం- అని

అంటున్నారే. తిరువాయ్‌మొళి మొదలైన వానిద్వారా భగవద్రామానుజులు, ఉపదేశించడం కూడా అదేనా మఱి!" అని అంటే, వారి ఉపదేశం మాత్రం. "**శ్రియఃపతియే ధర్మం**" అనియే. ఆ జ్ఞానానికి వీరి శ్రీచరణమే ఉపాయం. అంతేకాక, నేను నా కోసం ప్రపత్తిని అనుష్ఠించనక్కరలేని రీతిలో తామే నా విషయంలో కూడా శ్రీరంగనాథుని ధర్మంగా చేసికొన్నందువల్ల, వారే నా కర్మలను తీర్చినవారయ్యారు. అందువల్ల "**నిపుణరుక్కు భరసమర్పణముమ్ ఆచార్యకృత్యమ్**" అనే రీతిలోనిది కనుక, నాకు ఎవరు సాటి లేరు- అని ఇందులో అముదనార్ బదులిస్తున్నారు.

**ఇఱైఞ్జప్పడుమ్ పరనీశన్ అరంగ నెన్ఱు, ఇవ్వులక**
**త్తఱమ్ శెప్పుమ్ అణ్ణలి రామానుశన్, ఎన్నరువినైయిన్**
**తిఱమ్ శెఱ్ఱిరవుమ్ పకలుమ్ విడాతు ఎన్ఱన్ శిందైయుళ్ళే**
**నిఱైన్దొప్పఱ ఇరుందాన్, ఎనక్కారుమ్ నికరిల్లైయే.**

ఈశన్ = సంకల్పశక్తిని కలవాడైన, అరఙ్గన్ = శ్రీరంగనాథుడే, ఇఱైఞ్జప్పడుమ్ = ఆశ్రయింపబడే, పరన్ = పరదేవతయై ఉన్నాడు, ఎన్ఱు = అనేవిధంగా, ఇ ఉలకత్తు = సాధ్యోపాయమైన అచేతనాన్ని, దేవతాంతరాలను ఉపాయంగా తలచే లోకంలో, అఱమ్ = వాస్తవమైన సిద్ధోపాయాన్ని, శెప్పుమ్ = ఉపదేశించినవారు, అణ్ణల్ = స్వామి అయిన, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, ఎన్ అరు వినైయిన్ తిఱమ్ = నా క్రూరపాపాల శక్తిని, శెఱ్ఱు = నశింపజేసి, ఆచార్యభక్తికి అడ్డుగా ఉండే పాపాన్ని కూడా పోగొట్టి, ఇరవు ఉమ్ పకల్ ఉమ్ = రాత్రి పగలు, ఎన్ శిన్దై ఉళ్ళే నిఱైన్దు = నా మనస్సులో నిండి ఉండి, ఒప్పు అఱ = శ్రీరంగనాథునికంటే మిన్నగా, నిస్సమంగా, ఇరున్దాన్ = నిలచి ఉన్నారు, ఎనక్కు = ఈవిధంగా పరమోపాయోపేయాన్ని పొందిన నాకు, ఆరుమ్ నికరిల్లై (ఎన్బదు తిణ్ణమ్) = ఎవరు సాటిలేదు అనేది నిశ్చయం.

భక్తి, ప్రపత్తి, యాగం, హోమం మొదలైన ఉపాయాలు శాస్త్రాలు



విధించిన రీతిలో సాధించబడవలసినవే అయినా, అవి సాధనాలు కావు. చేసిన యాగాదులు ఆ క్షణంలోనే నశించి పోతాయి. కనుక, ఫలాన్ని పొందే సమయంలో అవి లేనందువల్ల అవి సాక్షాదుపాయాలు కావు. అదృష్టం, అపూర్వం, పుణ్యం- అనే రీతిలో ఒక ధర్మాన్ని అంగీకరించినా, చేతనసంకల్పం లేకుండా కార్యం జరుగదు. ఈ విధంగా ఈశ్వరుడు కావాలి - అని ఏర్పడిన తరువాత ఇక దేనికోసం అపూర్వం? ఇతర దేవతలుకూడా చేతనులైనా, ఫలాన్ని ఇవ్వడానికి తగిన ఆయుస్సు, శక్తి లేనివారే - అని ఈ రీతిలో ఉపదేశించి, "**కృష్ణం ధర్మం సనాతనమ్**" (శ్రీకృష్ణుడు సనాతనధర్మం) ఇత్యాదులను గొని శ్రీరంగనాథుడే ఉపాయం అని ఉపదేశించారు- అని భావం. "**ఎనక్కారుమ్ నికరిల్లై**" అనేదానికి పై పాశురం రీతిలో నీచతలో నాకు సాటి ఎవరూ లేరు - అని భావం.

**48.** అవ :- "పాపులవద్దకు చేరడం పరుడైన భగవానునకు కళంకం కాగలదు." అని వీరు తొలగిపోవడాన్నిగూర్చి పూర్వం తెల్పిన అముదనార్ "మనలను శ్రీరామానుజులు విడుస్తారా! చూడాలి. విడిచినట్లయితే వేఱొక చోటికి వెడదాం" అని దీని పరీక్షలో భగవద్రామానుజులు దిగుతారేమో!- అని భయపడి, "**తదహం త్వదృతే న నాథవాన్ మదృతే త్వం దయనీయ వాన్ న చ**" (నీవు తప్ప నాకు ఇంకొకనాథుడు లేడు, నేను తప్ప దయనీయుడు నీకింకొకడు లేడు) అనే రీతిలో ఈ అవకాశాన్ని ఇద్దరు విడువకూడదని భగవద్రామానుజులవద్దనే విన్నపిస్తున్నారు.

**నికరిన్ఱి నిన్ఱ ఎన్నీశతైక్కు, నిన్నరుళిన్‌కణన్ఱి**
**పుకలొన్ఱు మిల్లై యరుట్కుమవతే పుకల్, పున్మైయిలోర్**
**పకరుమ్ పెరుమై యిరామానుశ! ఇని నామ్ పళుతే**
**అకలుమ్ పొరుళెన్?, పయన్ ఇరువోముక్కుమాన పిన్నే.**

పున్మైయిలోర్ = నీచత్వాన్ని లేనివారిచే, పకరుమ్ పెరుమై =

ప్రశంసింపబడే గొప్పతనాన్ని కల, ఇరామానుశ =శ్రీరామానుజా !, నికర్ ఇన్ఱి = సాటి లేని, నిన్ఱ ఎన్ నీశతైక్కు = ఉండే నా నీచస్వభావానికి, నిన్ అరుళిన్ కణ్ = నీ దయ వద్ద, అన్ఱి పుకల్ = కాకుండా, వేఱు శరణం ఏమీలేదు, అరుట్కు ఉమ్ = మీ దయకు కూడా, అంఃతే = ఆ నీచత్వమే, పుకల్ = వినయంగా నిలచి ఉండేచోటు, ఇని = వాస్తవం ఈ విధమైనది అయిన తరువాత, ఇరువోముక్కు = మనకు ఇద్దఱికి, పయనుమ్ ఆన పిన్బు = ఫలం కల్గుతూ ఉండగా, పఴుతే = వ్యర్థంగా, అకలుమ్ పొరుళ్ = మేము దూరంగా వెళ్ళడం అనేది, ఎన్ = ఏమి ఇందులో సందేహం?

"ఎన్ నీశతైక్కు" ఇత్యాది. నా ఆత్మస్వరూపం సహజంగా శుద్ధమైనది - అని ఇపుడు నేను తెలిసికొన్నందువల్ల, శుద్ధమై చేరడం తగును- అని భావించవద్దు. ఈ ప్రాకృత ఆభాస, దేహేంద్రియాలతో కూడి ఉన్నపుడే చేరికను కోరాను. ఎందుకు? అంటే, ఇద్దరికి ప్రయోజనం ఉన్నదని తెలిసినందువల్ల ఇద్దరి మధ్య ఒక విధమైన పోలిక ఉన్నది. మీ గొప్పతనానికి, నీచతకు సాటి లేకపోవడం అనేది సాటిగా ఉన్నదని భావం. **"అహమస్మ్యపరాధచక్రవర్తీ కరుణే! త్వం చ గుణేషు సార్వభౌమీ"** (నేను అపరాధం చేసినవారిలో చక్రవర్తిని. కరుణాదేవీ! నీవు గుణాలలో సార్వ భౌమురాలవు) అనే సూక్తి శ్రీదేశిక స్మరణీయం.

**49.** అవ :- **"పున్మైయిలోర్ పకరుమ్ పెరుమై"** (నీచత్వం లేనివారు కీర్తించే గొప్పతనం) ఎటువంటిది? అని అంటే, భగవద్రామానుజులు ఉపదేశించడం ఆరంభించిన తరువాత ఇష్టప్రాప్తి, అనిష్టనివృత్తి -అనేది లేదు. వారు అవతరించిననాటినుండే అవి ఏర్పడ్డాయి. (వారి) అవతారానికి ముందు అంతటి పరిమితిలో లేదు- అని అంటున్నారు.

**ఆనతు శెమ్మై యఱనెఱి పొయ్మ్మై, అఱు శమయమ్**
**పోనతు పొన్ఱి యిఱన్దదు వెఙ్గలి, పూమ్ కమల**
**త్తేనతిపాయ్ వయల్ తెన్నరంగన్కళల్ శెన్ని వైత్తు**
**త్తానతిల్ మన్నుమ్, ఇరామానుశన్ ఇత్తలత్తుతిత్తే.**

పూ కమలమ్ = పూచిన తామరలలోని, తేన్నది = తేనె ప్రవాహం, పాయ్ పయల్ = మిక్కిలిగా ప్రవహించేచోటు అయిన పొలాలను కల, తెన్ అరఙ్గన్ = అందమైన శ్రీరంగనాథుని, కళల్ = శ్రీచరణాలను, శెన్ని వైత్తు = శిరస్సుపై పెట్టుకొని, తాన్ అదిల్ మన్నుమ్ = ఆ శ్రీచరణాలలో అభినివేశాన్ని పొందే, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, ఇ తలత్తు = ఈ దక్షిణభూమిలో, ఉదిత్తే = అవతరించినప్పటినుండి, అఱమ్ నెఱి = ధర్మమార్గం, శెమ్మై ఆనదు = ఋజువు అయినది, పొయ్మ్మై = వాస్తవానికి విరుద్ధమైన, అఱు శమయమ్ = ఆఱుమతాలు, పొన్ఱి పోనదు = నశించనవి నశించినవే, వెమ్ కలి = క్రూరకలి, ఇఱన్దదు = నశించింది.

శ్రీరామానుజులు శ్రీరంగానికి వేంచేసిన తరువాత సంభవించే హితాలు అటు ఉండనివ్వండి. వారు ఉపదేశించిన తరువాత జరిగిన హితాలు ఉండనివ్వండి. అగస్త్యమహర్షి మొదలైనవారి ఆవిర్భావకాలంలో వలె శ్రీరామానుజుల ఉదయంలోనే లోకానికి ఒక అద్వితీయమైన ఉత్కర్షం ఏర్పడింది. యాదవప్రకాశకులతో గంగాతీర్థ స్నానానికి యాత్రగా బయలుదేరినవారు మధ్య దారిలో విరోధుల పన్నాగంనుండి తప్పుకొన్నపుడు వరదరాజస్వామిచే కంచికి తీసుకొనిరాబడ్డారు. ప్రతిదినం తీర్థవిశేషాన్ని వీరి శ్రీహస్తాలద్వారా ఆనందంగా వరదుడు పరిగ్రహించిన దానినిబట్టి, "వీరే తీర్థశ్రేష్ఠులు, వీరి సిద్ధాంతమే యథార్థం అయిన సిద్ధాంతం"- అని తెలిసికొని విరోధులు కూడా తమ మతంలోని తప్పును గ్రహించారు. తమ మతాలలో నమ్మికను కోల్పోయారు కూడా. **"శాలక్కిణఱు"** గంగకు మించిన తీర్థం అయినది. ఇటువంటి ఐతిహ్యం ఇక్కడ అనుసంధేయం. "ఉదిత్తే" అనే ప్రయోగంవల్ల, ఉదయించిన తరువాత, దానికి ముందు లేదనే భావం తోస్తుంది. అపుడు అవతారానికి

ముందు పలువురివల్ల ఏర్పడిన ఋజుత్వం మొదలైనవి ఇంతటి గొప్పగా లేవు - అని సారం.

**50.** అవ :- పూర్వం తెల్పినవి అన్నీ సంభవించడం- శ్రీరామానుజులు ఒక్కొక్కరి మనస్సులో ప్రవేశించి నిలువగా, వారి మనస్సులు సంస్కరింప బడినందువల్ల - అని వివరంగా పల్కుతూ తమ కవిత్వానికి గల వైలక్షణ్యమే దీనికి ఉదాహరణమని సూచిస్తున్నారు.

**ఉతిప్పన ఉత్తమర్ శిందైయుళ్, ఒన్నలర్ నెంజమంజి**
**క్కొతిత్తిడ మాఱి నడప్పన, కొళ్ళైవన్ కుఱ్ఱ మెల్లామ్**
**పతిత్త ఎన్పున్కవి పావినమ్ పూండన పావుతొల్శీర్**
**ఎతిత్తలైనాతన్, ఇరామానుశన్ తన్ ఇణైయడియే.**

పరవు = అంతటా వ్యాపించిన, తొల్ శీర్ = కృతయుగ గుణాలను కల, ఎతి త్తలై నాదన్ = యతిరాజులైన, ఇరామానుశన్ తన్ = శ్రీరామానుజుల, ఇణై అడి = శ్రీచరణాలు రెండు, ఉత్తమర్ శిన్దైయుళ్= శ్రేష్ఠుల మనస్సులో, ఉదిప్పన = ఉదయించిన రీతిలో ఉన్నాయి, ఒన్నలర్= విరోధుల, నెఞ్జమ్ = మనస్సు అంతా, అఞ్జి కొదిత్తిడ = భయాగ్నిలో దగ్ధమయేటట్లు, మాఱి నడప్పన = పరాక్రమక్రమాన్ని చేసేవి అయినవి, కొళ్ళై = కొళ్ళ కొళ్ళగా, చాలా అధికంగా, వల్ కుఱ్ఱమ్ ఎల్లామ్ = క్రూరదోషాలన్నీ, పదిత్త = నిలచి ఉండే చోటైన, ఎన్ పుల్ కవి = నీచుడనైన నా అల్పవాక్కులను కూడా గొప్ప, పా ఇనమ్ = పాశురాలతో సమంగా, పూణ్డన = గ్రహించాయి.

**ఎతిత్తలైనాదన్** - **"ఎతిత్తలై"** అంటే యామునేయాది శ్రీవైష్ణవ సన్న్యాసులు. వారికి నాథులు - యతిసార్వభౌములు శ్రీరామానుజులు- అని భావం. లేక, శ్రీభాష్యకారులను ఆశ్రయించిన అసంఖ్యాకులైన యతులు వారితో కూడా కలసి యాత్ర చేశారు అనే విషయం ఇక్కడ తెలుపబడిందని అనవచ్చు.



**"మాఱి నడప్పన"** - ప్రశాంతగమనానికి విరుద్ధమైన పరాక్రమ గమనాన్ని చేశాయి. **"పతిత్త"** అనేది **"ఎన్"** అనే దానికే విశేషణంగా చేయవచ్చు. భగవానుని శ్రీచరణాలకు మించిన ప్రభావాన్ని కల్గినవి శ్రీరామానుజుల శ్రీచరణాలు. ఉత్తములను రక్షించి, విరోధులున్న చోటకూడా ఉచ్చతను కల్గించి, మతస్థాపనాన్ని చేశాయి. సాధురక్షణం కోసం అసాధుశిక్షణం అందువల్ల భగవానునిగూర్చి పలికే దివ్యప్రబంధాల సమూహంలో చేరిన నా వాక్కులు వాటినికూడా మించి గౌరవింపబడినా, దాసానుదాసులవలె ఒక విధమైన వైలక్షణ్యం ఒక విధంగా లోపల అణగి ప్రకాశించడాన్నికూడా పొందాయి. శ్రీరామానుజులు ప్రశంసించే దివ్యప్రబంధాలు కనుక వాటికి వీనికంటే గొప్పతనమున్నది. దాసుల దృష్టిని బట్టి ఇదే ఉత్తమమైన ఉపనిషత్తు. గొప్ప వేదశిరస్సు. ఉత్తమమైన వేదశీర్షం. **"రామానుజ"** అనే నామమంత్రం **108** పర్యాయాలు జపించే టట్లు ప్రపన్నగాయత్రిగా ఒక ప్రబంధం ఇయఱ్పా చివరలో చేర్చబడాలి - అనే తిరువరఙ్గత్తముదనార్ ఈ నూత్తన్దాదిని రచించడంకోసం నియమింపబడ్డారు. ఆ భావం ఇక్కడ సూచింపబడింది. **"ఇణైయడి"** అనే పదం పాశురం చివరలో ఉండడంవల్ల ముందు గల ధాతుపల్లవాలలో వలె (విన్నైముత్తు) **"పూణ్డన"** అనేచోటకూడా ఇదే కర్తగా కావడం తగును. అందువల్ల **"ఎన్పున్ కవికళ్ పావినత్తై ప్పూణ్డన"** అనే అర్థాన్ని గ్రహించక పోయినా ఆ అర్థం తానుగానే స్ఫురిస్తుంది. ఈ అర్థం వ్యక్తం అయేటట్లు పాశురం కూర్పబడినందువల్ల కవిత్వలక్షణం పూర్ణమైనది. పైపాశురంలో **(51)** కూడా ఇదే రీతి.

**51.** అవ :- తమకు భగవద్రామానుజులు చేసిన కృపను చూచినపుడు, ఇది వారి అవతారానికి ముఖ్యఫలంగా తోస్తున్నది- అని అంటున్నారు.

**అడియై త్తొడర్న్దెళుమ్ ఐవర్కట్కా, అన్రు పారతప్పోర్**
**ముడియ ప్పరినెడుమ్ తేర్విడుమ్ కోనై, ముళుతుణర్న్ద**

అడియర్క్కముతమ్ ఇరామానుశన్ ఎన్నై యాళవన్ది
ప్పడియిల్ పిఱందతు, మట్రిల్లై కారణమ్ పార్త్తిడిలే.

అన్రు = కృష్ణావతార సమయంలో, అడియై= తన శ్రీచరణాలను, తొడర్న్దు = ఆశ్రయించి నుసరించియే, ఎళుమ్ = వృద్ధిని పొందిన, ఐవర్కట్కు ఆయ్ = పంచపాండవుల కోసంగా శ్రమించేవాడై, పారతమ్ పోర్ = భారతులు చేసిన యుద్ధం, ముడియ = ముగిసేవరకు, నెడు పరి తేరై = గొప్ప అశ్వాలను కట్టిన గొప్ప రథాన్ని, విడుమ్ కోనై = నడపిన సర్వస్వామిని, ముళుదు ఉణర్న్ద = పరత్వ సౌలభ్యాదులతో తెలిసిన, అడియర్క్కు = భాగవతులకు, అముదమ్ = భోగ్యమైన, శ్రీకృష్ణుడైన, ఇరామానుశన్ = శ్రీరామానుజులనే తిరునామాన్ని కల మహనీయులు, ఎన్నై ఆళ = నీచుడనైన నన్ను పాలించడంకోసం, ఇ పడియిల్ పిఱన్దదు = ఈ భూమిలోకి వచ్చి, అవతరించడాన్ని, పార్త్తిడిల్ = గమనించి చూస్తే, కారణమ్ మట్రు = వేఱు కారణం తెలియలేదు.

చాలా నీచుడనైన నన్ను అనుగ్రహించడంకోసమే భగవద్రామానుజుల అవతారం జరిగిందని తలుస్తున్నాను - అని భావం. ఇక, వేఱొక భావం ఏమంటే- తనను ఆశ్రయించినవారిని గొప్ప పదవిలో నిలుపడం భగవానుని స్వభావం. అందువల్లనే పంచపాండవులకోసం శ్రమపడి భారతసంగ్రామంలో నూఱుమంది కౌరవులు మరణించాలని, అయిదు గురు పాండవులు ఉజ్జీవించాలని భావించి ఆ యుద్ధం ముగిసేవరకు అర్జునుని రథంలో సారథియై, గుఱ్ఱాలను తోలే కొరడాను చేత ధరించిన నాయకుడయ్యాడు. అతనిని యథాతథంగా గ్రహించినవారు అందఱు తమకు అమృతస్వరూపుడైన ఆ శ్రీకృష్ణుడే మన భగవద్రామానుజులు- అని అంటారు. ఆ అమృతమే శ్రీరామానుజులుగా వచ్చి ఈ భూమిలో అవతరించినందువల్ల అదే రీతిలో ఆశ్రితుడనైన నన్ను ఈ కైంకర్యం చేసే పర్యంతానికి దాసునిగా చేసి ఈ దాస్యమనే గొప్ప పదవిలో నిలిపిన వాడయ్యాడు. అక్కడ అయిదుగురికివలె ఇక్కడ నాకు ఉన్నతమైన స్థితి కల్గడానికి కారణం ఆ శ్రీకృష్ణుడు భగవద్రామానుజులుగా అవతరించడమే. అందువల్ల, ఈ అమృతమే శ్రీరామానుజులై ఈ భూమిలో జన్మించడం తప్ప, వేఱు కారణం నన్ను దాసునిగా చేయడానికి తగినది ఏదీ లేదు- అని భావం. ఇక, వేఱే విధంగా కూడా అర్థాన్ని చెప్పవచ్చు. ఈ భూమిలో శ్రీరామానుజులు జన్మించడం - కూరేశుల శ్రీచరణాలలో ఆశ్రయించి, ఈ విధంగా నేను జ్ఞానజన్మను పొందడంకోసం తప్ప, శ్రీరామానుజులు నన్ను ఈవిధంగా దాసునిగా చేయడంలో వేఱు కారణం ఏమీ లేదు- అని భావం. జన్మ అంటే జ్ఞానజన్మ. ఇక, **"అముద"**మనే పదం **"ఎన్నైయాళ"** అనే పదానితో అన్వయించవచ్చు. శ్రీరామానుజులు శ్రీకృష్ణుని అనుభవించే దాసులు (భక్తులు) అందఱు అమృతంగా నన్ను పాలించడానికి అందఱు నాకు **"అముదనార్"**- అనే బిరుదాన్ని ఇచ్చి అభిమానించడానికి వేఱేమి కారణం ఉన్నది? వారి జన్మయొక్క స్వభావమే కారణం. అందువల్లనే నాకు ఈ జ్ఞానజన్మ కల్గింది. నూత్తన్దాదిని రచించే అవధికి అనుగ్రహించ డాన్ని మనస్సులో భావించి ఈ పాశురం రచింపబడిందని భావం.

**52.** అవ :- యోగ్యత లేని తమకు శ్రీరామానుజులు కల్గించిన క్షేమాలలో శ్రీరంగనాథుని శ్రీచరణాలలో చేర్చి, స్థిరమైన కైంకర్యంలో కొనసాగేటట్లు చేయడంకూడా ఒకటి - అని ఇందులో అంటున్నారు.

పార్త్తాన్ అఱుశమయంగళ్ పతైప్ప, ఇప్పార్ ముళుతుమ్
పోర్త్తాన్ పుకళ్ కొండు పున్మైయినేనిడైత్తాన్ పుకుందు,
తీర్త్తా నిరువినైతీర్త్తు అరంగన్ శెయ్య తాళిణైయోడు
ఆర్త్తాన్, ఇవై ఎమ్మిరామానుశన్ శెయ్యు మఱ్పుతమే.

ఆఱు శమయఙ్గళ్ = ఆఱు మతాలు, పదైప్ప = అలమటించేటట్లు, పార్త్తాన్ = నేత్రాలతో కటాక్షించారు, ఇ పార్ ముళుదుమ్ = ఈ భూమండలాన్నే, పుకళ్ కొణ్డు = తమ కీర్తితో, పోర్త్తాన్ = వ్యాపించారు,

ఇంతటి గొప్పతనాన్ని కల్గి ఉన్నందువల్లనే, పున్మైయినేన్ ఇడై = అల్పత్వాన్ని కల్గిన నావద్ద, తాన్ పుకున్దు = తామే ప్రవేశించి, ఇరు విনై తీర్త్తాన్ = సంచితాలైన పుణ్యాపాపాలు లేనివారినిగా చేశారు, (లేక), భగవద్భాగవతకైంకర్యం విరోధులైన రెండు విధాలైన పాపాలను లేనివారినిగా చేశారు, తీర్త్తు = ఈ విధంగా యోగత్యతను కల్గించి, అరజ్గన్ = శ్రీరంగనాథుని, శెయ్య తాళ్ = అందమైన శ్రీచరణాలు, ఇణైయోడు =రెండిటితో, ఆర్త్తాన్ = కలిపాడు, ఇరామానుశన్ శెయ్యుమ్ అఱ్పుతజ్గళ్ ఇవైయామ్=శ్రీరామానుజులు చేసే అద్భుతాలు ఇవి అన్నీ.

**"ఇరు వినై"** - అనేదానికి రెండు విధాలుగా అర్థాన్ని చెప్పవచ్చు. ఆఱు సిద్ధాంతాలను నిరసించే అవధిలోని కటాక్షం లేకపోతే నేను సంస్కరింప బడను. వీరి కీర్తి అంతటా వ్యాపించినందువల్ల కనుక నన్ను సంస్కరించడం కూడ న్యాయమనే లోకం భావించింది. ఇక, కీర్తి, అంటే, **"యశోఽహం భవామి బ్రాహ్మణానామ్"** అనే రీతిలో అందఱు కీర్తించే పరబ్రహ్మమే. విష్ణువుయొక్క జ్ఞానమే లోకంలో వ్యాపించేటట్లు చేశారని తెలిపినట్లయింది. ఆచార్యకైంకర్యంతో పాటు శ్రీరంగని కైంకర్యంకూడా నేరుగా పొందాను. వీరిని ఆశ్రయించడానికి ముందు చేసిన కైంకర్యం కైంకర్యం కాకుండా ఏదో అధికారమదమైనది. ఇపుడు మాఱి, పరమపదనాథుని కైంకర్యానికి సాటి అయినది - అని భావం.

**53.** అవ :- గత పాశురంలోని **"పోర్తాన్ పుకళ్ కొణ్డు"** అనే సూక్తిని ఒక విధంగా వివరిస్తూ పల్కుతున్నారు.

**అఱ్పుతమ్ శెమ్మై యిరామానుశన్, ఎన్నై యాళవన్ద**
**కఱ్పకమ్ కట్రవర్ కాముఱు శీలన్, కరుతరియ**
**పఱ్పల్లుయిర్కళుమ్ పల్లులకి యావుమ్ పరనతెన్నుమ్**
**నఱ్పొరుళ్తన్నై, ఇన్నానిలత్తే వన్దు నాట్టిననే.**

అఱ్పుదన్ = ఇతరాచార్యవిలక్షణులై, శెమ్మై = మనోవాక్కాయ



కర్మలలో ఏక రూపులై, ఎన్నై ఆళ = నన్ను దాసునిగా చేసికోవడం కోసం, వన్దకఱ్పకమ్ = జంగమమైన కల్పవృక్షమై, కట్రవర్ = అభ్యసించినవారిచే, కాముఱు శీలన్ = అభిలషింపబడ్డ గుణాలను కలవారైన, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, వన్దు = అవతరించి, కరుత అరియ = ఏమతంవారిచే అయినా, నిర్ణయించడానికి సాధ్యం కాని, పల్ పల్ ఉయిర్కళ్ ఉమ్ = అంతర్విభాగాలు అనేకం కల బద్ధముక్త- నిత్యచేతనులు, పల్ ఉలకు యావుమ్ = ప్రాకృత-అప్రాకృత సమస్తాచేతనాలు, పరనదు = పురుషోత్తమునివి, ఎన్నుమ్ = అనబడే, నల్ పొరుళ్ తన్నై = ప్రామాణికమైన తత్త్వాన్ని, ఇ నాల్ నిలత్తే = జనులుండే నాల్గు విభాగాలు కల భూమి అంతటా, నాట్టినన్ = స్థాపించారు.

**"కరుతరియ"** అనే పదం **"పొరుళ్"**కు విశేషణంగా కావచ్చు; (లేక) **"ఉయిర్కళుక్కు"** కూడా కావచ్చు, (లేక) **"ఉలకుక్కు"** కూడా కావచ్చు. ఆప్తతముడే ఆచార్యుడు కాగలడు. ఆప్తతముడైనవాడు మనోవాక్కాయాలు శుద్ధమై, ఇతరులను వంచించడం మొదలైన దుర్గుణాలు లేకుండా, దీనులకు కావలసిన ఫలాలను కల్పకంవలె అనుగ్రహించే అవధికి దయను కలవాడై, ఉపదేశించే తత్త్వాలను యథాతథంగా సాక్షాత్తు దర్శించే స్పష్టమైన జ్ఞానాన్ని కలవాడై ఉంటాడు. ఈ గుణాలు భగవద్రామానుజులవద్ద ఉన్నట్లుగా వేఱు ఎవరిలోను లేనందువల్ల వీరు ఆశ్చర్యకరమైనవారు. కొందఱు అచేతనాలనే చేతనులుగా భావిస్తూ ఉండగా, అవి వేఱు అని తెలియడమే అరుదు. చేతనులను అంగీకరించినా బద్ధముక్తవిభాగాన్ని తెలియరు. అచేతనాలను తెలియలేరు. పదునాల్గు లోకాలు ఉన్నాయి; సమష్టులు ఉన్నాయి; అప్రాకృతలోకాలున్నాయి- అని తెలియలేరు. వాటిని అన్నిటిని అంగీకరించినా, ఈశ్వరుని అంగీకరించనివారుకూడా ఉన్నారు. ఆ విధంగా లేకుండా పరాత్పరుడొక డున్నాడు- అని స్థాపించినవారు, శ్రీరామానుజులు. కొందఱు ఈశ్వరుని అంగీకరించినా, వాస్తవానికి ఎవడు పరుడో, అతనిని అంగీకరించకుండా,

అపరచేతనుని ఒకనిని పరవస్తువుగా భావించి, లోకం అతని సొత్తు - అని అంటారు ఇన్ని మతాలను, వాటిలో మొండివాదాన్ని చేసేవారి మతాలను పెళ్ళగించి, శ్రియఃపతికే అన్నీ అధీనం అనే వేదాంతమూలమైన అర్థాన్ని అంతటా ఉపదేశించి అది ఎల్లప్పుడు ప్రకాశించే రీతిని రామానుజులు అనుగ్ర హించారు. చేతనాచేతనాలకు నారాయణునకు గల శరీరాత్మ భావం మొదలైన సంబంధాలను ప్రమాణపురస్సరంగా వారు స్థాపించారు. అందువల్ల **"ఈశావాస్య"** మనే రీతిలో కీర్తి మూర్తీభవించిన భగవానునివలె వీరి కీర్తివల్ల కూడా లోకం అంతా వ్యాపింపబడింది- అని భావం. **"ఉలకు యావుమ్"** అనేటపుడు సంధిలో ఉకారం ఇకారమైనది. **"నానిలమ్"- ముల్లై, కుఱిఞ్జి, నెయ్తల్, మరుతమ్-** అనే రీతిలో నాల్గు విభాగాలను కల భూమి.

**54.** అవ :- నారాయణపారమ్యాన్ని వైదికంగా స్థాపించనపుడు ఆళ్వార్ల దివ్యసూక్తులకు కూడా ఆపద కల్గి, శ్రీరంగంలో ఆళ్వార్ల సమృద్ధికి ఆటంకం కల్గింది. భగవద్రామానుజుల ప్రయత్నంతో అన్నీ నూతనత్వాన్ని పొందాయి- అని ఇందులో అంటున్నారు.

**నాట్టియ నీశచ్చమయంగళ్ మాండన, నారణనై**
**క్కాట్టియ వేతమ్ కళిప్పుఱ్ఱతు, తెన్కురుకైవళ్ళల్**
**వాట్ట మిలా వండమిళ్మఱై వాళ్న్దతు మణ్ణులకిల్**
**ఈట్టియ శీలత్తు, ఇరామానుశన్ తన్ ఇయల్వు కండే.**

ఈట్టియ = అన్నీ కలిసి సమీకృతమైన, శీలత్తు = గుణాలను కల, ఇరామానుశన్ తన్ = శ్రీరామానుజుల, ఇయల్వు = జన్మనుండి గల గొప్పతనాన్ని, కణ్డే = చూడగానే, మణ్ ఉలకిల్ = ఈ భూమండలంలో, నాట్టియ= ఇతరులచే స్థాపించబడిన, నీశమ్ మతఙ్గళ్ = అద్వైతంవంటి ఆభాసమతాలు, మాణ్డన = నశించాయి, కారణనై = శ్రీమన్నారాయణుని, కాట్టియ = పరునిగా చక్కగా వివరించే, వేదమ్ =వేదాలు, కళిప్పు ఉఱ్ఱదు



=భయం తీరడంతో పాటు ఆనందాన్ని పొందాయి, తెన్ కురుకై = అందమైన కురుకాపురిలో ఉదయించిన, వళ్ళల్ = ఉదారులైన నమ్మాళ్వార్లు, వాట్టమ్ ఇల్లా = ఎవరిచేత తిరస్కరింపబడరాని, వణ్ తమిళ్ మఱై = విలక్షణమైన ద్రావిడవేదం, వాళ్న్దదు= ఉజ్జీవనాన్ని పొందింది.

**"నీశచ్చమయఙ్గళ్"** - **"గాథా తాథాగతానాం గలతి.... తదపి గురుమతం గౌరవాత్ దూరవాంతమ్"** (బుద్ధుని వార్త తొలగిపోయింది... గురుమతం దూరంగా పోయింది) అనే రీతిలో ప్రబల మతాలే నశించిపోయినపుడు **"కా శంకా శంకరాదేః"** అనే రీతిలో వాటికంటేకూడా తక్కువ అయినమతాలు నశించాయి. వేదం అంతా భయం తీరి, ఆనందాన్ని పొందింది. **"బిభేత్యల్ప శ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి"** (అల్పశ్రుతుని చూచి వేదం- నన్ను ఇతడు మోసగిస్తాడు- అని భయపడుతుంది) అని భయపడిన వేదానికి భయం తీరడం మాత్రమే కాక, పరమానందంకూడా కల్గింది. **"ప్రసాధయతి యత్సూక్తిః స్వాధీన పతికాం శ్రుతిమ్"** (స్వాధీనపతిక అనే నాయిక వంటి శ్రుతిని రామానుజుల సూక్తి భూషిస్తున్నది.) అనేటట్లు పతితో శ్రుతిని చేర్చి, శ్రుతికి అనుగుణంగానే నారాయణుని గ్రహించాలి - అని నిరూపించారు కదా! **"వాళ్న్దతు"** - తత్త్వం వేదమూలంగా నిలచిన తరువాతకదా, తద్విషయమైన భక్తిపాశురాలు ప్రకాశాన్ని పొందుతాయి. **"ఇరామానుశన్ తన్ ఇయల్వు"** -సనకనందనాదులకు వలె జన్మనుండి వ్యక్తమైన పరత్వం వీరికికూడా ఉన్నది. ఇక, **"ఇయల్వుకణ్డే"** వీరు అన్యమతాలను పోగొట్టాలి- అనే దృష్టి లేకుండా తత్త్వోపదేశాన్ని చేసినా, వీరి కటాక్ష ఫలంవల్ల తత్త్వంలో నమ్మిక కల్గగా, **"పుంస్త్వే తత్త్వేన దృష్టే పునరపి న ఖలు ప్రాణితా స్థాణుతాదిః"** (పుంస్త్వం- పురుషుడని- స్పష్టంగా గ్రహించిన తరువాత స్థాణుత్వాది సందేహం కలుగదు.) అనే విధంగా తాముగానే అన్ని భ్రాంతులు పోయి, మంచి కల్గింది- అని భావం. **'మణ్ణులకిల్"** -భూలోకమైనందువల్ల పలు

మతాలు సులభంగా చోటు చేసికొన్నాయి. **"మణ్ణులకిల్ ఈట్టియ"** అనే అన్వయంకూడా కొందరు గ్రహిస్తారు.

**55.** అవ :- **"నారణనై క్కాట్టియ"**- వేదాన్ని సుప్రతిష్ఠితం చేసినందువల్ల శ్రీరంగానికి అపాయం తొలగింది. ద్రావిడవేదమైన తిరువాయ్‌మొళి కూడా చిగురించి విస్తరించింది- అని గడచిన పాశురంలో అన్నారు. వేదాలన్నిటివలె అందఱి ఆళ్వార్ల శ్రీసూక్తులు శ్రీరంగని సన్నిధిలో అనుసంధింపబడి, లోకం అంతా ఆ రీతిలోనే ప్రకాశాన్ని పొందాయి- శ్రీరామానుజులవారివల్ల - అనే భావనతో తరువాతి పాశురాన్ని అముదనార్ అనుగ్రహిస్తున్నారు.

**కండవర్ శింధై కవరుమ్, కడిపొళిల్ తెన్నరంగన్**
**తొండర్ కులావుమ్ ఇరామానుశనై, త్తొకై యిఱంద**
**పండరు వేదంగళ్ పార్మేల్ నిలవిడ ప్పార్‌త్తరుళుమ్**
**కొండలై మేవి త్తొళుమ్, కుడియా మెంగళ్ కోక్కుడియే.**

కణ్డవర్ = దర్శనం చేసేవారందఱియొక్క, శిన్దై కవరుమ్ = మనస్సును కొల్లగొట్టే అందమైన రూపాన్ని కల, కడి పొళిల్ = సువాసనను మిక్కిలిగా కల తోటలను కల్గిన తెన్ అరఙ్గన్ = అందమైన శ్రీరంగంలోని నాథుని, తొణ్డర్ = భక్తులైనవారు, కులావుమ్ = ప్రశంసించేటట్లుగా ఉండే, ఇరామానుశనై = శ్రీరామానుజులనే, తొకై ఇఱన్ద = లెక్క లేని, పణ్ తరు వేదఙ్గళ్ = స్వరాన్ని కల వేదాలు అన్నీ, పార్ మేల్ = భూమిలో, నిలవు ఇడ = నిలచి వర్ధిల్లేటట్లు కటాక్షించే, కొణ్డలై = మేఘాన్ని, మేవి త్తొళుమ్ = భక్తితో సేవించేవారి, కుడియార్ = కుటుంబంలో ఉండేవారు, ఎఙ్గళ్ = ఆమేఘాన్నే విశ్వసించే మాకు, కో కులమ్ = నాథుల పరిషత్తు.

**"కవరుమ్"** అనేపదం **"పొళిల్ అరఙ్గమ్"** అనే పదంతో పాటుగా శ్రీరంగనాథునకు విశేషణం. **"పణ్డరు వేదఙ్గళ్"** అని పల్కడం- ఒక్కొక్క వేదానికి స్వరం ఉండడం గొప్పతనం కనుక. లేక, పైన **(64వ పాశురంలో)** **"పణ్డరు మాఱన్ పశున్దమిళ్"** అనే ప్రయోగానికి అనుగుణంగా స్వరాలు



నిండిన ద్రావిడవేదాలనే అర్థాన్ని గ్రహించవచ్చు. శ్రీరంగంలో తానే మొదట ద్రావిడవేదవిషయంలో శాఖోపశాఖలుగా వృద్ధిచేసిన పెంపుడు తల్లి శ్రీరామానుజులు కావడంవల్ల, అధ్యయనోత్సవాన్ని పూర్తిగా నిర్వహించడంవల్ల- అది అంతా వ్యాపించింది. అందువల్ల పూర్వపాదాలతో ఇపుడు బాగా సమన్వయిస్తుంది.

**"కోక్కులమే"**- కో = ప్రభువు, నాథుడు, శేషి, వారి కులం - సమూహం. ఆశ్రయించి కొలిచేవారి కులం - కోక్కుడి. మాకు ఒక్కొక్కరికి శేషి - అని భావం. **"ఎఙ్గళ్"** అని అంటూ తమ కులంలో ఉండేవారు అందఱిని కలిపి పల్కుతున్నారు.

**56.** అవ :- పూర్ణావతారంవలె ఆవేశావతారంకూడా ఆదరించదగినది. అందులోను, అహంకార- మమకారాలే మూర్తీభవించిన క్షత్రియులను ఒకసారికి **21** సార్లు భూమండలం అంతా చుట్టి వధించి, అశుద్ధమైన భూమికి **21** మార్లు శుద్ధి చేసిన పరశురామావతారం గొప్పది. వారి చేతిలో గ్రహించిన ఒకే గొడ్డలి-అన్నీ భగవానునకే శేషమనే తత్త్వజ్ఞానం ఈ విధంగా, సంసారాన్ని జయించడానికి శేషత్వజ్ఞానం కావాలి - అనే ఉపదేశాన్ని పరశురాముడు చేశాడు - అని భావం. ఇటువంటి పరశు రాముని విషయంలో అభినివేశాన్ని కలవారు భగవద్రామానుజులు- అనే భావంతో పల్కుతున్నారు.

**కోక్కులమన్నరై మూవెళుకాల్, ఒరుకూర్ మళువాల్**
**పోక్కియ తేవనై ప్పోట్రుమ్ పునితన్, పువన మెంగు**
**మాక్కియ కీర్‌త్తి యిరామానుశనై యడైన్దపిన్**
**వాక్కురైయాతు, ఎన్‌మనమ్ నినైయాతిని మఱ్ఱొన్ఱైయే.**

ఒరు కూర్ = సాటి లేని పదునైన, మళువాల్ = గొడ్డలి అనే ఆయుధంతో, మూ ఎళుకాల్ = ఇరవై ఒక్కమార్లు, కో కులమ్ = క్షత్రియకులంలోనివారైన, మన్నరై = మానవులను, పోక్కియ = వధించిన,

దేవనై = సర్వేశ్వరుని, పోట్రుమ్ = ఎల్లప్పుడు స్తుతించేవారు, పునితన్ = పరిశుద్ధమైనవారు, పువనమ్ ఎఙ్గు ఉమ్ = లోకం అంతా, ఆక్కియ కీర్త్తి = వ్యాపించిన కీర్తిని కలవారైన, ఇరామానుశనై = శ్రీరామానుజులను, అడైన్ద పిన్ = ఆశ్రయించిన తరువాత, మట్రు ఒన్ఱై = వేఱొక వ్యక్తిని, ఎన్ వాక్కు ఉఱైయాదు = నా నోరు పలుకదు, ఎన్ మనమ్ = నా మనస్సు, ఇని నినైయాదు = తలంచదు.

పరశురాముని పొగడడం ఆవేశావతారమైన భగవానుని పొగడడమే- అని భావించి పల్కిన భగవద్రామానుజుల దృష్టినిబట్టి తెలియదగినది ఏమి? - అంటే, అన్యవిషయంలో వాఙ్మనస్సులు ప్రవర్తించడం తగదు - అని. దీనినిబట్టి నా వాక్కు, మనస్సు శ్రీరామానుజులను విడచిపెట్టి వేఱొక దానిని గ్రహించరాదని తెలిసికొన్నాను - అని భావం. పరశురామావతారాన్ని ప్రస్తావించడం - ఆవేశావతారం వరకు భగవానుని కీర్తించవచ్చు; మిగిలినవాటిని విడువాలి - అనే ఉపదేశాన్ని సూచించడం కోసం.

**57.** అవ :- భగవానుని కీర్తించే శ్రీరామానుజులకంటే గొప్పగాకూడా కొందరు ఉండవచ్చునే! **"అడియార్క్కెన్నై యాట్పడుత్త విమలన్"** (భగవద్భక్తులకు నన్ను దాసునిగా చేసిన పరిశుద్ధుడు) అనే రీతిలో భాగవతులను పొగడేవారు ఎవరో, వారేకదా గొప్పవారు అవుతారు. వారిని వాక్కును, మనస్సుకు విషయంగా మీరు గ్రహించవద్దా! అని అంటే, భగవద్రామానుజులు భాగవతులను బంధువులుగా తలచినవారే, నాల్గు విధాలుగా పెద్దదైన ఈ భూమిలో గొప్పవారు ఏవిషయంలో అయినా వీరికి మించి ఎవరు లేరు. ఈ విషయంలో నాకు అజ్ఞానం లేదు - అని ఇందులో అంటున్నారు.

మట్రొరు పేఱు మతియాతు, అరంగన్మలరడిక్కాళ్
ఉట్రవరే తనక్కుట్రవరా క్కొళ్ళు ముత్తమనై,



నట్రవర్ పోట్రుమ్ ఇరామానుశనై యిన్నానిలత్తే
పెట్రనన్, పెట్రపిన్ మట్రఱియే నొరు పేతైమైయే.

మఱు ఒరుపేఱుమదియాదు = వేఱొకదానిని పురుషార్థంగా గ్రహించకుండా, అరఙ్గన్ = శ్రీరంగనాథుని, మలర్ అడిక్కు = తామరలవంటి శ్రీచరణాలకు, ఆళ్ ఉట్రవరే = దాసులుగా సంబంధించినవారినే, ఎనక్కు ఉట్రవర్ ఆ = తనబంధువులుగా, కొళ్ళుమ్ = గ్రహిస్తున్న, ఉత్తమనై = అందఱికంటే గొప్పవారు, నట్రవర్ పోట్రుమ్ = గొప్ప తపస్సును కలవారిచే పొగడబడేవారైన, ఇరామానుశనై = శ్రీరామానుజులను, ఇ నాల్ నిలత్తే = నాల్గువిభాగాలుగా కల్గిన ఈ భూమిలో, పెట్రనన్ = గొప్పవారుగా తెలిసికొన్నాను, పెట్ర పిన్ = దీనికి పిమ్మట, మట్రు ఒరు = దీనికిమాఱు అయిన, పేదమై = అజ్ఞానాన్ని, అఱియేన్ = ఉన్నదిగా భావించను.

దాసులకు దాసులైనవారే గొప్ప తపస్సును కలవారు అవుతారు. వారు అందఱు భగవద్రామానుజులను కీర్తిస్తున్నారు. సత్యం, తపస్సు, తపస్సే తపస్సు- అనే పక్షాలను విడిచి, **"స్వాధ్యాయప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః"** (స్వాధ్యాయం, ప్రవచనం- అనేవే తపస్సు అని మౌద్గల్యుని అభిప్రాయం.) అని గొప్ప తపస్సును గూర్చి తైత్తిరీయం తెలిపింది. చివరలో **"తస్మాన్న్యాసమేషాం తపసా మతిరిక్తమాహుః"** (అందువల్ల, వీనిలో అన్నిటిలో న్యాసమనబడేదే గొప్ప తపస్సు - అని అంటారు) అని ప్రపత్తియే గొప్ప తపస్సు అన్నది. అధ్యయన ప్రవచనాదులుకూడా వాటికి శేషమే. ఈ తపస్సును కలవారంతా ఈ విశాలభూమిలో కీర్తించేది మన శ్రీరామానుజులనే. అందువల్ల ఈ స్థితియే జ్ఞానులు ఆదరించదగినది- అని భావం.

**58.** అవ :- సగుణబ్రహ్మానికి శేషంగా తమను శ్రీరామానుజులు భావించినందువల్ల భాగవతదాస్యాన్ని ఆదరించారు. గొప్పదైన, అద్వితీయమైన నిర్గుణబ్రహ్మాన్ని స్వాధ్యాయ ప్రవచనాలవల్ల కలిగే జ్ఞానాన్ని పురస్కరించు

కొని గమనించినపుడు ఇది అజ్ఞానమేకదా! - అని అంటే, దానికి సమాధానాన్ని పల్కుతున్నారు.

**పేదైయర్ వేతప్పొరుళితు ఎన్ఱున్ని, ప్పిరమన్ ఎన్ఱై**
**న్దోతి మఱ్ఱెల్లా వుయిరు మవనెన్ఱు, ఉయిర్కళ్ మెయ్విట్టు**
**ఆతిప్పరనోడు ఒన్ఱా మెన్ఱు శొల్లు మవ్వల్లల్ ఎల్లామ్**
**వాతిల్ వెన్ఱాన్, ఎమ్మిరామానుశన్ మెయ్మ్మతిక్కడలే.**

పేదైయర్ = అవివేకులు, బాలురు, ఇదు =ఆత్మైక్యమే, వేదమ్ పొరుళ్ = వేదముఖ్యార్థం, ఎన్ఱు ఉన్ని = అని నిశ్చయించి, పిరమమ్ = నిర్గుణబ్రహ్మమే, నన్ఱు = ప్రామాణికం, సత్తు, లోకం అసత్తు, ఎన్ఱు ఓది = అని వేదార్థాన్ని పల్కి, మఱ్ఱు ఎల్లా = అచేతనం అసత్యమైనందున, అది తప్పు, జీవులందఱు, అఃదు = ఆ నిర్గుణబ్రహ్మమే, ఎన్ఱు = అని నిర్ణయించి, ఉయిర్కళ్ = ఆ జీవాత్మలు, మెయ్విట్టు = దేహసంబంధానికి ఇక చోటు లేదు - అనే తరుణంలో, ఆది పరనోడు = భ్రమకు అంతటికీ అధిష్ఠానమైన బ్రహ్మతో, ఒన్ఱు ఆమ్ = ఒకటి అవుతుంది, ఎన్ఱు శొల్లుమ్ = అని చెప్పబడిన, అల్లల్ = ఆర్భాటం, ఎల్లామ్ = అటువంటి భాస్కర యాదవ ప్రకాశపక్షాలు అన్నీ, వాదిల్ = వాదం చేసి, వెన్ఱాన్ = జయించిన, ఎమ్ ఇరామానుశన్ = శ్రీరామానుజులు, మెయ్ మది కడల్ = తప్పు కాని (దోషంలేని) జ్ఞానానికి స్థానం, - అన్నీ సత్యం అనే జ్ఞానానికి స్థానమై ఉన్నారు.

యథార్థజ్ఞానసముద్రులైన శ్రీరామానుజులు వాదంలో జయించారు- **(మెయ్మ్మది కడలాన ఇరామానుశన్ వాదిల్ వెన్ఱాన్")** అనే అన్వయాన్ని చేయవచ్చు. యథార్థాన్ని విడచి, ఎల్లప్పుడు జీవులు, బ్రహ్మం ఒకటే అయినా, శరీరం మొదలైనవి ఉన్నంతవరకు బ్రహ్మం వేఱు, జీవులు వేఱు - అనే జ్ఞానం ఉంటుంది. శరీరాదులైన ఉపాధులు అసత్యాలు కనుక, వాటిమూలంగా కల్గిన భేదజ్ఞానం కూడా అసత్యమని శంకర



మతంలో అంటారు. లోకం సత్యం కనుక, ఉపాధులు కూడా సత్యం. వాటివల్ల కలిగేది జీవబ్రహ్మ భేదం. ఇది స్వాభావికం కాదు. ఇది చివరలో నశిస్తుంది. తర్వాత అభేదమే ఉంటుంది - అని భాస్కరీయు లంటారు. బ్రహ్మమనే సన్మాత్రంనుండి జీవులు పుట్టారు. ఈ విధంగా ఒకే వస్తువు మొదట కారణం అయినందువల్ల ఒకటే అని, కారణావస్థ- కార్యావస్థ అనే అవస్థాభేదాన్ని బట్టి వేర్వేరు - అని చెప్పవచ్చు - అని అన్నారు యాదవప్రకాశులు. ఈ మూడు అద్వైతమతాలను శ్రీభాష్య కారులు నిరాకరించి, జీవ-బ్రహ్మ భేదం అనాది అని తెల్పి, అద్వైతమనేది విశిష్టాద్వైతమనే భావనతో - అని వివరించారు. వీరి సిద్ధాంతంలో లోకం అంతా సత్యం. జ్ఞానం అంతా సత్యం. అందులో విషయమయేవికూడా సత్యాలే. **"యథార్థం సర్వవిజ్ఞాన మితి వేదవిదామ్ మతమ్"** (సర్వవిజ్ఞానం యథార్థమే- అని వేదాంతుల మతం) అని వీరి సిద్ధాంతం. అందువల్ల వీరు **"మెయ్మ్మదికడల్"** (వాస్తవజ్ఞాన సముద్రులు) కనుక శాంకరమతం సుఖంగా నిరసింపబడుతుంది. అంతా యథార్థజ్ఞానమని నిరూపించే వారైనా, ఇతర మతాలు భ్రాంతివల్ల ఏర్పడినవే- అనే విషయాన్నికూడా స్థాపించారు. ఈ స్థాపనతో ఇది విరుద్ధం కాదు. కనుక, **"యథార్థం సర్వవిజ్ఞానమ్"** అని అంగీకరించిన ప్రాభాకరమతంకూడా నిరసింప బడుతుంది. వేఱొక సందర్భంలో దీని వివరం. (చేయబడుతుంది).

**59.** అవ :- ఇన్ని అద్వైతమతాలవల్ల ఏర్పడిన అనర్థాలను భగవద్రామా నుజులు నశింపజేయకపోతే, కలియుగానికి అంతమే కన్పించదు. కలియుగారంభంలో వేదాలకు విరుద్ధాలైన మతాలు అనేకం బలాన్ని పొందినా, వేదాన్ని విడచిపెట్టారు - అనే కారణంతో పలువురు ఆస్తికులు వాటిని అభిమానించ లేదు. ఈ మాయావాదమతం వేదప్రతిపాద్యార్థాన్ని వక్రీకరిస్తూ, "చేతనాచేతనాలుగా తోచే లోకంలో ఏమీ లేదు; అంతా అసత్యం అని బౌద్ధులు పలికేది వాస్తవమే. అయితే, భాసించే విధమే తప్పు బ్రహ్మమనేది ఒకటే ఉన్నది" అని అంటూ ఇంకొక శూన్యవాదాన్ని

లేవనెత్తింది. వేదం ప్రమాణమని పైకి చెప్పే మాటను విని భ్రమించి, ఇందులో ఆస్తికులు చిక్కుకొన్నారు. ఈ క్రూరమతం అనే కలికి పరమానందాన్ని కల్గించేది అయినదే- అని బాధపడి, దానిని పోగొట్టిన శ్రీరామానుజుల గొప్పతనాన్ని ఇందులో అముదనార్ నిరూపిస్తున్నారు.

**కడలళవాయ తిశై యెట్టినుళ్ళుమ్, కలియిరుళే**
**మిడై తరు కాలత్తిరామానుశన్, మిక్క నాన్మఱైయిన్**
**శుడరొళియాల్ అవ్విరుళై త్తురన్దిలనేల్ ఉయిరై**
**యుడైయవన్, నారణ నెన్ఱు అఱివారిల్లై యుట్రుణర్న్దే.**

కడల్ అళవు ఆయ్ = అన్ని వైపుల సముద్రంవరకు వ్యాపించిన, తిశై ఎట్టిన్ ఉళ్ ఉమ్ = ఎనిమిది దిక్కులలో అంతటా, కవి ఇరుళ్ ఏ = కలివల్ల అజ్ఞానమే, మిడై తరు = దట్టంగా ఉండే, కాలత్తు = ఈ కఠిన సమయంలో, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, మిక్క = చేతనా చేతనేశ్వర భేదాలనుముఖ్యంగా చేసే గొప్ప, నాల్ మఱైయిన్ = నాల్గు వేదాలలోని, శుడర్ ఒళియాల్ = తగని నమ్మికను చోటుకాని జ్ఞానమనే ప్రకాశంతో, అ ఇరుళై = ఆ అజ్ఞానంధకారాన్ని, తురత్తిలన్ ఏల్ = పోగొట్టకపోతే, ఉయిరై ఉడైయవన్ = జీవులు వేరు, జీవులకు స్వామియైనవాడు, నారణన్ = శ్రియఃపతియే, ఎన్ఱు = అనే రీతిలోని, ఉట్రు = సూక్తులలో మనస్సు నెరపి, ఉణర్న్దు = అర్థాన్ని వివేకించి గ్రహించి, అఱివార్ ఇల్లై = ఎవరు తెలియలేరు.

నారాయణుడు జీవులను కల్గినవాడు (శేషి) కావడంకూడా మన శ్రీరామానుజులవల్లనే. అందుచేత **"జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్"** (జ్ఞాని నా ఆత్మ -అని నా అభిప్రాయం.) అనే భగవదభిప్రాయానుసారం అతనిని (భగవానుని) కల్గినవారు వీరే. వీరు లేకపోతే జీవులు లేఱు,. ఈశ్వరుడు వేఱు- అనే కూడా కలుగదు. వేఱైనా శివుడే ఈశ్వరుడు; నారాయణుడు కాడు- అనే ఇటువంటివాదం విజృంభిస్తుంది. ఈ సందర్భంలో **"నిరాలోకే**



**లోకే నిరుపధిపరస్నేహభరితో యతిక్ష్మాభృద్దీపో యది న కిల జాజ్వలత ఇహ, అహంకారధ్వాంతం విజహతి కథంకార మనఘాః కుతర్క్యవ్యాలౌఘ కుమతిమతపాతాళకుహరమ్"** (యతిరాజులనే దీపం ప్రకాశం వెదజల్లి వెలుగకపోతే మతాంతరుల మూలంగా కల్గిన అహంకారమనే చీకటి పోగొట్టేది ఏది?) అనే యతిరాజసప్తతిశ్లోకం అను సంధేయం. **"మిడైతల్"**- గాఢంగా ఉండడం, **"తరు"** - ఇది సహకార క్రియ.

**60.** అవ :- ప్రమాతలు, ప్రమాణాలు, ప్రమేయం - అనే మూడు భగవద్రామానుజుల చేరికవల్ల సత్తను, బలాన్ని పొందాయి - అని వీరి మహిమలో అభినివేశాన్ని ప్రదర్శిస్తున్నారు.

**ఉణర్న్ద మెయ్ఞ్ఞానియర్ యోకమ్ తొఱుమ్, తిరువాయ్మొళియిన్**
**మణన్దరుమ్ ఇన్నిశై మన్ను మిడన్దొఱుమ్, మామలరాళ్**
**పుణర్న్ద పొన్ మార్వన్ పొరున్దుమ్ పతితొఱుమ్ పుక్కు నిఱ్కుమ్**
**కుణమ్ తికళ్ కొండల్, ఇరామానుశన్ ఎఱ్కులక్కొళున్దే.**

కుణమ్ తికళ్ = తాపాన్ని అంతటిని తీర్చే అమృతవర్షంతో ప్రకాశించే, కొణ్డల్ = కాలమేఘమైన, ఇరామానుశన్ = శ్రీరామానుజులనే, ఎమ్ కులమ్ కొళున్దు = మన కులానికి శిఖరమైన ఆచార్యులచే, ఉణర్న్ద = ప్రమాణాలను అన్నిటిని పరిశీలించేవారైన, మెయ్ ఞానియర్ = యథార్థ జ్ఞానాన్ని కలవారైన మహనీయుల, యోకమ్ తోఱుమ్ = ఒక్కొక్క సంఘంలోను, తిరువాయ్మొళియిన్ = సంస్కృతభాషతోపాటు, ద్రావిడ భాషలో గల ప్రమాణాలతో, మణమ్ తరుమ్ = అర్థస్వారస్యాలను చూపే ఇన్ ఇశై = తీయని స్వరం, ఇంగితం = అన్నిటినీ కల్గిన, ఇడమ్ తొఱుమ్ = ప్రదేశాలు ఒక్కొక్కటిలో, మా మలరాళ్ = మహాలక్ష్మితో, పుణర్త్త = పొందబడిన, పొన్ మార్బన్ = అందమైన వక్షస్సును కల శ్రియఃపతి, పొరున్దుమ్ = స్థిరంగా ఉండే, పతి తొఱుమ్ = దివ్యదేశాలు అంతటా, పుకున్దు నిఱ్కుమ్ = ప్రవేశించి ప్రకాశిస్తున్నారు.

శ్రీరామానుజులు ప్రవేశించకపోతే యథార్థజ్ఞానుల సమూహం మూఢుల గుంపే కాగలదు. ప్రమాణాలు ఆశ్రయించే ఆశ్రయమే ఉండదు. లక్ష్మీదేవితో పాటు భగవానుడు భూమిని విడచి వెళ్ళి ఉండేవాడు - శాస్త్రాల మూలంగా జ్ఞానులు అందఱు వీరి సిద్ధాంతాన్ని ఆదరించి యథార్థజ్ఞానాన్ని కలవారయ్యారు. అందువల్ల విష్ణువుపట్ల భక్తి వృద్ధి అయినది. రాగాలతో భజనను చేసేవారయ్యారు. అందువల్ల జ్ఞానులు, ద్రావిడవేదాన్ని అనుసంధించేవారు, అర్చామూర్తులు భగవద్రామానుజుల వద్ద ఎల్లప్పుడు కృతజ్ఞులై ఉన్నారు- అని భావం.

**61.** అవ :- ప్రబలపాపకర్మలను చేసిన నన్ను దాసునిగా చేసికొన్నందు వల్ల భగవద్రామానుజులకు ఏమి కళంకమో! ఏమో! అని భీతిల్లాను. దానికి మాఱుగా భూమి అంతా గొప్పతనాన్ని పొందిన వారికి కీర్తియే విస్తృతమైనది. (వారికి కళంకం ఏమీ రాలేదు)

**కొళున్దు విట్టోడిప్పడరుమ్ వెమ్ కోళ్ వినైయాల్, నిరయ**
**త్తళున్దియిట్టేనై వన్దాళ్ కొండపిన్నుమ్, అరుమునివర్**
**తొళున్దవత్తోన్ ఎమ్మిరామానుశన్తన్ పుకళ్ శుడర్మి**
**క్కెళున్దతు, అత్తాల్ నల్లతిశయమ్ కండతిరునిలమే.**

కొళున్దు విట్టు = ఇంకా ఇంకా చిగుళ్ళు చిగిర్చి, ఓడి ప్పడరుమ్ = చూచిన చోట అంతటా, వెమ్ కోళ్ = సహించడానికి సాధ్యం కానిది, ప్రబలం అయిన, వినైయాల్ = పాపాల కారణంగా (ఏర్పడే), నిరయత్తు = ఈ సంసారంలోను, అళున్దియిట్టేన్ = పూర్వమే చిక్కుకొని ఉండే నన్ను, వన్దు ఆళ్ కొణ్డ పిన్నుమ్ = తామే దగ్గరకు వచ్చి పైకెత్తి, తమకు చెందిన వానినిగా గ్రహించిన తరువాత కూడా, అరు మునివర్ = అరుదైన యోగులచే, తొళుమ్ = నమస్కరింపబడే, తవత్తోన్ = గొప్ప తమస్సును కలవారైన, ఎమ్ ఇరామానుశన్ = మన శ్రీరామానుజుల, తొల్ పుకళ్ = పూర్వం నుండి ఉండే కీర్తి, శుడర్ మిక్కు = ప్రకాశం అధికమై, ఎళున్దదు = బలిమిని పొందింది, అత్తాల్ = అందువల్ల, ఇరు నిలమ్ = ఈ గొప్ప



భూమియే, అతిశయమ్ = గొప్పతనాన్ని, కణ్డదు = పొందింది.

“**అతిశయమ్ కణ్డతు**” అనే పదానికి ఇంతటి నీచునితో కలసినా కీర్తి వ్యాపిస్తున్నదే! ఏమి ఆశ్చర్యం! అని లోకం భావించింది- అనే అర్థాన్ని గ్రహిస్తారు. నీచుడనైన నన్ను స్వీకరించడం వారికి అపకీర్తి కాగలదు- అని నేను భావించగా, దానికి మాఱుగా కీర్తియే మిక్కిలి వ్యాపించింది. నన్ను సంస్కరించి, నావల్ల కైంకర్యాన్ని స్వీకరించినప్పటి నుండి శ్రీరంగ దివ్యాలయం చక్కగా అన్ని సమృద్ధులను పొందగా, ఈ శ్రీరంగం ఆలయంలో అన్నీ నడవడానికి తగినట్లు దీనినే మార్గదర్శకంగా చేసికొని ఒక్కొక్క దివ్యక్షేత్రంలో భగవద్రామానుజులు ఇక్కడ చేసిన సంస్కరణల రీతిలో చేయడం ఆరంభించినందువల్ల గొప్పతనాన్ని పొందాయి- అనే అర్థాన్ని గ్రహించవచ్చు. పెరియకోయిల్నంబి - అని నాకు పెట్టిన పేరు కారణంగా నేనే అన్నిటికీ కారణమని నన్ను అడ్డుపెట్టుకొని లోకంలో వారి పేరు వ్యాపించింది. దీనివల్ల భగవద్రామానుజుల సంబంధం ఏర్పడితే- చాలా నీచస్థితిని కలవాడుకూడా ఉచ్చస్థితిని పొందవచ్చు - అనేది స్పష్టమైనది. ఇక్కడ “నిరయత్తు” అనే పదం వాస్తవమైన నరకాన్ని తెలుపదు. **“ఏతేవై నిరయా స్తాత! స్థానస్య పరమాత్మనః”** (నాయన పరమపదం పోలిస్తే ఇవి అన్నీ నరకాలవంటివే) అనే రీతిలో స్వర్గమే ముముక్షువుకు నరకమైనపుడు, భూమి మొదలైన సంసారస్థానం నరకమనడంలో ఆశ్చర్యమేమి?

**62.** అవ :- భగవద్రామానుజుల సంబంధం లేనివారికి భగవానుడు మంచిని చేయడు. సంబంధాన్ని కల నాకు శ్రమపడినా స్థిరంగా నిలువక పోవడం ఒక విశేషం - అని అంటున్నారు.

**ఇరున్దేన్ ఇరువినై ప్పాశమ్ కళఱ్ఱి, ఇన్ఱియా నిఱైయుమ్**
**వరున్దే నిని ఎమ్మిరామానుశన్, మన్ను మామలర్త్తాళ్**
**పొరున్దా నిలైయుడై ప్పున్మెయినోర్ క్కొన్ఱుమ్ నన్మై శెయ్యా**

ప్పెరున్దేవరై ప్పరవుమ్, పెరియోర్తమ్ కళల్ పిడిత్తే.

ఎమ్ ఇరామానుశన్= మన యతిరాజుల, మన్ను = అందటిచే స్థిరంగా గ్రహింపబడిన, మా మలర్ తాళ్ = తామరలవంటి శ్రీచరణాలలో, పొరున్దా నిలై ఉడై = సంబంధంలేని, పున్మైయినోర్క్కు = అల్పత్వాన్ని కలవారికి, నన్మై ఒన్ఱుమ్ = ఏమంచి, శెయ్యా = చేయకుండా ఉండే, పెరు దేవరై = శ్రీరంగనాథుని, దేవాధిరాజును, పరవుమ్ పెరియోర్ తమ్ = స్తుతించే కూరేశుల, కళల్ పిడిత్తు = శ్రీచరణాలను ఆశ్రయించిన తరువాత, ఇరు వినై = పుణ్యాపాపాలనే, పాశమ్ కళఱ్ట్రి = కట్టునువిప్పి, ఇరున్దేన్ = సత్తను పొందాను, యాన్ ఇఱై ఉమ్ = నేను కొంచెం కూడా, ఇని వరున్దేన్ = దేహావసానం వరకు దుఃఖపడను.

**(ఎమ్మిరామానుశన్)** - ఇత్యాది. **"యతీంద్రాప్రియాః విష్ణుకారుణ్య దూరాః"** (యతీంద్రులకు ఇష్టంకానివారు విష్ణువు కరుణకు దూరం అవుతారు.) అని భావం. ఇక, **"ఎమ్ ఇరామానుశనాల్ మనప్పడుమ్ తమ్తాళ్ ఉడైయ పెరున్దేవర్"** (మన భగవద్రామానుజులచే ఆశ్రయింప బడే తన శ్రీచరణాలను కల గొప్ప దేవుడైన శ్రీరంగనాథుడు అనే అర్థం చెప్పవచ్చు.) **"పెరున్దేవర్"** - బ్రహ్మాదులకు, నిత్యసూరులకు పరుడైన శ్రీరంగనాథుడు. లేక, దేవదేవుడు (వరదరాజస్వామి) దేవాధిరాజు పేరున్దేవిత్తాయార్ వల్లభుడు. కూరత్తాళ్వాన్‌కు వరదరాజస్వామిపట్ల అభినివేశం అధికం కనుక, స్తుతికూడా గొప్పగా చెప్పినందువల్ల, ఈ అర్థం చాలా పొసగుతుంది. యాదవప్రకాశాదులకు మొదట దేవాధిరాజు (వరదరాజస్వామి) అనుగ్రహించకుండా, వీరికేకదా అనుగ్రహించాడు.

**63.** అవ :- భగవద్రామానుజుల విషయంలో తమకు గల అభినివేశాన్ని స్థిరంగా నిలుపడంకోసం ఒక విధమైన (విలక్షణమైన) ప్రేమను పొందించమని ప్రార్థిస్తున్నారు.

**పిడియై త్తొడరుమ్ కళిఱెన్న, యానున్ పిఱంగియ శీర్**



**అడియై త్తొడరుమ్బడి నల్కవేండుమ్, అఱు శమయ**
**చ్చెడియై త్తొడరుమ్ మరుళ్ శెఱిన్దోర్ శిదైన్దోడవన్ది**
**ప్పడియై త్తొడరుమ్, ఇరామానుశ! మిక్క పండితనే.**

అఱు శమయమ్ = ఆఱు మతాలనే, శెడియై = ముళ్ళ చెట్టును, తొడరుమ్ మరుళ్ = ఆశ్రయించే అజ్ఞానం, శెఱిన్దోర్ = గొప్పగా కలవారు, శిదైన్దు ఓడ = భంగపడి, పరుగెత్తిపోయేటట్లు, వన్దు = ఇక్కడే అవతరించి, ఇపడియై = భూమిలో అంతటా, తొడరుమ్= సంచరించిన, ఇరామానుశ!, మిక్క పణ్డితనే = పాండిత్యం నిండిన స్వామి!, పిడియై = ఆడ ఏనుగును, తొడరుమ్ = వెంబడించే, కళిఱు = మగ ఏనుగు, ఎన్న= అనేటట్లు, యాన్ ఉన్ = నేనుమీ, పిఱఙ్గియ శీర్ = ప్రకాశించే గుణాన్ని కల, అడియై = శ్రీచరణాలను, తొడరుమ్బడి = వెంబడించేటట్లు, నల్కవేణ్డుమ్ = స్నేహాన్ని పొందాలి.

తాము స్త్రీలై, భగవానుడనే పురుషోత్తమునితో సంశ్లేషించి, గొప్ప ఆనందం పొందాలనే ప్రేమను పొందినవారు, ఆళ్వార్లు. **"కణ్ణనుక్కే యామతు కామమ్"** అని వీరుకూడా (అముదనార్) అనుగ్రహించారు. ఇపుడు వీరు భగవానుని శ్రీచరణాలను ఆడ ఏనుగుగా, తమను మదపుటేనుగుగా భావిస్తూ ఆనందిస్తున్నారు. ఆడ ఏనుగు మగఏనుగును వీడదు. అదే రీతిలో భగవానుని శ్రీచరణాలు వీరిని విడువడం లేదు. ఈ అర్థమే పాశురంలో సరసంగా తెలుస్తున్నది. ఇంతేకాక, నేను, మీ శ్రీచరణాలను, ఈ శ్రీచరణాలనే ఆడ ఏనుగును, వెంబడించిపోయే మగ ఏనుగు- అని భావించే రీతిలో - అంటే - ఇతరులుకూడా ఈ విధంగా భావించే రీతిలో, ఆడ ఏనుగును విడువకుండా ఉండేటట్లే, మీ శ్రీచరణాలను నేను విడువకుండా ఉండేటట్లు అనుగ్రహించాలి- అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. **"అఱు శమయ చ్చెడియై త్తొడరుమ్ మరుళ్... మిక్క పణ్డితనే"** అనే రీతిలో **"పర్యాప్తం పర్యచైషం... యతీంద్రత్రుటిత**

బహువృషాతంత్రకాంతారపాంథైరంతర్మోహక్ష పాంథైః... తనీయః" (కణాదుని వైశేషికమతాన్ని చాలు చాలు అనేటట్లు గ్రహించాను. గౌతముని న్యాయమతాన్ని అభ్యసించాను. మీమాంసతో దృఢంగా ఉండే మతాలనే అరణ్యంలో ఆంతరమైన అజ్ఞానంతో గుడ్డివారైన ఆ యా మతాలవారితో మాకు ఇక ఈ లోకంలో ఆలోచించవలసినది ఇక ఏమున్నది?) అనే యతిరాజసప్తతిశ్లోకం అను సంధేయం.

**64.** అవ :- తమను మగ ఏనుగుగా భావించిన అముదనార్ భగవద్రామానుజులను మదగజంగా భావించి, ప్రతివాదులను పారదోలుతున్నారు.

> పండరు మాఱన్ పశున్దమిళ్, ఆనన్దమ్ పాయ్ మతమాయ్
> విండెడ వెంగళి రామానుశముని వేళమ్, మెయ్మ్మై
> కొండ నల్వేతక్కొళున్దండ మేన్ది క్కువలయత్తే
> మండి వన్దేన్దతు, వాతియర్కాళ్! ఉజ్గళ్ వాళ్వఱ్ఱతే.

వాదియర్కాళ్ = దుర్వాదాలను చేసేవారలారా!, ఎజ్గళ్ ఇరామానుశ ముని వేళమ్ = ఏనుగు, పణ్ తరు = రాగాలకు స్థానమైన, మాఱన్ పశు తమిళ్ = రాగాలకు స్థానమైన, నమ్మాళ్వార్ల అందమైన ద్రావిడం మూలమైన, ఆనన్దమ్ = అనుభవానందం అనేది, పాయ్ మదమ్ = మనోవాక్కాయకర్మలనుండి ప్రవహించే మూడు విధాలైన మదంగా, విణ్డిడ = ప్రవహించగా, ఆ పిమ్మట, మెయ్మ్మై కొణ్డ = సత్యాన్నే పలికే, వేదమ్ = వేదమనే, కొళు దణ్డమ్ = పెద్దదండాన్ని, లేక, దంతాన్ని, ఏన్ది = గ్రహించి, కువలయత్తు = భూమండలంలో అంతటా, మణ్డివన్దు = బలాన్ని పొంది వచ్చి, ఏన్దదు = విజృంభించింది, అందువల్ల, ఉజ్గళ్ వాళ్వు = మతప్రచారం, అఱ్ఱదు = నశించింది.

ద్రావిడవేదం పాడి, ఆడి, తుళ్ళి ఆనందించేటట్లుగా రచింపబడింది కనుక, దానివల్ల కలిగే ఆనందమే మదజలం. మతాంతరాలలోని ఆగమాలు అసత్యాలు పల్కుతాయి. కొన్నాళ్ళకు ముందే సృష్టింపబడినవి



కనుక అస్థిరాలు, అసత్తులు కూడా. వేదాలు యథార్థాన్ని కల్గినవి. అంతేకాక, వేదంలోని ఋజువైన అర్థాలు యథార్థాలు. కుదృష్టులు గ్రహించిన అర్థాలు ఆభాసాలు. యథార్థాలను ప్రస్తావించి పల్కి, అటువంటి వేదాలతో ప్రతివాదులను అందఱిని దండించి అణిచారు, భగవద్రామానుజులు - అని భావం. **"వేదక్కొళున్దణ్డమేన్ది"** అనేది మూడు వేదాలు మూడు దండాలు అయినవి- అనే భావంతో చేయబడింది. **"కాషాయేన గృహీతపీతవసనా దండైస్త్రిభిర్మండితా సా మూర్తిర్మురమర్ద నస్య జయతి త్రయ్యంతసంరక్షిణీ"** (కాషాయమనే పీతాంబరాన్ని కల్గినది, త్రిదండంతో అలంకరింపబడినది, వేదాంతాన్ని రక్షించేది అయిన ఆ దత్తాత్రేయుని మూర్తి గొప్పగా ప్రకాశిస్తున్నది), **"కాణాదశాక్యపాషండైః త్రయీధర్మో విలోపితః, త్రిదండధారిణా పూర్వం విష్ణునా రక్షితా త్రయీ"** (కాణాదులు, శాక్యులు, చార్వాకులనే వారిచే వేదం ధర్మం లోపించింది. అపుడు త్రిదండధారి అయిన దత్తాత్రేయుడై అవతరించిన విష్ణువుచే వేదం రక్షింపబడింది.) అనే సూక్తులు భావ్యాలు. ఋక్కు, యజుస్సు, సామం- అనే మూడువేదాల వలె భేద, శ్రుతి, అభేదశ్రుతి, ఘటకశ్రుతి అనే మూడు వేదాలను దండాలుగా గ్రహించవచ్చు. ప్రతివాదులలో- తత్త్వంలో మాత్రం భేదాన్ని గ్రహించినవారు, ఆచారంలోమాత్రం తత్త్వం, ఆచారం రెండిటిలోను భేదాన్ని గ్రహించినవారు- అనే భేదం ఉన్నది. లేక, 1. వేదాన్ని అప్రమాణమని విడచిపెట్టిన బాహ్యులు, 2. ప్రమాణాలుగా అంగీకరించి, తన్మూలంగా తత్త్వనిర్ణయాన్ని చేయకుండా తర్కమూలంగా చేసే సాంఖ్య-తార్కికవాదులు, 3. వేదవిచారం చేసినా అపార్థాన్ని పలికే కుదృష్టులు, అర్థమీమాంసకులు మొదలైనవారు- అని మూడు తెఱగులవారు. ఈ మూడు రీతులలోని ప్రతివాదులను జయించడం కోసం మూడు దండాలు. నాల్గు దండాలు నాల్గు వేదాలు- అని భావిస్తే, నాల్గు దంతాలు కల్గిన దిగ్గజాలుగాను భగవద్రామానుజులను రూపించినట్లవుతుంది. అందువల్ల నాల్గు పురుషార్థాలు యథార్థం. శ్రుతి,

స్మృతి, పాంచరాత్రం, ద్రావిడవేదం- అని నాల్గు ప్రమాణాలు- అనే రీతిలో ఈ అర్థానికి అనుగుణంగా భావించాలి.

**65.** అవ :- **"దణ్డమ్"** అని అన్నందువల్ల భగవానుడు ఆయుధాలను గ్రహించి నశింపజేసేటట్లుగా నశింపజేస్తారని అర్థం కాదు. ప్రతివాదులను గెలవడం జ్ఞానాన్ని అనుగ్రహించడంద్వారా కనుక, అందుకోసం వేదాలేకదా దండాలు అయినవి. కనుక, వాటి మూలంగా జయించిన రీతిని, ఫలాన్ని గూర్చి ఇందులో పల్కుతున్నారు.

**వాళ్వఱ్ఱతు తొల్లైవాతియర్క్కు, ఎన్ఱుమ్ మఱైయవర్తమ్**
**తాళ్వఱ్ఱతు తవమ్ తారణి పెఱ్ఱతు, తత్తువనూల్**
**కూళఱ్ఱతు కుఱ్ఱ మెల్లామ్ పతిత్త కుణత్తినర్క్కు**
**న్నాళఱ్ఱతు, నమ్మిరామానుశన్ తన్ద ఞానత్తిలే.**

నమ్ ఇరామానుశన్ = వేదాన్ని దండంగా గ్రహించిన మన శ్రీరామానుజులు, తన్ద ఞానత్తిలే = అనుగ్రహించిన వేదార్థ విషయమైన మంచి జ్ఞానంతో, తత్తువమ్ నూల్ = తత్త్వశాస్త్రాలైన ఉపనిషత్తులు మొదలైన వానిలో ఉండే, కూళ్ = సందేహాలన్నీ, తొల్లై = చిరకాలంగా, వాదియర్క్కు = నిరంతరం దుర్వాదాలను చేసేవారికి, వాళ్వు = విపరీత జ్ఞానమూలమైన, గౌరవం, సుఖం, ఎన్ఱు = ఇక కలుగకుండా ఉండేటట్లు, అఱ్ఱదు = పోయింద, మఱైయవర్తమ్ = వైదికులకుండే, తాళ్వు అఱ్ఱదు = నీచస్థితి పోయింది, తారణి = భూమి అంతా, తవమ్ పెఱ్ఱదు = మంచికి పనికి వచ్చే భాగ్యం, న్యాసం మొదలైన ఉపాయాలు పొందింది, అందువల్ల, కుఱ్ఱమ్ ఎల్లామ్ = అన్ని రీతులలోని పాపాలను, పదిత్త = స్థిరంగా నిలచేటట్లు చేసే, కుణత్తినర్క్కు = దుర్గుణాలను కల సంసారుల, నాళ్మ్ = సంచితపుణ్యాపాపాలు, ప్రాప్తాలైన దోషాలు, అఱ్ఱదు = తీరాయి.

**"ఎన్ఱుమ్" - "ఇదం ప్రథమసంభవత్ కుమతిజాలకూలంకషాః"** అనే



రీతిలో ఇక నూతనంగా ఏదయినా మతం తల ఎత్తినా దానినికూడా నశింపజేయగల వేదార్థరూపమైన యథార్థజ్ఞానాన్ని భగవద్రామానుజులు తాగించినందువల్ల, ఇక ఏనాడూ వాదించేవారు ఆ దుర్వాదాలను చేయరు. వేదవేత్తలకు న్యూనత ఇక ఏనాడూ కలుగదు - అని ఈ రీతిలో **"ఎన్ఱుమ్"** అనే పదాన్ని అన్ని క్రియలలోను అన్వయించవచ్చు. పాశురంలోని **"తవమ్"** ఇత్యాది ప్రయోగం **"భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"** (పరాత్పరుని దర్శనం కాగానే జీవుని హృదయగ్రంథి భేదింపబడుతుంది, అన్ని సందేహాలు తీరిపోతాయి, అతని కర్మలు నశిస్తాయి.) అనే వాక్యం యొక్క అర్థాన్ని తెల్పుతున్నది. **"పరావరే"** అనే దానికి భక్తి అనే గొప్ప ఉపాయం, ప్రపత్తి అనే సులభమైన ఉపాయం - రెండిటికి విషయమైన భగవానుని దర్శించి నందువల్ల - అనే అర్థం తగును. పరావరే - ఉత్తమ అధమాధి కారులకు అంతర్యామియైన - అని కూడా భావం. **"కుఱ్ఱమెల్లామ్"** అనేచోట లోకం అంతా భగవానుని విభూతులు అనే జ్ఞానం కల్గిన తర్వాతకూడా స్వతంత్రంగా ఎవరికీ విరోధాన్ని చేసే శక్తిని కలవారు కారు - అనే వివేకం కల్గినందువల్ల, **"కృతే చ ప్రతికర్తవ్యమ్"** అనే దుర్బుద్ధి వైష్ణవులవద్దనుండి తొలగిపోయింది - అని కూడా భావం.

**66.** అవ :- (గడచిన పాశురంలో) **"తవమ్ తారణి పెత్తతు"** అని అన్నారు. ఆ తపస్సు భక్తియోగం కావచ్చు, ప్రపత్తియోగం కావచ్చు. భగవానుని ఆశ్రయిస్తే భక్తిలో ప్రవేశించడంకూడా సంభవిస్తుంది. శ్రీభాష్యకారులను ఆశ్రయించేవారికి సులభంగా మోక్షం లభిస్తుంది. దానికి తామే ఉదహారణమని అంటున్నారు.

**ఞానమ్ కనిన్ద నలమ్ కొండు, నాడొఱుమ్ నైబవర్క్కు**
**వానమ్ కొడుప్పతు మాతవన్, వల్వినైయేన్ మనత్తిల్**
**ఈనమ్ కడిన్ద ఇరామానుశన్ తన్నై ఎయ్తినర్క్కు**

**త్తానమ్ కొడుప్పతు, తన్ తకవెన్నుమ్ శరణ్ కొడుత్తే.**

మాదవన్ = శ్రియఃపతి, వానమ్ కొడుప్పదు = మోక్షం ఇవ్వడం అనేది, ఞానమ్ = సౌశీల్యాది గుణానుసంధానంవంటి వివేకంతో, కనిన్ద = పక్వమైన, నలమ్ కొణ్డు = భక్తితో, నాళ్ తోఱుమ్ = ఏదినం విడువకుండా ప్రతిదినం, నైబవర్క్కు = ద్రవించి, భుజించే చేసేవారికి అందఱికి, వల్ వినైయేన్ = క్రూరపాపాలను కలనాకు, మనత్తిల్ ఈనమ్ = మనస్సులో ఉండే దోషాలను, కడిన్ద = పోగొట్టిన, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, తన్నై ఎయ్దినర్క్కు = తమను ఆశ్రయించినవారికి, అ తానమ్ కొడుప్పదు = అదే పరమపదాన్ని ఇవ్వడం అనేది, తన్ తకవు ఎన్నుమ్ = తమ దయ అనే, శరణ్ = ఉపాయాన్ని, కొడుత్తే = చూపియే (ఇస్తాడు).

భగవానుని ఆశ్రయిస్తే, అతడు అర్జునునకు కర్మయోగ- జ్ఞానయోగ- భక్తియోగాలను ఉపదేశించడంవంటి పనిని చేస్తాడు. ఆశ్రయించేవారు కూడా అతని తిరుమేనిని దర్శించి మనస్సు అందులో లగ్నం కాగానే, ధ్యానంలో నిమగ్నులవుతున్నారు. అందువల్ల నిరంతరం అనుష్ఠించ వలసిన భక్తిలో ప్రవేశించి, పరమాకాశానికి విలంబంగానే వెడుతున్నారు. భగవానుని విడచి భగవద్రామానుజులను ఆశ్రయిస్తే వారు ఇతనికి భక్తియోగం చేయడం సాధ్యం కాదని తెలిసినందువల్ల తత్క్షణమే కరుణ చూపి ప్రపత్తిలో ప్రవేశించేటట్లు చేసి, అదే పరమపదాన్ని అనాయాసంగా ఎక్కువ ఆలస్యం లేకుండా అనుగ్రహిస్తారు. ఆచార్యనిష్ఠలో నిలచినవానిని - ప్రపత్తినికూడ తాను అనుష్ఠించకుండా ఆచార్యుడే అనుష్ఠించనీ - అని తలచినవానిని భక్తియోగంలో ప్రవేశింపజేయడం సాధ్యమా! అని భావం. **"ఎన్మనత్తిల్ ఈనమ్ కడిన్ద"** - ఇక్కడ **"ఈనమ్"** అంటే - రాగ ద్వేషాదులు, నాస్తిక్యం, భగవానుని గౌరవించినా, భాగవతులను అభాగవతులవలె అలక్ష్యం చేయడం, మనం అనుష్ఠించినపుడే మోక్షమనే భావన - ఇత్యాదులు. భగవద్రామానుజులను విడచి, వారి దాసులైన (శ్రీచరణ స్థానీయులైన) కూరేశులను ఆశ్రయించినందువల్ల వీరు ఏ తక్కువదనం (కొఱత)



లేకుండా ఫలాన్ని పొందారు.

**67.** అవ :- "చక్కగా ఉపాయాన్ని అనుష్ఠించే శక్తి మనకు ఎక్కడిది?" అని భయపడి మోక్షోపాయంలో ప్రవేశించకుండా సంసారులై చెడిపోయే వారిని చూచి, "మీ కరణాలు భక్తియోగాన్ని అనుష్ఠించడానికి ఉపయోగ పడకపోయినా, మీకు వీటిని భగవానుడు అనుగ్రహించడం సంసారంలో పరిభ్రమించడంకోసం కాదు. శరణాగతిని చేయడం కోసమే. ధర్మ పుత్రునకువలె శరణాగతిద్వారా ఫలాన్ని పొందే అవకాశం మీకు ఉన్న"దని ఉపదేశిస్తారు, భగవద్రామానుజులు- అని ఇందులో అంటున్నారు.

**శరణ మడైన్ద తరుమనుక్కా, పండు నూట్రువరై**
**మరణ మడైవిత్త మాయవన్తన్నై వణంగ వైత్త**
**కరణమివై యుమక్కన్ఱు ఎన్ఱిరామానుశన్ ఉయిర్కట్కు**
**అరణఙ్గమైత్తిలనేల్, అరణార్ మట్రివ్వారుయిర్క్కే.**

పణ్డు = కృష్ణావతారంలో, శరణమ్ అడైన్ద = శరణాగతిచేసిన, తరుమనక్కు ఆ = ధర్మపుత్రుని కోసం, నూట్రువరై = దుర్యోధనాదులు నూఱుమందిని, మరణమ్ అడైత్త = యుద్ధంలో నశింపజేసిన, మాయవన్తన్నై = చిన్న ప్రయత్నానికి కూడా గొప్ప ఫలం ఇవ్వగల్గిన ఆశ్చర్యశక్తిని కల భగవంతుని, వణఙ్గ = సేవించడం కోసమే, వైత్త = సృష్టింపబడిన, కరణమ్ = అంగాలు, ఇవై = ఈ హస్తపాదాదులు, ఉనక్కు అన్ఱు నీ = యథేచ్ఛ విహారం కోసంకాదు, ఎన్ఱు = అనే రీతిలో, ఉయిర్కట్కు = జీవులకు, అఙ్గు = భగవంతునివద్ద, అరణ్ = రక్షను, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, అమైత్తిలనేల్ = సృష్టించకపోతే, ఇ ఆర్ ఉయిర్క్కు = అరుదైన ఈ ప్రాణులకు, మట్రు అరణ్ ఆర్ = వేఱు రక్షకులు ఎవరున్నారు?

ఈ పాశురం, ముందు పాశురాన్ని సరిగా అర్థం చేసికోకుండా లేవనెత్తిన ఒక ప్రశ్నకు సమాధానం. ఆ ప్రశ్న ఏమంటే - మాధవుడనబడే

శ్రియఃపతి భక్తియోగాన్ని అనుష్ఠించినవారికే పరమపదాన్ని ఇచ్చేటట్లయితే, వీరు ఏవిధంగా ఇతరులను పరమపదానికి పంపగలరు? వీరికి అంత దయ ఉండవచ్చు. అది ఫలించవద్దా! వీరిచే పంపబడినవారు వీరి శక్తివిశేషంచేత అంత దూరం వెళ్ళినా, విశ్వామిత్రునిచే పంపబడిన త్రిశంకు దేవలోకంలో దేవతలచే గెంటబడి పడిన పాట్లే వీరిచే పంపబడిన వారికి కూడా కల్గుతుంది. ఆ స్థానాన్ని ఇచ్చేవారు వీరు - అనే మాట ఏవిధంగా పొసగుతుంది? ఆ స్థానం వీరి లోకమా? - అనేది ఆ ప్రశ్న. దీనికి సమాధానం ఏమంటే- **"మహతా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా, ప్రాప్తుం దుఃఖోదధేః పారం త్వర యావన్న భిద్యతే"** (గొప్పదైన పుణ్యమనే వెలతో ఈ శరీరమనే నావ నీచే కొనబడింది. అది పగిలిపోవడానికి ముందే ఈ దుఃఖసముద్రాన్ని దాని సహాయంతో దాటాలి) అనే రీతిలో మానవశరీరాలు సంసారాన్ని దాటడానికి, భగవానునకు కైంకర్యాన్ని చేయడానికి మాత్రమే ఏర్పడినది. ఏవో కొన్ని సుఖదుఃఖాలను మీరు అనుభవించడంకోసం మాత్రమే కాదు. అందువల్ల అరుదైన ఈ శరీరాన్ని అపూర్వమైన పురుషార్థాన్ని పొందడంకోసం ఉపయోగించినట్లయితే మంచిది - అని ఎదురు చూచేవానివలె ఉన్నాడు. ఇక్కడనే భగవానుని అనుభవించడానికికూడా అనుకూలమైన శరీరాన్ని, ఇంద్రియాలను అనుగ్రహించడంవల్ల ఆ విధంగా అనుష్ఠించనీ - అని భక్తియోగంలో ప్రవేశించినట్లు చేస్తాడు. ఇతడు వివేకియై, సాధ్యం కాదని గ్రహిస్తే, వేఱు లఘు ఉపాయాన్ని చూపించాడు. అందువల్ల దానిని ఆశ్రయించండి. అయితే, ఇక కరణకళేబరాలకు పని లేదు- అని భావించవద్దు. పరమ పదంలోవలె ఇక్కడకూడా అతని కైంకర్యాన్నే చేయవచ్చుకదా - అనే భగవానుని మనస్సులోని భావాన్ని వ్యక్తం చేసి, వీరు ఉపదేశిస్తారు. కనుక, దీని ప్రకారం మోక్షానికి ప్రయత్నించే అధికారులు త్రిశంకువువలె పాట్లు పడతారు - అని భావించరాదు. భగవానుని కోరి, అతని సమ్మతిని పొందికదా తమ దయ ఫలించే అవకాశాన్ని



పొందే వీరు ఆ స్థానాన్ని ఇస్తారు - అని భావం. దీనిని **"అరణఙ్గమైత్తిలనేల్"** అనేచోట గ్రహించవచ్చు. ఈ అర్థంలో **అఙ్గ** = మోక్షభూమిలో, **అరణ్** = రక్షణను, అనుగ్రహించకపోతే - అని అర్థం. వీరు ఆ యా జీవునకు భగవానునివద్ద ప్రపత్తిని చేయాలి - అని ఉపదేశం చేయకపోతే - అనికూడా భావం.

**68.** అవ :- భగవానుడు భక్తిమార్గాన్ని ఉపదేశించేటపుడు వీరు దానికి మాఱుగా ప్రపత్తిని ఉపదేశించవచ్చునా? - అని అంటే, భగవానుడే కర్మయోగ-జ్ఞానయోగ-భక్తియోగాలనే సర్వధర్మాలను విడచినవారు ప్రపత్తిని అనుష్ఠించాలని విధించినందువల్ల ఉపదేశిస్తున్నాడని తెలియ జేస్తూ, ఆ గీతావ్యాఖ్యానాన్ని శ్రీరామానుజులు చాలా అందంగా అనుగ్రహించిన గొప్పతనాన్నిగూర్చి పల్కుతున్నారు.

**ఆరెనక్కిన్ఱు నికర్ శొల్లిల్?, మాయనన్ఱైవర్ దెయ్వ**
**త్తేరినిల్ శెప్పియ కీతైయిన్, శెమ్మై ప్పొరుళ్ తెరియ**
**ప్పారినిల్ శొన్న ఇరామానుశనై ప్పణియుమ్ నల్లోర్**
**శీరినిల్ శెన్ఱు పణిన్దతు, ఎన్నావియుమ్ శిన్దైయుమే.**

మాయన్ = భగవంతుడు, అన్ఱు = కృష్ణావతారంలో, ఐవర్ = పంచపాండవుల, దెయ్వమ్ తేరినిల్ = అగ్నిదేవత ఇచ్చిన దివ్యరథంలో, శెప్పియ = అర్జునునకు ఉపదేశించిన, కీతైయిన్ = గీతాశాస్త్రంలోని, శెమ్మై పొరుళ్ = వాస్తవమైన అర్థం, పారినిల్= భూమిలో అంతటా, తెరియ శొన్న = భాష్యాన్నిరచించి, విశదంగా పల్కిన, ఇరామానుశనై, పణియుమ్ నల్లోర్ = సేవించే సత్పురుషుడు, శీరినిల్ = కల్యాణగుణంలో, శెన్ఱు = విచారించడం ఆరంభించి, ఎన్ ఆవి ఉమ్ శిన్దై ఉమ్ = నా ఆత్మ, మనస్సుకూడా, పణిన్దదు = సేవించినది, శొల్లిల్ = పల్కితే, ఎనక్కు ఇన్ఱు = గీతాభాష్యస్వారస్యం తెలిసిననాకు, ఆర్ నికర్ = ఎవరూ సాటిరారు.

గీతయొక్క అర్థాన్ని స్పష్టంగా తెలియలేక అన్యమతస్థులు మాఱుగా వ్యాఖ్యానించినందువల్ల గీతార్థసంగ్రహాన్ని రచించి ఆళవన్దార్ పూర్వపు అర్థాలను రక్షించారు. దానిలోని ఒక్కొక్క మాటయొక్క స్వారస్యం, అన్వయం, భావం, విషయవిభాగం, నిర్ణయరూపమైన సారాంశం - అనే వానిని సంగ్రహంగా వ్యాఖ్యానం ద్వారా స్పష్టంగా తెలిపి, ఋజువుగా నూలును పట్టి కొలిచి, తదనుగుణంగా గృహాన్ని నిర్మించి నట్లుగా, రచించిన శ్రీభాష్యకారుల భాష్యవైఖరిని చక్కగా తెలుపడంకూడా ఒక అవతార పురుషునివల్ల సాధ్యమైనది. ఆ రీతిని స్పష్టంగా గ్రహించి పల్కిన కూరేశులవంటివారిని ఆశ్రయించిన తరువాత నాకు ఎవరు సాటి?- అని అంటున్నారు.

**69.** అవ :- అందఱు ఉజ్జీవించడంకోసమే కదా! శ్రీకృష్ణుడు గీతను ఉపదేశించినది. శ్రీరామానుజులకు ముందు అందఱు ఎందుకు దానిని తెలియలేదు? అని అడిగేవారికి, భగవానుడు అందఱికి కరణకళేబరాలను అనుగ్రహించడం ఉజ్జీవించడం కోసమేకదా! శ్రీభాష్యకారులు నన్ను సంస్కరించడానికి ముందు ఉజ్జీవించే దారిని నేను ఎందుకు తెలిసికోలేక పోయాను? ఎందుకు అతడే తెలియజేయలేదు? అని ప్రతిప్రశ్నరూపంలో బదులివ్వాలనే ఉద్దేశ్యంతో పల్కుతున్నారు.

**శిందైయినోడుమ్ కరణంగళ్ యావుమ్ శితైన్దు, మున్నాళ్**
**అందముఱ్ఱాళ్న్దతు కండు, అవై యెన్దనక్కు అన్ఱరుళాల్**
**తంద అరఙ్గనుమ్ తన్ శరణ్ తన్దిలన్ తానతు తన్దు,**
**ఎందై యిరామానుశన్ వందెడుత్తన నిన్ఱిన్నైయే.**

మున్ నాళ్ = ప్రళయకాలంలో, శిన్దైయినోడు కరణఙ్గళ్ యావుమ్= బుద్ధి అనే కరణం, ఇంద్రియాలు అన్నీ, శిదైన్దు = దుర్బలమై, అన్దమ్ ఉఱ్ఱు = నశించి, ఆళ్న్దదు కణ్డు = జీవుడు లీనమై ఉండడం చూచి



బాధపడి, అవై = కరణకళేబరాదులను, అన్ఱు = ఆదిసృష్టిసమయంలో, ఎన్ తనక్కు = నాకు, తన్ద = ఇంతవరకు ఇస్తున్న, అరఙ్గన్ ఉమ్ = శ్రీరంగనాథునే, తన్ శరణ్ = తనను రక్షకునిగా, తన్దిలన్ = అనుగ్రహించ లేదు, ఎన్దై = నాతండ్రి, ఇరామానుశనే తాన్ వన్దు అదు తన్దు = రక్షణను ఇచ్చి, ఇన్ఱు = ఈ జన్మలో ఇపుడు, ఎన్నై ఎడుత్తనన్ = నన్ను రక్షించారు.

కొన్ని హేతువులున్నా అడ్డు ఉంటే కార్యం సఫలం కాదు. ఆ అడ్డును తీర్చేవారికి గొప్పతనం ఉండడాన్ని మఱుగుపరచడం వీలు కాదు. భగవద్గీత ఉన్నా పొంద లేని ఫలాన్ని భగవద్రామానుజులు దాని మూలం గానే లోకానికి పొందించారు కనుక, వీరికి అతిశయం (గొప్పతనం) కల్గించి - అని భావం.

**70.** అవ :- శ్రీరంగనాథునివలె భగవద్రామానుజులు ఆలస్యం చేయకుండా అనుగ్రహించేటట్లు తాము చేసిన విన్నపాన్ని తెలుపు తున్నారు.

**ఎన్నైయుమ్ పార్త్తు ఎన్నియల్వైయుమ్ పార్త్తు, ఎణ్ణిల్ పల్కుణత్త**
**ఉన్నైయుమ్ పార్క్కిల్ అరుళ్ శెయ్వతే నలమ్, అన్ఱి యెన్పాల్**
**పిన్నైయుమ్ పార్క్కిల్ నలముళతే యున్ పెరుమ్ కరుణై**
**తన్నై యెన్ పార్ప్పర్? ఇరామానుశా! ఉన్నై చ్చార్న్దవరే.**

ఇరామానుశా= శ్రీరామానుజా !, ఎన్నై ఉమ్ = మహాపరాధి అయిన నన్ను, పార్త్తు = బాగా గమనించి, ఎన్ ఇయ్వై ఉమ్ పార్త్తు = ఇకపై కూడా మాఱని రీతిలో జ్ఞానం, శక్తిలేకుండా ఉండే రీతిని గమనించి, ఎణ్ ఇల్ = లెక్కించి పూర్తి కాని, పల్ కుణత్తు = శక్తిజ్ఞానాదులను కల, ఉన్నై ఉమ్ పార్క్కిల్ = దేవరవారిని కూడా చూచినపుడు, అరుళ్ శెయ్వదే = నాకు వెంటనే అనుగ్రహం చేయడమే, నలమ్ = శ్లాఘ్యమై భాసిస్తున్నది, అన్ఱి ఎన్పాల్ = ఇంతేకాక, నావద్ద, పిన్నైయుమ్ పార్క్కిల్ =

దీనికి మించి పాపం చేరినా పోగొడతాము - అని కొంచెం కాలం ఊరికే ఉన్నప్పటికీ, నలమ్ ఉళదే = మీశక్తికి, జ్ఞానానికి గొప్ప ఉండవచ్చు, అయినా, ఉన్నై శార్న్దార్ = దేవరవారిని ఆశ్రయించినవారుకూడా, ఎన్ పార్ప్పర్ = ఏమని తలుస్తారు? అని చూడాలి.

మీ జ్ఞానశక్తులతో పోగొట్టవలసిన దోషాలు నావద్ద నిండుగా ఉన్నాయి. వీటికి మించి చేరినా, తమ శక్తి వాటిని పోగొట్ట గల్గినా, ఆ విధంగా ఆలస్యం చేస్తే (మీ) గొప్ప కరుణకు గల పేరు చెడిపోతుంది కదా! - అనే నా విన్నపానికి జాలిపడి నన్ను ఈనాడు ఉద్ధరించారని భావం. **"ఉళదే!"** అనే పదానికి **"ఉళదో?"** అనే అర్థంకూడా పొసగుతుంది. అపుడు, దీనికి పైన కూడా నావద్ద ఏదైనా గుణం కన్పిస్తుందా? అని ఆలస్యం చేస్తేనే ఏదయినా నావద్ద శక్తి ఉన్నదా! - అని భావం నీకు కూడా శక్తి లేదు- అని అంటున్నారు. **("ఉన్")** ఇత్యాదిగా.

**71.** అవ :- గొప్ప కరుణతో రక్షించడంకోసం నేనే ముందుకు రావాలి- అనే సంగతి సరే. అయినా, భక్తశిఖామణి అని, నావాడనని అభిమానించి నేను నిన్ను స్వీకరించినా, ఆచార్యప్రతిపత్తి కాలక్రమంలో తగ్గిపోతే, "వారితో నాకు సంబంధం లేదు'' అని ఆచార్యుడే భావించిటట్లయితే, ఇదే గొప్ప బ్రహ్మవేత్తల పట్ల అపచారమై, ఇద్దఱికీ కీడు జరుగుతుంది - అని భగవద్రామానుజులు భావిస్తున్నట్లుగా తలచి, తమకు అవధి లేని భక్తి ఉన్నదని తెలుపుతూ శ్రీరంగనాథుని పట్ల భక్తులనే భాగవతత్వమూలంగా, ఆచార్యత్వమూలంగా ఏర్పడిన దాస్యం క్రమంగా ప్రేమతో అధికమై, కల్యాణగుణాల అనుసంధానంతో భోగవర్ధకమై చక్కగా వర్ధిల్లినందువల్ల దానికి విరోధి అయిన పాపం అంతా తమ కటాక్షంతో తొలగిపోయి నందువల్ల నిలిచింది - అని అంటున్నారు.

**శార్న్దతెన్ శిన్దై ఉన్‌తాళిణైక్కీళ్, అన్బుతాన్ మికవుమ్**



**కూర్న్దతు అత్తామరైత్తాళ్‌కళుక్కు, ఉన్తన్ కుణంగళుక్కే**
**తీర్న్దతెన్ శెయ్‌కై మున్ శెయ్‌వినై నీ శెయ్‌వినై యతనాల్**
**పేర్న్దతు, వణ్మై ఇరామానుశా! ఎమ్ పెరుమ్ తకైయే.**

వణ్మై = వైలక్షణ్యంతో ఉదారులై, పెరుమ్ తల్లై = దోషాలను చూడని గొప్పతనాన్ని కలవారైన, ఎమ్ ఇరామానుశా, ఎన్ శిన్దై = నా చింతనలన్నీ, ఉన్ తాళ్ ఇణై కీళ్ = దేవరవారి శ్రీచరణాలు రెండిటిలో, శార్న్దదు = చేరింది, అన్బుతాన్ = భక్తి (ప్రేమ) అయితే, అ తామరై తాళ్‌కళుక్కు = ఆ పాదద్వయి పద్మాలవలె భోగ్యమైఉన్నందున వాటికోసమే, కూర్న్దదు = విడివడి ఉన్నదు(చేరింది), ఎన్ తన్ శెయ్‌కై = నా దాస్యవ్యాపారాలు అన్నీ, ఉన్ కుణఙ్గళుక్కే = దేవరవారి గుణాల అనుసంధానంతో వాటికే, తీర్న్దదు = వాటిలో ఉండే ఆశతో దేవరవారి కోసమే ఉన్నది, మున్ శెయ్ వినై = నేను ముందు చేసిన పాపాలన్నీ, నీశెయ్= దేవరవారిచే చేయబడిన, వినై అదనాల్ = వ్యాపారంతో, పేర్న్దదు = నన్ను విడచిపోయింది.

**"నీ శెయ్ వినై"** అని అన్నందువల్ల భగవద్రామానుజులు చేసిన కటాక్షం, కూరేశులను వీరిని సంస్కరించడంకోసం నియమించడం, సాక్షాత్తుగా చేసిన ఉపదేశం మొదలైనవానిని ఇక్కడ గ్రహించాలి. అముదనార్ కోసం భగవద్రామానుజులు ఆచార్యనిష్ఠగా ప్రపత్తిని అనుష్ఠించినవారైతే ఆ ప్రపత్తినికూడా గ్రహించవచ్చు. **"పోర్న్దదు"** అని అన్నందువల్ల **"తస్య ప్రియాః జ్ఞాతయః సుకృతమ్, అప్రియాః దుష్కృతమ్"** అనే రీతిలో పుణ్యాపాపాలు దేహాన్ని విడిచేటపుడు అనుకూల- ప్రతికూలురవద్దకు పోవాలని వేచి ఉండడాన్నిగూర్చి తెలుపబడింది.

**72.** అవ :- భగవద్రామానుజుల సంబంధం సాక్షాత్తుగా ఉన్నా, పరంపరగా ఉన్నా జీవులకు ప్రాక్తనకర్మలన్నీ తొలగిపోవడం నిశ్చయం. దానికి మించిన లాభం కల్గడాన్నిగూర్చి ఇకపై తెల్పుతున్నారు. అది ఏమంటే - తమ శ్రీభాష్యాదులను చక్కగా గ్రహించి అన్యమతాలను నిరాకరించి, వైదిక

మతాలలో సత్యమైన సిద్ధాంతాన్ని స్థాపించిన రీతిని అనుభవించి, తమను కీర్తించే ప్రాజ్ఞుల సమూహంలో నన్ను చేర్చారుకదా! ఏమి ఔదార్యం ! అని ప్రశంసిస్తున్నారు.

కైత్తనన్ తీయ శమయ క్కలకరై, క్కాశినిక్కే
ఉయ్త్తనన్ తూయ మఱైనెఱితన్నై, ఎన్ఱున్ని యుళ్ళమ్
నెయ్త్త అన్పోడిరున్దేత్తుమ్ నిఱైపుకళోరుడనే
వైత్తన నెన్నై, ఇరామానుశన్ మిక్క వణ్మై శెయ్తే.

తీయ శమయమ్ = పాడుమతాలను గ్రహించినవారై, కలకరై = కలహించేవారిని, వైత్తనన్ =నిరాకరించారు. కాశినిక్కు ఏ = భూమి అంతటా, తూయ = పరిశుద్ధమైన, మఱై నెఱి తన్నై = వేదమార్గాన్ని, ఉయ్త్తనన్ = సుస్థాపించారు, ఎన్ఱు ఉన్ని = అనే విధంగా చింతించి, ఆనందించి, ఉళ్ళమ్ నెయ్త్త = మనస్సు ద్రవించి, అన్పోడు = గొప్ప ప్రీతితో, ఇరున్దు = చాలా దీర్ఘంగా (చిరకాలం), ఏత్తుమ్ = స్తుతి చేసేవారైన, నిఱై పుకళోరుడన్ = కీర్తినిండిన మహాత్ములతో, ఎన్నై వైత్తనన్ = ఆ గోష్ఠిలో చేర్చారు, ఇతు ఇరామానుశన్ మిక్క వణ్మై = శ్రీరామానుజుల ఔదార్యగుణంయొక్క గొప్పతనం ఇది.

**"తూయ మఱై నెఱి"** అనే చోట **"తూయ"** అనే పదం కుదృష్టులచే యథార్థానికి మాఱుగా వ్యాఖ్యానింపబడ్డ సిద్ధాంతాలైన శుద్ధద్వైత-అద్వైత-అర్ధమీమాంసాది మార్గాలను నిరాకరించడంకోసం ప్రయోగింపబడింది. **"నిఱై"** ఇత్యాది - తమ గోష్ఠిలో చేర్చుకోవడం తగినది. తమను స్తుతించ గల్గినవారైన మహాజ్ఞానుల గోష్ఠులలో చేర్చారు. దీనికి విశేషమైన ఔదార్యమే కారణం నాదగ్గర ఏమీ లేదు - అని భావం.

**73.** అవ :- లోకంలో అంతటా తత్త్వహితపురుషార్థాలను యథాతథంగా తెలిపి, విపరీత బుద్ధిని తొలగించడాన్ని ప్రధానంగా గ్రహించి ఆయా



అధికారులకు తగిన అనుగ్రహం చేసేవారు భగవద్రామానుజులే -అని అంటున్నారు.

వణ్మైయినాలుమ్ తన్ మాతకవాలుమ్, మతి పురైయుమ్
తణ్మైయినాలుమ్ ఇత్తారణియోర్కట్కు, త్తాన్ శరణాయ్
ఉణ్మై నన్ ఞాన మురైత్త ఇరామానుశనై యున్నుమ్
తిణ్మైయల్లాల్ ఎనక్కిల్లై, మఱ్ఱోర్ నిలై తేర్న్దిడిలే.

తేర్న్దిడిల్ =పూర్తిగా విచారించినపుడు, ఎనక్కు = సారాసారవివేకి అయిననాకు, తన్ = తమకే చెందిన, వణ్మైయినాల్ ఉమ్ = ఔదార్యగుణ కారణంగాను, తన్ మా తకవాల్ ఉమ్ = దుఃఖం తీర్చే తమ దయ కారణంగా, మతి పురైయుమ్ = చంద్రునితో సాటి వచ్చే, తణ్మైయినాల్ ఉమ్ = పుష్టిని కల్గించే చల్లదనంతో, ఇ తారణియోర్కట్కు= భూమిలో ఉండే వారికి అందఱికి, తాన్ శరణ్ ఆయ్ = మేమే రక్షకులమై, ఉణ్మై = సత్యాన్ని, నల్ = క్షేమకరంగా అయిన, ఞానమ్ = వేదాంతజ్ఞానాన్ని, ఉరైత్త = ఉపదేశించిన, ఇరామానుశనై = భగవద్రామానుజులనే, ఉన్నుమ్ తిణ్మై అల్లాల్ = చింతించాలి- అనే దృఢమైన విశ్వాసం తప్ప, మఱ్ఱు ఓర్ నిలై = వేఱొక ప్రకారం, ఇల్లై = ఇష్టం కాదు.

మతాంతరాలలో ప్రవేశించినవారిని సంస్కరించడం, మొట్టమొదట యథార్థం జ్ఞానం అయినా ఏర్పడనీ - అనే దృష్టిలో. ఉపేక్షించకుండా ఈ విధంగా నడవడానికి (వారి) ఔదార్యమే కారణం. తాపత్రయంతో దహింపబడి, తమ సంసారదుఃఖం తీరాలని వేడినవారికి మఱు జన్మ లేకుండా మోక్షాన్ని పొందించడం కృప అనే మహాగుణంతో ఈ లోకంలో భగవద్భాగవతాచార్యవిషయమైన పలు విధకైంకర్యాలలో యోగ్యతకు తగినట్లు ప్రవేశించడంలో ఆసక్తిని కలవారికి, **"పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః"** (రసాత్మకుడైన సోముడనై ఓషధులను అన్నిటిని పోషిస్తాను.) అనే రీతిలో చంద్రుడు తన కిరణాల మూలం అమృతాన్ని

అనుగ్రహించి పుష్టిచేసేటట్లు, అన్నిటినీ అనుగ్రహిస్తారు. లోకంలో **"పాలిక పాలిక"** అని సత్పురుషుల సమృద్ధికోసం పరమై కాంతులు పాటు పడాలని తలచేవార్తై, మఠాలు, ఆలయాలువంటి స్థలాలను సంస్కరించి వాటి మూలంగా అందరిని పోషిస్తారు. ఇటువంటి పరమాచార్యులను విడిచి వేఱొక చోటకు నా మనస్సు నిలువదు - అని భావం.

**74.** అవ :- సాధుపరిత్రాణం, దుష్కృద్వినాశం, ధర్మసంస్థాపనం- అనే మూడు ప్రయోజనాలు భగవదవతారాలకు - అని అతడే గీతలో పలికాడు. ఆచార్యుల అవతారంకూడా ఇందుకోసమే. భగవద్రామానుజులవద్ద దీనిని గొప్పగా గమనించవచ్చు. మొదటిది మూడవది - అనే రెండు చోట్ల సమంగా ఉన్నా, రెండవ విషయంలో వ్యత్యాసం ఉన్నదనే సంగతి నిరాకరించి, అందులో భగవానునికంటే గొప్పవారని సూచిస్తున్నారు.

**తేరార్ మఱైయిన్ తిఱ మెన్ఱు, మాయవన్ తీయవరై**
**క్కూరాళి కొండు కుఱైప్పతు, కొండలనైయ వణ్మై**
**ఏరార్ కుణత్తు ఎమ్మిరామానుశన్ అవ్వెళిల్ మఱైయిల్**
**శేరాతవరై చ్చిఱైప్పతు, అప్పోతొరు శింధై శెయ్తే.**

మాయవన్ = ఆశ్చర్యకరలీలలను కలభగవంతుడు, తీయవరై = దుష్కర్మలను చేసేవారిని, మఱైయిన్ తిఱమ్ =వీరు వేదం పలికే మార్గాలలో దేనిలోను ప్రవేశించనందున, తేరార్ = తరించరు, ఎన్ఱు = అని తెలిసినపుడు (నిప్పు పీచే), కూర్ ఆళి కొణ్డు = తన పదునైన చక్రాయుధంతో, కుఱైప్పదు = ప్రాణాలను తీసే అపరాధరుచిని పోగొడతాడు, కొణ్డల్ అనైయ = మేఘంతో సాటి వచ్చే, వణ్మై = వైలక్షణ్యాన్ని కలవార్తై, ఏర్ ఆర్ కుణత్తు = గొప్పదైన జ్ఞానశక్త్యాదులను కల, ఎమ్ ఇరామానుశన్ = మన శ్రీరామానుజులయితే, అ ఎళిల్ = ఆ ఆశ్చర్యచేష్టితుని ఆదరాన్ని పొందిన, ప్రకాశాన్ని కల వేదమార్గంలో, శేరాదవరై = చేరకుండా దుష్కర్మలను చేసేవారిని, అ పోదు = ఆయా



శత్రువులకు తగినట్లు, ఒరు శిన్దై = ఒక విధమైన చర్చను, శెయ్దే = వారితో జరిపియే, ప్రాణాలను తీయకుండా, శిఱైప్పదు = ఆ శరీరంలో ఉండగానే వారిని సంస్కరిస్తారు.

**"కుఱైప్పతు"** అనే చోట **"శిఱైప్పతు"** అనే పదం, **"ఇతు"** అనేచోట **"ఇతువుమ్"** అని ఉంటే పొసగుతుందని భావించనక్కరలేదు. భగవానుడు వధించడం జన్మాంతరంలో వారి దుష్కృతాలు, దుర్గుణాలు తొలగడం కోసమే. భగవద్రామానుజులచే విరోధులు తామే తెలిసికొని తమ కృత్యాలను విడచి, ప్రకాశించే వేదమార్గాన్ని ఆశ్రయిస్తారు కనుక, వారు దండింపబడకపోయినా వారి దుర్గుణాలు, దుశ్చర్యలు తొలగి పోతాయి. ఆశ్చర్యచేష్టితుడైన భగవానుని పనిచేత జన్మాంతరంలో తగ్గిపోతాయి తప్ప, పూర్తిగా నశించవు. ఆచార్యుల కృత్యంచేత పూర్తిగా నశించి, ఈ జన్మలోనే వారు సత్ప్రవర్తనను పొంది బాగుపడతారు - అని భావం. శస్త్రపాణి అయిన భగవానుడు చేసేది శరీరనాశం, శాస్త్రపాణియై భగవద్రామానుజులు చేసేది సదుపదేశం. శత్రువుల మనస్సులో పడేటట్లు యుక్తులను పరిశీలించి, వాటి మూలంగా వేదరహస్యార్థాలను తెలిపినపుడు వినే కుతర్కవాదులుకూడా గర్వాన్ని విడచి, భగవద్రామానుజుల చల్లని స్వభావానికి, గుణసారత్వానికి వశపడి, సంస్కరింపడి తాము కూడా ఇతరులను సంస్కరించే దశను పొందుతారు. అందువల్ల నాకు భగవానుని కూడా విడచి భగవద్రామానుజు లను ఆశ్రయించే దార్ఢ్యం ఉన్నందువల్ల వేఱొక స్థితి లేదు - అని భావం.

75. అవ :- మాయాచేష్టితుడైన భగవానునకు, మహాచార్యునకు మధ్య గల వ్యత్యాసాన్ని వివరించడం ఎందుకో, దానిని వ్యంగ్యంగా చూపడంతో పాటుగా నోరార విశదంగా పల్కుతున్నారు.

**శెయ్త్తలై చ్చంగమ్ శెళుముత్త మీనుమ్, తిరువరంగర్**
**కైత్తలత్తాళియుమ్ శంగము మేన్ది, నఙ్గణ్ముకప్పే**

**మొయ్త్తలైత్తున్నై విడేన్ ఎన్ఱిరుక్కిలుమ్ నిన్ పుకళే**
**మొయ్త్తలైక్కుమ్ వన్దు, ఇరామానుశా! ఎన్నై ముఱ్ఱునిన్ఱే.**

నెయ్దల్ = సస్యక్షేత్రాలలో, శఙ్గమ్ = ప్రవాహ కారణంగా చేరిన శంఖాలు, శెళు ముత్తమ్ = గొప్ప ముత్యాలు, ఈనుమ్ = పుట్టే చోటు అయిన, తిరు అరఙ్గర్ = శ్రీరంగానికి నాథుడే అన్ని ముత్యాలను అలంకరించుకొని, కై తలత్తు = రెండు అరచేతులలోను, ఆళి ఉమ్ = సుదర్శనాన్ని, శఙ్గమ్ ఉమ్ = పాంచజన్యాన్ని, ఏన్ది = మనస్సు కలతను పొందించేటట్లు గ్రహించి, ఉన్నై విడేన్ ఎన్ఱు = నిన్ను- నన్ను విడచి ఉండేటట్లు చేయను - అని పల్కి, మొయ్త్తు = దట్టమై, అలైత్తు = బుద్ధిమొలైన వానికి చాంచల్యాన్ని కల్గించి, నమ్ కణ్ ముకప్పే = వారిని విడచి, శ్రీరామానుజులనే చూచే మన కంటికి ఎదురుగా, ఇరుక్కిలుమ్ = ఉన్నా, ఇరామానుశ నిన్ = శ్రీరామానుజా!, దేవరవారి, పుకళ్ వన్దు = కీర్తియే దరిచేరి, ముఱ్ఱుమ్ నిన్ఱు = చుట్టుకొని ఉండి, మొయ్త్తు = గాఢంగా, ఎన్నై అలైక్కుమ్ = నన్ను తన విషయంలో చేరుస్తుంది.

కావేరీనదీ సస్యభూములలో చేరిన శంఖాలు (ముత్యపుచిప్పలు) ఈనిన ముత్యాలను అన్నిటిని అలంకరించుకొని, ఆళ్వార్లను అందఱిని అభినిష్టులను చేయగల్గిన రీతిలో శ్రీసుదర్శనాన్ని, శ్రీపాంచజన్యాన్ని శ్రీహస్తంలో అలంకరించుకొని అన్యదృష్టిని కల్గిన నాకంటి ముందు ప్రత్యక్షమై నిలచి, "నిన్ను విడువను'' అనే మాటను పల్కి, భగవానుడు దానికి తగినట్లుగా నా మనస్సును చలింపజేసే కార్యాలను చేసేవాడై నిలచి ఎంతకాలం ప్రయత్నించినా, ఓ భగవద్రామానుజా!, ఈ దాసుడు మిమ్ములను విడువడు. త్రిదండ, కాషాయాలను అలంకరించుకొన్న దేవరవారి తిరుమేని, మనస్సుయొక్క గొప్పతనం నన్ను తమ విషయంలోనే నిలుపుతుంది. అందువల్లనే ఆచార్యుని సమీపంలో శిష్యులు భగవానుని నమస్కరించరు. అతనిచేకూడా అంతరాత్మగా భావించబడే ఆచార్యునకు అతడు అణగి మణగికదా ఉండాలి. "నిన్ను విడువను'' - అని అంటే, భగవద్రామానుజులను నీవు విడవబోవడం లేదు. వారితో నేను చేరి ఉన్నందువల్ల వారికి అధీనమై ఉండే స్థితిలో వారు నన్ను విడువకుండా గ్రహించడాన్ని నేను అడ్డుకోవడం లేదు. **"సాక్షాన్నారాయణో దేవః"** (నారాయణుడు మానవరూపాన్ని ధరించి, ఆచార్యుడై సంసారులను ఉద్ధరిస్తున్నాడు.) అనే రీతిలో వారుకూడా నీవే అయితే, వారితో నేను చేరడం నీతో చేరడమే అవుతుంది కదా- అని అంటాను. అయినా, ఈ రూపంతోనే చేరాలని అంటే, నీవు గ్రహించే రూపాలన్నీ అందఱికీ ఎల్లప్పుడు ఇష్టంగా ఉంటాయనే నియతి లేదు. ముత్యాలు, శ్రీసుదర్శనం, శ్రీపాంచజన్యం లేకపోతే చేరవు- అని తలచి కదా నీవు వాటిని గ్రహించావు. శస్త్రాన్ని విడచి, శాస్త్రాన్ని చేతిలో ధరించిన రూపాన్నే నేను అభిలషించాను. శరీరాన్ని రక్షించి, మనస్సును మాత్రం మార్చే ఆచార్యుని వీడి, శరీరాన్ని నశింపజేసే నిన్ను గ్రహించడం ఎందుకు? గొప్ప రూపంతో చేరడమే అందఱు అభిలషిస్తారు - అని ఈ రీతిలో సమాధానాన్ని ఇస్తాను. అని భావం. **"ఈనుమ్"** అనేది "శ్రీరంగానికి విశేషణం. ఇక, **"శెయ్త్తలై చ్చఙ్గమ్ ఈనుమ్, శెళుముత్తు క్కళై ఈనుమ్"** = తనకోసం సృష్టించుకొనే శ్రీరంగనాథుడు అని కూడా భావం. **"ఇరుక్కిలుమ్ నిన్ పుకళే"** - అతడు నా దరి చేరినా, నాకు అతని తిరుమేనికి మధ్యకూడా దేవరవారి కీర్తియే వ్యాపించి ఉన్నందువల్ల అది నన్ను తన వశం చేసికొంటుంది. భగవానుని కీర్తికి కంటే దేవరవారి కీర్తికి నన్ను ఆకర్షించే శక్తి ఎక్కువ ఉన్నది- అని భావం.

**76.** అవ :- "సమీపంలో ఎదురుగా ఉండే శ్రీరంగనాథుని సైతం విడచిపెట్టి ఆచార్యుని పట్ల అభినివేశాన్ని కల్గి ఉంటాను''- అని అంటున్నారు. ఈ మాట మాటిమాటికి శ్రీరంగనాథుని అనుభవించడం చేత, సమీపంలో ఉండడంచేత తర్వాతకూడా అనుభవించవచ్చు అనే దృష్టితోను చెప్పబడింది. ఈ శ్రీరంగనాథునకు మించినవానిని అనుభవించే అవకాశం కల్గినపుడు వాటిని విడువవద్దు సుమా- అని

అంటే, దానికి అముదనార్ బదులిస్తున్నారు.

**నిన్ఱ వణ్ కీర్త్తియుమ్ నీళ్ పునలుమ్, నిఱైౖ వేంగడప్పొ**
**ఱ్కున్ఱముమ్ వైకుందనాడుమ్ కులవియ పాఱ్కడలుమ్,**
**ఉన్ఱనక్కు ఎత్తనై యిన్బమ్ తరు మున్నిణైమలర్త్తాళ్**
**ఎన్ఱనక్కుమతు, ఇరామానుశా! ఇవై యీన్దరుళే.**

ఇరామానుశా = భగవద్రామానుజా!, నిన్ఱ = స్థిరమైన, వణ్ కీర్త్తి ఉమ్ = విలక్షణమైన కీర్తి, నీళ్ పునల్ ఉమ్ = దీర్ఘంగా ప్రవహించే కొండవాగులు, నిఱైౖ = నిండి ఉండే, వేఙ్గడమ్ = శ్రీవేంకటాచలమనే, పొన్కున్ఱమ్ ఉమ్ = అప్రాకృతమైన కొండ, వైకున్దనాడు ఉమ్ = శ్రీవైకుంఠలోకం, కులవియ = పొగడబడే, పాల్ కడలుమ్ = క్షీరాబ్ధి, ఎత్తనై ఇన్బమ్ = ఎంతటి ఆనందాన్ని, ఎన్ తనక్కు = దేవరవారికి, తరుమ్ =ఇస్తున్నావో, ఉన్ ఇణై తాళ్ మలర్ = దేవరవారి, ఒకదానితో ఇంకొకటి సాటి వచ్చే శ్రీచరణపద్మాలు, ఎన్తనక్కు = నాకు, అదు = అంతటి ఆనందాన్ని ఇస్తాయి. అందువల్ల, ఇవై =ఈ శ్రీచరణాలనే, ఈన్దు అరుళ్ = ఇచ్చి అనుగ్రహించాలి.

వేదాది సకలప్రమాణాలలోను ప్రసిద్ధమైది, ఎప్పటికీ స్థిరమైన కీర్తిని కల్గినది, అన్ని దేశాలనుండి బృందాలుగా వచ్చిన జనం సేవింపబడేది, ఇక్కడ ఉండే కావేరి వంటి పలు తీర్థాలు పొంగి ప్రవహిస్తున్నది, పరమపదంనుండి వరాహమూర్తిచే కొనిరాబడినది, అన్ని పాపాలను పోగొట్టడంవల్ల, మోక్షం, భోగం అన్నిటినీ అనుగ్రహించడంవల్ల తిరువేంకటాద్రి అని పిలువబడే తిరుమలను దర్శించడంలో దేవరవారికి ఎంత ఆనందమో, ఆ పర్వతానికి మూలస్థానం అయిన శ్రీవైకుంఠం అనే నిత్యవిభూతిని దర్శించడంలో ఎంతటి ఆర్తిమూలమైన ఆనందమో, విభవం, అర్చారూపం మొదలైన - అన్ని అవతారాలకు ఇక్కడే మూలస్థానమై, దేవతలచేత, ఋషులచేత సేవింపబడే పాలకడలిలో తమకు ఎంతటి ఆనందమో, ఇటువంటి అన్ని చోట్ల చేరినట్లయితే ఎంతటి



ఆనందమో, అంతటి ఆనందం దేవరవారి శ్రీచరణాలు రెండిటిని మాత్రం పొందితే నాకు కల్గుతుంది. అందువల్ల నాకు ఈ దివ్యదేశాలు వద్దు, వీటినే అభిలషిస్తాను. వీటినే అనుగ్రహించాలి.

77. అవ :- భగవానుని కంటే గొప్పగా శ్రీరామానుజులను గూర్చి పూర్వం పల్కిన విషయాన్ని ఇంకొక రీతిలో విస్తరించి పల్కుతున్నారు.

**ఈన్దన నీయాత ఇన్నరుళ్, ఎణ్ణిల్ మఱైక్కుఱుంబై**
**ప్పాయ్న్దన నమ్మఱై ప్పల్పొరుళాల్, ఇప్పడి యనైత్తుమ్**
**ఏయ్న్దనన్ కీర్త్తియినాలెన్ వినైకళై వేర్ పఱియ**
**క్కాయ్న్దనన్, వణ్మై యిరామానుశఱ్కెన్ కరుత్తినియే?**

ఎణ్ణిల్ = విచారించి చూస్తే, ఈయాద= ఎవరి చేత ఇవ్వబడని, ఇన్ అరుళ్ = మధురమైన అనుగ్రహాన్ని, ఈన్దనన్ = శ్రీభాష్యాదులను అనుగ్రహించడంవల్ల ఇచ్చారు, అమ్ మఱై = అందమైన (సత్యమైన) వేదాలు పల్కిన, పల్ పొరుళాల్ = నాల్గు పురుషార్థాలను చూపి, మఱై కుఱుమ్బై = ఆభాసమైన ఆగమాలను, పాయ్న్దనన్ = గెంటివేశారు. (నిరసించారు), ఇ పడి అనైత్తుమ్ = ఈ భూమిని అంతటిని, కీర్త్తియి నాల్ = తన కీర్తితో, ఏయ్న్దనన్ = వ్యాపించారు, ఎన్ వినైకళై = నా ప్రాక్తన కర్మలను, వేర్ పఱియ = అహంకారాదులనే వేళ్ళతో నశించేటట్లు, కాయ్న్దనన్ = ఆక్రమించి నశింపజేశారు, వణ్మై = ఔదార్యమే మూర్తీభవించిన, ఇరామానుశఱ్కు = భగవద్రామానుజులకు, ఇని ఎన్ కరుత్తు = ఇంకా ఏమి మనస్సులో ఉన్నదో?

భగవానుడు తానే సాక్షాత్తుగాను, ఆవేశరూపంగాను, ఇతరుల ద్వారా పలు పలు ప్రబంధాలను రచింపజేసి, ఉపదేశించినప్పటికీ ఫలాన్ని పొందనివారిని అనుగ్రహించడంకోసం ముందుకు వచ్చి, భగవద్రామానుజులు అతని ప్రయత్నానికి ఒక ప్రయోజనాన్ని కల్గించారు. దీనినిగూర్చి తరువాతకూడా పరిశీలిద్దాం. భగవానుడు బౌద్ధ-జైన- పాశుపతాది పలు సిద్ధాంతాకు తానే కారణమైనాడు. పలువురు జీవులను వంచించడంకూడా

అతని కృత్యమైనది. ఈవిధంగా వేదార్థాన్ని మఱుగుపరచాడు అతడు. కానీ, భగవద్రామానుజులు వారి ఆభాసాగమాలకు, అందమైన చతుర్వేదాలకు ఉండే వ్యత్యాసాన్ని వివరించి, వీటి (వేదాల) అర్థాలలోని గొప్పతనాన్ని ఋజువుగా పల్కి వాటిని (అపార్థాలను) రూపుమాపారు. అతడు, "న తస్య ప్రతిమా అస్తి తస్య నామ మహద్యశః" (అతనికి సాటి ఎవరూ లేరు, అతని యశస్సు గొప్పది) అనే రీతిలో సాటి లేని గొప్ప కీర్తిని కలవాడుగా వేదాలలో పొగడబడుతున్నాడు- అనేది వాస్తవం. కీర్తితో పాటు నిందకూడా అతని విషయంలో ఉన్నది. భగవద్రామానుజుల కీర్తి భూమండలం అంతా వ్యాపించింది. త్రివిక్రమావతారంలో తిరుమేనిలో అంతటా వ్యాపించి అన్నీ తన సొత్తే - అని అతడు స్థాపించాడు. ఎందుకో మఱి ఈ ఆయాసం. తన కీర్తి వ్యాపించలేదే -అనే వ్యాకులంతో కావచ్చు. వీరి కీర్తి ఏ అడ్డు అదుపు లేకుండా అంతటా వ్యాపించింది. ఇది అంతా అటు ఉండనీ. నేను శ్రీరంగనాథుని ఆలయంలో ఎంత కాలంగా ఉన్నాను! అతడు నా కర్మలను నశింపజేశాడా? కాని వీరు వాటిని సమూలంగా నశింపజేశారు. ఈ వాస్తవాన్ని గమనించినపుడు వీరి మూలంగా ఇంకా హితాలున్నాయి - అని తలుస్తున్నాను - అని భావం. 'మఱైక్కుఱుమ్బు"- "కుఱుమ్బు" అంటే తగని దానిని తగినది - అని పల్కడం. అసత్యాలైన తత్త్వధర్మాలను సత్యాలుగా దర్శింపజేసే అన్యాగమాలు "కుఱుమ్బుకళ్". నిజానికి ఇవి ఆగమాలు కావు. అనాదిగా అధ్యయనం చేయబడేవి మాత్రమే వాస్తవమైన ఆగమాలు. "ఇప్పడి" - ఈ భూమి - అని అర్థం.

**78.** గడచిన పాశురంలో తమ కర్మలను శ్రీరామానుజులు నశింప జేశారని అన్నారు. దానికి మించి తమకు కల్గించిన ఇష్టప్రాప్తినిగూర్చి పల్కి, "ఎన్ కరుత్తిని" (ఇంకా నా మనస్సులో ఉన్నదా) అనే దానిని ఒక విధంగా వివరిస్తున్నారు. భగవానుడు ఆగమాభాసాలతో వంచిస్తున్నాడే! అది కొందఱి విషయంలో జన్మాంతరంలో మంచికి కారణం కావచ్చు. లేక, "**ఆసురీం యోని మాపన్నాః మూఢా జన్మని జన్మని, మామ ప్రాప్యైవ**



**కౌంతేయ! తతో యాంత్యధమాం గతిమ్**" (అర్జునా! మూఢులు ప్రతిజన్మలో ఆసురమైన జాతులలో జన్మించి, నన్ను పొందలేక, అధమ గతిని చేరుతున్నారు.) అనే రీతిలో కొందఱి విషయంలో నశింప జేయడానికే అవుతుంది. భగవద్రామానుజులుకూడా వంచించడం ఉన్నది. అది, బాలురను చూచి "పాలు మంచి పానీయం. తాగితే తర్వాత కూడా కేశాలు పెరుగుతాయి''. అని ఉపదేశిస్తే, కేశాలు వృద్ధికాకపోయినా హితంకోసమే అవుతుంది కదా. "అదే రీతిలో, జీవులహితంకోసమే అనేది ఈ జన్మలోనే కొన్ని నాళ్ళలో తెలిసివస్తుంది- అని వంచనలలోని తారతమ్యాన్ని భావించి, అనుగ్రహిస్తున్నారు. అంతేకాక, "అముదనార్! మీరు ఈవిధంగా భగవానుని విడచి, మీవలెనే ఒక జీవుడైన భగవద్రామానుజు లనే ఆశ్రయిస్తే ప్రామాణిక మార్గాన్ని విడచి, అన్యుని ఆశ్రయించి నట్లవుతుంది కదా! ఈ స్థితికి తీసుకొనివచ్చిన భగవద్రామానుజులను విశ్వసించడం న్యాయమవుతుందా! - అని అంటే దానికి సమాధానాన్ని మనస్సులో భావించి పల్కుతున్నారు.

**కరుత్తిల్ పుకున్దుళ్ళిల్ కళ్ళమ్ కళఱ్ఱి, క్కరుతరియ**
**వరుత్తత్తినాల్ మిక వంజిత్తు, నీ యిన్ద మణ్ణకత్తే**
**తిరుత్తి త్తిరుమకళ్ కేళ్వనుక్కాక్కియపిన్ ఎన్నెంజిల్**
**పొరుత్తప్పడాతు, ఎమ్మిరామానుశ! మఱ్ఱోర్ పొయ్ ప్పొరుళే.**

ఎమ్ ఇరామానుశరే = దేవరవారు, కరుత్తిల్ పుకున్దు= నా మనస్సులో ప్రవేశించి, ఉళ్ ఇల్ = మనస్సును ఇల్లుగా చేసికొని స్థిరంగా నిలచిన, కళ్ళమ్ = మోసాన్ని, చౌర్యకృత్యాన్ని, కళఱ్ఱి = పోగొట్టి, కరుత అరియ = భావించడానికి వీలుకాని, వరుత్తత్తినాల్ = ప్రయాసతో (లేక) జీవుడు చెడిపోతున్నాడే! అనే నిర్వేదంతో, మిక వఞ్జిత్తు = మూఢుడైన నా ఇష్టప్రకారం నడచు కొనేటట్లుగా నటించి, ఇన్ద మణ్ అకత్తే = విపరీతజ్ఞానానికే పనికి వచ్చే ఈ భూమిలోనే, నీ తిరుత్తి = దేవరవారు

నన్ను సంస్కరించి, తిరు మకళ్ కేళ్వనుక్కు = శ్రియఃపతి అయిన శ్రీరంగనాథునకు, ఆళ్ ఆక్కియ పిన్ = ఎప్పటికీ దాసునిగా నన్ను నేను తెలిసికొనేటట్లు చేసిన తరువాత, మఱ్ఱు = దీనికంటే వేఱయిన, ఓర్ = సాటి లేని, మిక్కిలి చెడును కల్గించే, పొయ్ ప్పొరుళ్ = ఐక్యం, స్వతంత్రం, అన్యశేషత్వం -అనే అసత్యమైన అర్థం, ఎన్ నెఞ్జిల్ = శుద్ధమైన నా మనస్సులో, పొరుత్తప్పడాదు = ఎవరివల్ల పొసగేటట్లుగా చేయడం సాధ్యం కాదు.

**(మిక వఞ్జిత్తు)** - కేదాండపట్టిస్వామి అనే ద్వితీయరంగరామానుజ దేశికన్ స్వామి సన్నిధిలో ప్రపత్తి చేయాలని మేల్నాడు ప్రాంతంనుండి ఒకరు వచ్చారు. వారివద్ద వైకుంతలోకం లోని వైభవాన్నిగూర్చి వర్ణించే టపుడు, వారు అక్కడ రాగులు దొరుకుతుందా? - అని స్వామిని అడిగారట. అపుడు స్వామి వారిని చూచి రాగులు అన్నం తినే అలవాటుతో దానితో గల మోహంతో వీరు ఈ విధంగా అడుగుతున్నారని గ్రహించి, "రాగులు తినకూడదు. తినవద్దు'' అని అపుడే అనడం ఇష్టం లేక, "మీరు రాగిజావను తీసికొని భగవానుడు ఆరాధనం చేయాలని అనుకొంటే, అక్కడ ఒక్కొక్క రాగిగింజ మినపగింజకంటే ఎక్కువ పరిమాణంలో విరివిగా లభిస్తుంది'' - అని చాతుర్యంతో పలికారట. నిజానికి రాగులుకూడా అక్కడ ఉండి ఉండవచ్చు. "అక్కడ ఉండే గొప్ప వస్తువులను చూచినపుడు మీరే రాగులను కావాలని కోరరు'' అని కూడా అనలేదు. ఇదే రీతిలో సమయోచితంగా శిష్యబుద్ధికి అనుగుణంగా కొన్ని కొన్ని సమయాలలో ఆచార్యులు పలికే మాటను వంచనగా గ్రహించవచ్చు. "ప్రకృతిమండలాన్ని విడచిపోవడానికి మనస్సు రాలేదే. భగవానునివద్దకు చేరితే పైలోకానికి అపద్యంకదా'' అని భయపడితే, భయపడవద్దు. ప్రకృతిమండలంలో చిరకాలం ఉండడానికే అతనిని ఆశ్రయించాలి. మార్కండేయుడు అనే పదహారు ఏండ్లవాడుగానే ఉండాలని కోరినవాడు విష్ణువుయొక్క శ్రీచరణాలను చేరికదా దానిని



పొందాడు- అనే ఇటువంటి వంచనతో కూడిన మాటలు- అని భావం.

**(తిరుమకళ్కేళ్వనుక్కే)** - భగవానుని భక్తులు ఆప్తులు - అనాప్తులు- అని రెండు విధాలుగా ఉంటారు. ఆచార్యులు ఆప్తవర్గంలోనివారు. భగవానునకుకూడా వారి పట్ల నమ్మిక ఉంటుంది. వారు ఉపదేశించే టపుడు "శ్రియఃపతి శ్రీచరణాలో దాస్యాన్ని చేయి'' అని అంటారే తప్ప, "అతనిని విడచి నాకే దాసుడవై ఉండు'' అని పలుకరు. దేవతాంతరాలు,- **"పరమాత్మని గోవిందే భక్తిముద్వహతాం నృణామ్, సంసారన్యూనతా భీతాః త్రిదశాః పరిపంథినః"** అనే రీతిలో భగవద్భక్తిని పొందకుండా తమవద్దనే ఉండేటట్లు ఉపదేశిస్తారు. అందువల్ల వారు అనాప్తులు. కొన్ని సమయాలలో చక్కగా కూడా ఉపదేశించవచ్చు. కాని, నమ్మడం సాధ్యం కాదు. ఈ విధంగా ఆచార్యులు ఉపదేశించేటపుడు భగవానునిగూర్చిన శేషత్వాన్ని నేను విడచిపెట్టాను. అనడం ఏవిధంగా ! శేషత్వమనే తీగ ఆచార్యశేషత్వపర్యంతంగా వృద్ధి అయితే, ముందు భాగం అయిన భగవచ్ఛేషత్వం వృద్ధియై కఠినంగా ఉంటుంది. బాగా- అని చెప్పవలసి ఉంటుందని భావం. దీనినే పాశురంలో **"కళ్ళమ్ కళత్తి"** అని అన్నారు. **"కళ్ళమ్"** అంటే - చౌర్యం. ఇతరుల సొత్తును తనది అని భావించి గ్రహించడం. **"యోఽన్యథాసంతమాత్మాన మన్యథా ప్రతిపద్యతే, కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా"** (భగవంతునకు చెందిన సొత్తు అయిన ఈ ఆత్మను తన సొత్తుగా భావించినవాడు ఏ పాపాన్ని చేయలేదు?) అనేదే. భగవానుని సొత్తు అయిన తనను స్వతంత్రంగా భావిస్తే అతనికి శేషం కాదని భావించడమే అవుతుంది. అది చౌర్యమే. దీనిని ఆచార్యుడు ఉపదేశంద్వారా పోగొడతాడు. దేవతాంతరశేషత్వం లేదనికూడా ఉపదేశిస్తాడు. ఆచార్యుడు జీవుడైనా ఔపాధికంగా, అంటే- ఆచార్యుడు అయిన కారణంగా అతనిపట్ల కూడా శేషత్వమున్నది. ఇది తరువాత ఏర్పడినది అయినా తరువాత పరమపదంలోకూడా అనువర్తించి శాశ్వతమై ఉంటుంది. అందువల్ల ఇది కూడా పూర్వపు అర్థమే.

**79.** అవ :- తనను స్వతంత్రమని తలిస్తే తప్పు - అని పల్కి లక్ష్మీదేవికి, ఆమె నాథునకు మాత్రమే ఆత్మలు శేషమనే ఉపదేశం చేయబడింది. కొందఱు ప్రమాణవాక్యాలకు అసత్యాలైన అర్థాలను పల్కి, ఈ జ్ఞానంతో సత్ఫలం కల్గుతుందని కూడా అంటారు. ఆ ఫలం కూడా అసత్యమే. అద్వైతులు జీవుడు, పరబ్రహ్మం ఒకటే అని, జగత్తు మిథ్య అని పల్కి, "ఈ జ్ఞానంతో తరువాత జీవుడు బ్రహ్మగా అవుతున్నాడు. ఇదే మోక్షం" అని అంటున్నారుకదా. దీనినే నమ్మి దీనిని ఉపదేశించేవారివద్ద గుంపులు గుంపులుగా జనం చేరుతున్నారే. అదే రీతిలో ఇంకా, కొందఱు, ఆత్మస్వతంత్ర్యమనేది వాస్తవమైనా, శివునివంటి దేవతకే శేషమని అంటున్నారు. ఈ రీతిలో వేఱు దేవతను దైవంగా, పరదేవతగా గ్రహించి మోహిస్తున్నారు కదా! దీనివల్ల వాస్తవాన్ని తెలియకుండా తపిస్తున్నారు కదా! అని దీనిలో బాధపడుతున్నారు.

**పొయ్యై చ్చురక్కుమ్ పొరుళై త్తురన్దు, ఇన్ద ప్పూతలత్తే**
**మెయ్యై ప్పురక్కుమ్ ఇరామానుశన్ నిఱ్క, వేఱు నమ్మై**
**ఉయ్య క్కొళ్ళవల్ల తెయ్వమ్ ఇఙ్గు యాతెన్ఱులర్న్దు అవమే**
**ఐయప్పడానిఱ్పర్, వైయత్తుళ్ళోర్ నల్లఱివిళన్దే.**

పొయ్యై = అసత్యమైన శివమోక్షాన్ని, శురక్కుమ్ = ఇస్తుందని ఇతరులు గ్రహించిన, పొరుళై = అసత్యమైన వేదార్థాన్ని, తురన్దు = అప్రామాణికమని నిరసించి, ఇన్ద పూతలత్తు ఏ = ఆ మతాలు వ్యాపించిన ఈ భూమండలంలోనే, మెయ్యై = సత్యమైన మోక్షాన్ని తత్త్వాన్ని, పురక్కుమ్ =రక్షిస్తున్న (స్థాపిస్తున్న), ఇరామానుశన్ నిఱ్క = శ్రీరామానుజులు ఆచార్యులుగా ప్రకాశించేటపుడు, వైయత్తు ఉళ్ళోర్ = భూమిలో ఉండేవారు, నమ్మై ఉయ్య క్కొళ్ళ = ఉజ్జీవించేటట్లు మనలను స్వీకరించ గల వేఱు సమర్థమైన, వేఱొక, దెయ్వమ్ ఇఙ్గు యాదు ఎన్ఱు = ఈ లోకంలో దేవత ఏది? అని విచారించి, ఉవర్న్దు = ఏమీ తెలియలేక, నల్ అఱివు ఇళన్దు = శ్రీరామానుజుల వల్ల కల్గిన జ్ఞానాన్ని



కూడా పొందలేక, అవమే ఐయప్పడా నిఱ్పర్ ఏ = వ్యర్థంగా సందేహ పడుతున్నారు.

పలు అంతర్విభాగాలను కల అద్వైతం, శైవం- అనే మతాలకు చెందినవారు అంతట వ్యాపించి ఉన్నందువల్ల లోకం ఉజ్జీవించలేదు- అని వాటిని అసత్యాలని స్థాపించి, వాస్తవాన్ని భగవద్రామానుజులు స్థాపించారు. దీనినితర్వాత కూడా పలువురు ప్రాచీనమతాలలో ఉండే దోషాలను తెలిసినా సందేహపడుతున్నారు. దానికి కారణం- భగవద్రామానుజుల ఉపదేశాలను నిశితంగా పరిశీలించకపోవడమే. వేఱు దైవాలన్నీ తాము ఉజ్జీవించడంకోసం మనలను గ్రహిస్తాయి. మనం ఉజ్జీవించడంకోసం మనలను గ్రహించేవాడు, అవాప్తసమస్తకాముడైన పద్మావతీజానియే - అని తెలియాలి. ఇది భగవద్రామానుజుల ఉపదేశాన్ని ఉద్దేశించి స్పష్టంగా గ్రహించాలి. తెలిస్తే శ్రీరామానుజులే సమర్థులైన దైవమనే నమ్మికకూడా కల్గుతుంది. అందువల్ల దోషం లేదు. శ్రియః పతి దైవమనే సత్యాన్ని ఉపదేశం చేసినందువల్ల కదా కీర్తించడం. దీనిని విడచి నేనే దైవమని ఉపదేశించేవారిని దైవంగా గ్రహించడం తగునా? ఎందుకో మఱి వీరికి భ్రమ!

"మెయ్యై ప్పురక్కుమ్" అనే దానికి, "యథార్థం సర్వవిజ్ఞానమ్" అని భగవద్రామానుజులు స్థాపించినదానిని విషయంగా గ్రహిస్తారు. ఆ స్థానం ప్రాభాకర మీమాంసకులుకూడా అంగీకరించినదే. నాథమునులు స్థాపించినదానిలో దానికంటే కొంచెం విశేషం కొన్ని విషయాలలో ఉన్నా, భగవద్రామానుజుల ఆ స్థాపనాన్ని బట్టి, లోకంలో ఎవరికి ఏభ్రాంతి ఉన్నా, అన్నీ యథార్థజ్ఞానమే; జ్ఞానాలలో యథార్థం కానిది ఏదీ లేదు- అని సిద్ధించినందువల్ల ఏ మతం అయినా గ్రహించదగినదే- అనే విపరీతబుద్ధి కల్గుతుంది. ఆ విషయం వేఱు. దీనివల్ల ఒకటి గ్రహించ వచ్చు. భ్రాంతిలో విషయమైన వస్తువు అసత్తు - అని, అనిర్వచనీయం-

అని ఇతరులు పల్కినపుడు, "ఆ విధంగా కాదు, అది సత్యమే'' అని అన్నారు. అయితే, అది వేఱు చోట్ల ఉండి యథార్థం కావచ్చు. ప్రత్యక్షభ్రాంతిలో మాత్రం ఆ ద్రవ్యం ఎదురుగా ఉన్నది అవుతుంది- అని అన్నారు, నాథమునులను అనుసరించిన యతిరాజులు. అది ఉండనివ్వండి. ఇక్కడ చెప్పదలచినది ఏమంటే- రామానుజులు స్థాపించిన తత్త్వహితపురుషార్థాలే యథార్థాలు, మిగిలినవి అయథార్థాలు, అప్రామాణికాలు అనేదే - అని తెలియాలి.

**80.** అవ :- భ్రాంతిపడేవారు భ్రాంతి పడనీ; మనకు లభించినది శ్రీరామానుజుల దాసుల దాస్యం; శ్రీరామానుజుల దైవం అయిన శ్రీరంగనాథుని దాస్యం, అన్నిటికంటే ప్రయోజనమైన పరమాచార్యులైన వారి కైంకర్యం - అని కొన్ని పాశురాలతో అముదనార్ పల్కి గొప్ప ఆనందాన్ని పొందుతున్నారు.

**నల్లార్ పరవు మిరామానుశన్, తిరునామమ్ నమ్బ**
**వల్లార్ తిఱత్తై మఱవాతవర్కళ్ యవర్, అవర్క్కే**
**ఎల్లా విడత్తిలు మెన్ఱు మెప్పోతిలుమ్ ఎత్తొళుమ్బుమ్**
**శొల్లాల్ మనత్తాల్, కరుమత్తినాల్ శెయ్వన్ శోర్విన్ఱియే.**

నల్లార్ = బ్రహ్మజ్ఞానానుష్ఠానాలు కల్గినవారిచే, పరవుమ్ = కీర్తింపబడే, ఇరామానుశన్ = శ్రీరామానుజుల, తిరు నామమ్ = తిరునామాల వైభవాన్ని, నమ్బవల్లార్ = విశ్వసించడానికి తగిన జ్ఞానాన్ని, శక్తిని కలవారి, తిఱత్తై = నడవడికలను, యవర్ మఱవాదవర్కళ్ = ఎవరు భావించిన రీతిలో ఉంటారో, అవర్క్కే = ఆ దాసులకే, ఎల్లా ఇడత్తిల్ ఉమ్ = సర్వదేశాలలో, ఎన్ఱుమ్ = సర్వకాలాలలో, ఎ పోదిలుమ్ = వారు అపేక్షించినపుడు కూడా, ఎ తొళుమ్బు ఉమ్ = ఎటువంటి కైంకర్యం అయినా, శొల్లాల్ మనత్తాల్ కరుమత్తినాల్ = వాక్కుతో, మనస్సుతో, శరీరంతో, శోర్వు ఇన్ఱి శెయ్వన్ = ఆలస్యం చేయకుండా చేస్తాను.



శ్రీరామానుజులనే నామాన్ని విన్నపుడే ప్రతివాదులు అందఱు ఆర్భాటాన్ని విడచి ఆవలివైపుకు తొలగి పోతున్నారు. దీనిని - **"వికల్పాటోపేన శ్రుతిపథమశేషం విఘటయన్ యదృచ్ఛానిర్దిష్టే యతినృపతిశబ్దే విరమతి, వితండాహం కుర్వత్ ప్రతికథకవేతండవ్రు తనావియాతవ్యాపార వ్యతిమథనసంరంభకలహః"** (పలు విధాలైన వాదాలతో పటాటోపం చేసేవారి వాదాలన్నీ రామానుజనామాన్ని ఉచ్చరించ గానే అంతరించి పోతున్నాయి)అని దేశికులు అనుగ్రహించారు.

**81.** అవ :- భగవత్కైంకర్యం కంటే భాగవతకైంకర్యం గొప్పది అయినా, శ్రీరంగనాథుని సన్నిధిలో అన్నీ ఋజువుగా నిర్వహించే అధికారాన్ని పొందినందువల్ల, అతనిని సేవించాలని వచ్చే భాగవతులకు అందఱికి శ్రీరంగనాథుని సేవను అనుగ్రహించేటట్లు సమయానికి తగిన రీతిలో లోపం లేకుండా నడపడంలో పలు భాగవతుల కైంకర్యం కూడి ఉన్నందు వల్ల దానిని విడచి ప్రత్యేకంగా భాగవతకైంకర్యమే చేయకూడదు - అనే ఆచార్యునియమనంవల్ల దానినికూడా విడువను - అని అముదనార్ అంటున్నారు.

**శోర్విన్ఱి యున్ఱన్ తుణైయడిక్కీళ్, తొండుపట్టవర్పాల్**
**శార్విన్ఱి నిన్ఱ ఎనక్కు, అరంగన్ శెయ్యతాళిణైకళ్**
**పేర్విన్ఱి యిన్ఱు పెఱుత్తుమ్ ఇరామానుశ! ఇని యున్**
**శీరొన్ఱియ కరుణైక్కు, ఇల్లై మాఱు తెరివుఱిలే.**

ఉన్ తన్ = దేవరవారి, తుణై అడి కీళ్ = ఒకదానికి ఇంకొకటి సహాయమైన శ్రీచరణాలలో, శోర్వు ఇన్ఱి = ఆలస్యంలేకుండా, తొణ్డు పట్టవర్ పాల్ = కైంకర్యాన్ని చేసేవారి వద్ద, శార్వు ఇన్ఱి = వేఱు ఆశ్రయం అక్కరలేనట్లు, నిన్ఱ ఎనక్కు = భగవత్కైంకర్యాన్ని విడచిపెట్టాలని నిశ్చయించుకొన్న నాకు, అరఙ్గన్ = శ్రీరంగనాథుని, శెయ్య తాళ్ = ఎఱ్ఱని శ్రీచరణాలను, ఇణైకళ్ = ద్వంద్వాన్ని, పేర్వు ఇన్ఱి = విశ్లేషించని

రీతిలో, ఇన్ష్టు = భాగవతకైంకర్యం లభించిన తరువాత కూడా, పెఱుత్తుమ్ = పొందేటట్లుచేసిన, ఇరామానుశ = శ్రీరామానుజా!, ఇని ఉన్ = దీనికి మించి దేవరవారి, శీర్ ఒన్ఱియ = గొప్పతనం పొందికగా కల, కరుణైక్కు= కృపకు, తెరివు ఉఱిల్ = ఆలోచనలో ప్రవేశిస్తే, కూఱు ఇల్లై = తగిన ప్రతిక్రియలేదు, ఒప్పిల్లై = సాటి కూడాలేదు.

దేవరవారి శ్రీచరణాలకు రెండిటికి కైంకర్యాన్ని చేయడమే పురుషార్థంగా కల్గిన కూరేశులు మొదలైనవారికి సేవను చేస్తూ, భగవత్కైంకర్యం మనకు హితానికి హేతువు అని భావించకుండా, ఇక శ్రీరంగనాథుని కైంకర్యం వద్దు - అని ఉన్నాను. ఈ విధంగా ఉండే నన్ను పూర్వంలోవలెనే అతని కైంకర్యంలో అభినివేశం పొందేటట్లుగా నియమించారు. పెరియపెరుమాళ్, నంబెరుమాళ్ అందటి శ్రీచరణ ద్వయంలో అన్ని కైంకర్యాలను చేయాలనే దేవరవారి అభిప్రాయానుసారం కైంకర్యాన్ని గ్రహించాను. వద్దు- అని శ్రమపడడం మానివేసి, అందులో పొందికగా ఉన్నాను. తమకు దాసులు వేయిమంది కాచుకొని ఉండగా, దాసునకు మాత్రమే అనుగ్రహించిన తమ కరుణ వాచామగోచరం. ఆలోచించి చూచినా, దీనికి ప్రత్యుపకృతి దాసునకు ఏమీ తోచడం లేదు. ఈ కైంకర్యం నన్ను విడచి మాఱదు. నిజానికి దీనికి సాటి వేఱు లేదు. పరమపదానికి పోయి చేయవలసినది కూడా ఇదేకదా! ఇది ఇక్కడే లభించింది. మాఱకుండా పరమపదంలోకూడా కొనసాగనున్నది. దీనికి సాటి అయిన కైంకర్యం లభించదు.

**"ఇణై"** అని అనడంతోనే చాలి ఉండగా, **"ఇణైకళ్"** అనే ప్రయోగం- మూలమూర్తి, ఉత్సవమూర్తి- అనే రీతిలోని శ్రీరంగనాథునిమూర్తులు పెక్కింటిని ఉద్దేశించి చేయబడిందని చెప్పవచ్చు. **"మాఱు"** అనే పదానికి **"కైమ్మాఱు, మాఱుదల్, ఒప్పు"** అనే అర్థాలను గ్రహించవచ్చు.

**82.** అవ :- తాము సంస్కరించిన శ్రీరంగదివ్యాలయంలో శ్రీరంగ



నాథుని కైంకర్యాన్ని అద్భుతంగా నిర్వహించిన నాకు చేయవలసిన శిక్షణ ఒకే క్షణంలో చేసిన ఉపదేశంతోనే పూర్తి అయినది- అని ఉపదేశించిన భగవద్రామానుజుల పాండిత్యాన్ని కీర్తిస్తున్నారు.

**తెరివుఱ్ఱ ఞానమ్ శెరియ ప్పెఱాతు, వెమ్ తీవినైయాల్**
**ఉరువఱ్ఱ ఞానత్తుళల్కిన్ఱ ఎన్నై, ఒరు పొళుతిల్**
**పొరువఱ్ఱ కేళ్వియనాక్కి నిన్ఱాన్ ఎన్న పుణ్ణియనో**
**తెరివుఱ్ఱ కీర్త్తి, ఇరామానుశన్ ఎన్నుమ్ శీర్ముకిలే.**

తెరివు ఉఱ్ఱ = స్వచ్ఛతను పొందిన, ఞానమ్ = తత్త్వకైంకర్యాదులలో జ్ఞానాన్ని, శెఱియ పెఱాదు = గొప్పగా పొందలేక, అరకొఱగా పొంది, వెమ్ తీ వినైయాల్ = మిక్కిలి కఠినమై పాపాలతో, ఉరువు అఱ్ఱ = ఇటువంటిదని చెప్పబడలేని, ఞానత్తు = సాధారణజ్ఞానాన్ని కలవాడై, ఉళల్కిన్ఱ = సంసారంలోను, కైంకర్యంలోను పరిభ్రమించే నన్ను, ఒరు పొళుతిల్ = ఒకేసమయంలో, పొరువు అఱ్ఱ = సాటి లేని, కేళ్వియన్ ఆక్కి = తెలియదగిన వానిని చెవులతో విన్నవానినిగా చేసి, లేక, ఇతరులను ప్రశ్నించినవానినిగా చేసి, నిన్ఱాన్ = కృతార్థులై ఉన్నారు, ఎన్న పుణ్ణియనో = "ఎటువంటి పుణ్యశాలియో?", ఎన్నుమ్ = అని ఈవిధంగా భావింపబడిన, తెరివు ఉఱ్ఱ కీర్త్తి = ఆబాలగోపాలం ప్రసిద్ధమైన కీర్తిని కల, శీర్ ముకిల్ = గొప్పతనాన్ని పొందికగా కల మేఘం అయినవారు, ఇరామానుశన్ =శ్రీరామాజులు.

శ్రీరంగాలయ కైంకర్యాలను ఏవిధంగా నిర్వహించాలి? అనే విషయంలో స్పష్టమైన జ్ఞానం లేకుండా అఱకొఱ అయిన జ్ఞానమే నాకు ఉండేది. దానిని గాఢంగా పొందాను. దానిని పొందడానికి ముందు ఏమి తెలిసికొన్నాను? అని చెప్పలేని జ్ఞానానికి తగినట్లు ఏదో చేస్తూ వచ్చాను. పూర్వపాపఫలమే అది. ఏమి చెప్పను. ఒకే పొద్దులో అన్నీ తెలిసికొన్నాను. వారు ఉపదేశాన్ని చేసినపుడు నేను చెవిలో గ్రహించిన విషయాలు సాటి

లేనివి. అందువల్ల బహుశ్రుతుడను అయ్యాను. లేక, కైంకర్యం చేసేవారిని చూచి, సంస్కరింపబడేటట్లు ఏది ఏది ఏవిధంగా చేయబడుతున్నది? అని సాటి లేని ప్రశ్నలను నోటితో ప్రశ్నించగల్గిన వాడనయ్యాను. ఈ విధంగా అనుగ్రహించినవారిని, ఈ రీతిలో "నీచుడనైన నాకు కూడా అనుగ్రహించేటట్లు ఏమి పుణ్యాన్ని చేశారో!" అని తలచాను. నన్ను అనుగ్రహించి దానివల్ల పుణ్యాన్ని సేకరించుకొంటున్నారా! అని తలచాను. తరువాత దానిని మార్చి, వాస్తవానికి వీరు గొప్ప మేఘంవలె తమకోసం ఏమీ ఆశించకుండా పరోపకారాన్ని చేసేవారనే నిర్ణయాన్ని పొందాను. దానికి పిమ్మట వీరు **"పుణ్యానా మపి పుణ్యోసౌ"** అనబడే వాడైన పుణ్యాలకు అన్నిటికీ పుణ్యమయే రీతిలో - శక్తిని అనుగ్రహించే శ్రీకృష్ణుడని తెలిసికొన్నాను. అతడు గొప్ప మేఘం. అటువంటివారే వీరుకూడా. వర్ణంలో నల్లనివారు కాకపోయినా మిగిలిన గుణసంపదలో మేఘమే - అని భావం.

ఇక్కడ **"నిన్టాన్"** అనే సంపూర్ణక్రియకు తగినట్లు **"ఇరామానుశన్"** అనే పదం కర్త. **"శీర్ముకిల్ నిన్టాన్"** అని కాదు. అందువల్ల **"ఇరామానుశ నెన్నుమ్"** అని అన్వయించకుండా **"శీర్ముకిల్ ఎన్నుమ్ ఇరామానుశన్ నిన్టాన్"** అనే అన్వయాన్ని గ్రహించవచ్చు. అపుడు **"ఎన్న పుణ్ణియనో?"** అనేది ప్రత్యేవాక్యమవుతుంది. ఒక వాక్యంగా తగును అని ప్రతిపదార్థంలో వేఱే అన్వయం చూపబడింది. ఇపుడు ఈ అన్వయంలో **"నిన్టాన్"** అనేది సమాపక క్రియ కాదు. కొంచెం మార్చి వేఱు విధంగాకూడా అన్వయాన్ని గ్రహించవచ్చు.

**83.** అవ :- శ్రీరామానుజులు తమను శ్రీరంగనాథుని కైంకర్యంలో నియమించినందులకు కీర్తించారు. "దానికి మించిన పరమపదంలో కైంకర్యాన్ని కూడా విడచి, పరమాచార్యపాదారవింద కైంకర్యమే కావలసినది. అది చేజిక్కుతుంది" అని తమకు గల నిశ్చయాన్ని వివరిస్తున్నారు.



**శీర్ కొండు పేరఱమ్ శెయ్తు, నల్ వీడు శెఱితు మెన్నుమ్**
**పార్కొండ మేన్మైయర్ కూట్టనల్లేన్, ఉన్ పతయుకమామ్**
**ఏర్కొండ వీట్టై ఎళితినిల్ ఎయ్తువన్ ఉన్నుడైయ**
**కార్కొండ వణ్మై!, ఇరామానుశా! ఇతు కండుకొళ్ళే.**

ఇరామానుశ = శ్రీరామానుజా!, శీర్ కొణ్డు = అంగానుష్ఠానాన్ని చేసి, ఆత్మను దర్శించి, పేర్ అఱమ్ = పరమ్ధర్మమైన భక్తియోగం, శెయ్దు = అనుష్ఠించి, నల్ వీడు = భగవదనుభవకైంకర్యమనే గొప్ప మోక్షాన్ని, శెఱిదుమ్ = సమృద్ధిగా పొందుదాం, ఎన్నుమ్ = అనబడే, పార్ కొణ్డ మేన్మైయల్ = భూమిలో అంతటా ప్రసిద్ధమైన ఉత్కర్షను కల మహాత్ములు, కూట్టన్ అల్లేన్ = సంఘంలోనేను చేరేవాడను కాను, ఏర్ కొణ్డ = అందం, వైలక్షణ్యం కల్గినదైన, వీట్టై = మోక్షస్థానాన్ని, ఎళిదినిల్ = గొప్పధర్మం లేకుండానే, ఎయ్దువన్ = పొందుతాను, కార్ కొణ్డ =మేఘాన్ని లోపల కల్గిన, ఉన్నుడైయ వణ్మై = దేవరవారి ఔదార్యమనేది, ఇదు = ఇటువంటిదిగా ఉన్నది, కణ్డుకొళ్ = ప్రత్యక్షంగా చూడవచ్చు.

కర్మయోగ-జ్ఞానయోగాలను అనుష్ఠించి, జీవాత్మను దర్శించి, ధర్మానుష్ఠానం శమదమాదులు అన్నీ ఏర్పడగా, దానికి పిమ్మట, **"అయం తు పరమో ధర్మో యత్ యోగేనాత్మ దర్శనమ్"** అనే రీతిలో మిగిలిన ధర్మాలకంటె గొప్పదైన భక్తియోగాన్ని అనుష్ఠించి, ఆ యా మతస్థులు పలికే మోక్షస్థానాలకంటే గొప్పదై, కైవల్యాన్ని కూడ తగని స్థానంగా చేసే గొప్పస్థానమైన శ్రీమన్నారాయణుని అనుభవం, కైంకర్యమనే మోక్షాన్ని పొందడం అనే లోకప్రసిద్ధమైన గొప్ప ఫలాన్ని పొందాలని ప్రయత్నించే వారు గుంపులు గుంపులుగా కూడి ఉన్నారు. నేను ఆ ఫలాన్ని ఒక ఫలంగా భావించలేదు. కొండను తవ్వి ఎలుకను పట్టేవారిని ఎవరు పొగడుతారు? ఎందుకోసం ఇంతటి అంగానుష్ఠానం చేసి, ఆత్మను దర్శించడం? పరమధర్మమైన భక్తియోగాన్ని అనుష్ఠించడం? ఆ విధంగా

పోయిన చోటు భగవద్రామానుజుల కైంకర్యం లభిస్తుందా? అని అంటే, లభించదు అనియే అంటారు. పరమాచార్యులైన దేవరవారు ఇక్కడ వేంచేసి ఉన్నపుడు ఇది అక్కడ లభించే ప్రసక్తి ఉంటుందా? అందువల్ల దానిని విడచిపెట్టాను. ఇది లభించడం అరుదు కాదు. అంతటి ప్రయాసం అక్కరలేదుకదా! భగవానుడు ఒక కృష్ణమేఘం వర్ణంలోని నల్లని మేఘం. తనను పొందడానికి గొప్ప సాధనమైన ప్రపత్తిని కదా అతడు ఉపదేశించినది. దేవరవారి ఔదార్యం గొప్ప మేఘం ఔదార్యం కంటే గొప్పది. అనాయాసంగా దాస్యానికి అవకాశం ఇచ్చినందువల్లకదా నేనుకూడా ఇందులో అన్వయాన్ని పొందాను. అందువల్ల ఆచార్యకైంకర్య రుచి కల నాకు మిగిలిన ఐహికాముష్మికాల వలె పరమపదంలో పొందే ఫలంకూడా గొప్ప ఫలం కాదని విడువబడేదే - అని భావం.

**84.** అవ :- **“ఎళిదిల్ ఎయ్దువన్”** (గొప్ప ధర్మానుష్ఠానాన్ని చేయకుండానే పొందుతాను) - అని పూర్వపాశురంలో పల్కిన విషయాన్ని వివరిస్తున్నారు.

> **కండుకొండేన్ ఎమ్మిరామానుశన్ఱన్నై, క్కాండలుమే**
> **తొండుకొండేన్ ఎవన్తొండర్ పొట్రాళిల్, ఎన్తొల్లై వెన్నోయ్**
> **విండుకొండేన్ అవన్ శీర్ వెళ్ళవారియై వాయ్ మడుత్తిన్ఱు**
> **ఉండుకొండేన్, ఇన్నముట్రన వోతిల్ ఉలప్పిల్లైయే.**

ఎమ్ ఇరామానుశన్తన్నై = మన శ్రీరామానుజులను నేరుగా, కణ్డుకొణ్డేన్ = మొదట చూచినపుడే సంబంధం పొందగోరినవాడను కాగలను, కాణ్డలుమ్ ఎ = దర్శనం చేసినవెంటనే, అవన్తొణ్డర్ = వారిభక్తుల, పొన్తాళిల్ = భోగ్యమైన శ్రీచరణాలలో, తొణ్డు కొణ్డేన్ = కైంకర్యం చేసేవాడను కాగలను, అందువల్ల, ఎమ్ తొల్లై వెమ్ నోయ్ = నా అనాది అయిన, క్రూరవ్యాధులైన పాపాలను, విణ్డు కొణ్డేన్ = నాకు ఫలాన్ని ఇవ్వనివిగా చేసికొన్నాను, అవన్ శీర్ = శ్రీరామానుజుల కల్యాణ



గుణాలనే, వెళ్ళమ్ వారియై = ప్రవాహంలోని ఒక అంశాన్ని, ఇన్ఱు = ఈ నూట్రన్దాదిని రచించేటపుడు, వాయ్ మడుత్తు = నోటిలో నిండించి, ఉణ్డుకొణ్డేన్ = లోపలకు గ్రహించినవాడను అయ్యాను, ఇన్నమ్ = ఇంతకుమించి, ముట్రన = పూర్తిగా, ఓదిల్ = చెప్పాలంటే, ఉలప్పు ఇల్లై = దీనికి అంతులేని.

భగవద్రామానుజులను ఎపుడు దర్శించానో, అపుడే వారి సంబంధాన్ని పొందాలని ఆశించాను. అందుకోసం వారిని దర్శించిన వెంటనే భగవానునివద్దవలె వారివద్దకు పోవడానికి పురుషకారంగా కొందటి పురస్కరించుకోవడం తగును - అని వారికి దగ్గరగా ఉండే భక్తులను (దాసులను) నమస్కరించాను. ఈ విధంగా కూరేశులవద్దకు చేరేటట్లు బుద్ధిని వారే కల్గించి ఉండాలి. ఆ దాసులవద్ద చేసిన శుశ్రూష వారే ఆచార్యులు కావడానికి కారణమైనది. అందువల్ల నా ప్రాక్తన కర్మలన్నీ నాకు ఫలాన్ని ఇవ్వని రీతిలో నన్ను విడచి వేఱొక చోటికి పోవడానికి సమయం ఎదురు చూస్తూ నా వద్ద నిలచినవి అయినవి. ఈ అనిష్ట నివృత్తికి మించి ఇష్టప్రాప్తిలో ముఖ్యమైనదానినికూడా వినండి. భగవద్రామానుజుల కల్యాణగుణానుభవ సముద్రంలో అవగాహించాలనే ఆశ ఉద్బుద్ధం కాగా వారి విషయంగా ఈ నూట్రన్దాదిని రచిస్తున్నాను. వారి కల్యాణగుణాల సముద్రం మొత్తం నాచే పానం చేయడం సాధ్యమా? ఆ సముద్రంలోని నీటిలో కొంచెం భాగాన్ని కొంచెం పానం చేశాను. ఏవో కొన్ని పాశురాలను నోటితో చెప్పగల్గినవాడనయ్యాను. ఈ విధంగా నాకు ఏర్పడిన అనిష్టనివృత్తులు అనేకం. ఇష్టప్రాప్తులు కూడా అనేకం. వాటిని అన్నిటినీ చెప్పి పూర్తి చేయడం సాధ్యం కాదు. ఈవిధంగా చూచిన తత్క్షణమే వారి దాసుల మూలంగా వారిని అనుభవించడం సాధ్యం అయినదంటే, వారి సౌలభ్య సౌశీల్యాలే దానికి కారణం. నేను చేసిన పరమధర్మాచరణం ఏమీ లేదు- అని భావం.

**(శీర్వెళ్ళమ్ వారియై)- “వెళ్ళమ్”** అంటే- సముద్రం, **“వెళ్ళత్తరవిల్

**తుయిల్ అమర్న్ద"** (తిరుప్పావై) అనేచోట వలె. అటువంటి గొప్ప ప్రవాహం కూడా కావచ్చు. దానిని పూర్తిగా గ్రహించే శక్తి ఏది ? అందువల్ల దానిలోని **"వారియై"** అడ్డగించి నిలిపిన భాగాన్ని- అని అన్నారు. **"వారి"** అనే సంస్కృతశబ్దానికి జలమని అర్థం. **"వారికొళ్ళపెట్రతు"** అని అంటే- పూర్తిగా గ్రసించబడిందని ద్రావిడంలో అర్థం. పూర్తిగా గ్రహించడం సాధ్యం కాదు -అనేది **"ఉలప్పిల్లైయే"** అనే పదంనుండి వ్యక్తమవుతున్నది. **"ఓదిల్"** అనే దానికి వారి కల్యాణగుణాలనుగూర్చి పల్కడం వేదం అధ్యయనం చేయడానికి మించిన సఫలాన్ని ఇస్తుంది - అని భావం.

**85.** అవ :- **"తొణ్డర్ పాట్రాళిల్ తొణ్డు కొణ్డేన్"** - అని అంటున్నారే. తావన్మాత్రంతో ప్రాక్తనకర్మలన్నీ తొలగిపోతాయా? అని అంటే, పోతాయి. పెద్దలకు చేసిన దాస్యం నాకు తెలివిని కల్గించింది. అందువల్ల అది జ్ఞానానికి కారణం అవుతుంది. జ్ఞానంవల్ల కర్మలు నశిస్తాయి. ఒక్కొక్క జీవుడు స్వతంత్రంగా తన జీవనాన్ని నడపకుండా పలువురను ఆశ్రయించి జీవించడాన్నిబట్టే జీవుడు స్వతంత్రుడు కాడు - అనేది స్పష్టమవుతున్నది. దానికి మించి, దేవతాంతరాలను, వారి దాసులను, రాజులు మొదలైనవారిని ఆశ్రయించి, సేవచేయడం సహజమైపోయింది. శ్రీమన్నారాయణుని విడచిపెట్టి ఆ విధంగా దాస్యం చేయడం తగదు- అని తెలిసిన తర్వాత తగిన (ప్రాప్త) విషయంలోనే దాస్యం నిలుస్తుంది. ఆ విధంగా నిలిపినవారు భగవద్రామానుజులే- అని అంటున్నారు.

**ఓతియ వేతత్తినుట్పొరుళాయ్, అతనుచ్చి మిక్క**
**శోతియై నాతనెన అఱియాతుళల్కిన్ఱ తొండర్,**
**పేతైమై తీర్త్త ఇరామానుశనై త్తొళుమ్ పెరియోర్**
**పాతమల్లాల్ ఎన్ఱన్నారుయిర్క్కు, యాతొన్ఱుమ్ పట్రిల్లైయే.**

ఓదియ = అనాదికాలంగా అభ్యసింపబడి, ప్రమాణమైన, వేదత్తిన్ = కర్మకాండలలో, ఉట్పొరుళాయ్ = అగ్నిమొదలైనవానికి అంతర్యామియై, నుణ్ పొరుళాయ్ = అందువల్లనే, సుసూక్ష్మమై, అదన్ఉచ్చి = ఆ



వేదంయొక్క శిరస్సు అయిన ఉపనిషత్తులలో, మిక్క శోదియై = పరంజ్యోతిగా చక్కగా వెలిగే శ్రియఃపతి, నాదన్ ఎన్ఱు = అందఱికి స్వామిగా, అఱియాదు = తెలియక, ఉళల్కిన్ఱ = సంసారియై తిరిగే, తొణ్డర్ =దేవాంతరం, వారి దాసులు, ప్రభువులు- అనేవారికి దాసులయ్యేవారి, వేదమై = మూఢత్వాన్ని, తీర్త్త = పోగొట్టిన, ఇరామానుశనై త్తొళుమ్ పెరియోర్ = శ్రీరామానుజులను కొలిచే పెద్దల, పాదమ్ అల్లాల్ = శ్రీచరణాలు తప్ప, ఎన్ఱన్= నా, ఆర్ ఉయిర్క్కు = అరుదైన జీవానికి, యాదు ఒన్ఱు ఉమ్ = వేఱు ఏదీ, పట్రు ఇల్లై = ఆలంబనం లేదు.

**"వేదత్తినుట్పొరుళ్"** అనేచోట **"ఉళ్ పొరుళ్, నుణ్పొరుళ్"** అని రెండు విధాలుగా పదవిభాగాన్ని చేయవచ్చు. **"తదేవాగ్ని స్తద్వాయుః", "యోఽగ్నౌ తిష్ఠన్ అగ్నేరంతరః", "సర్వగతం సుసూక్ష్మమ్"** ఇత్యాది ప్రమాణాలు గ్రాహ్యాలు. **"ఉచ్చిమిక్క శోదియై" - "శ్రుతిశిరసి విదీప్తే"** అని అన్నారు రామానుజులు శ్రీభాష్యంలో. కర్మకాండలో మఱుగుపడిన దశలో (రహస్యంగా, గుప్తంగా ఉండే దశలో) తెలియబడినది ఉపనిషత్తులలో చాలా స్పష్టంగా ప్రకాశిస్తున్నది. **"వేదమైతీర్త్త"** వేదప్రతిపాద్యార్థమైన శ్రీమన్నారాయణుడనే పరదేవతను విడచి వేఱొక చోట దాస్యం తగదు- అనే ఉపదేశాన్ని పొంది, ఆ దాస్యం నిలువడంకోసం తగిన ఉపాయంలో ప్రవేశిస్తే ప్రాక్తన ప్రబల కర్మలు నశిస్తాయి- అని భావం. వేఱొక సంబంధం ఆశ్రయం అయితే ప్రబలకర్మలు వృద్ధి అవుతాయి. వేఱెవ్వరికీ సంసారం నుండి విడిపించే శక్తి లేదు - అని భావం. **"అఱియాతుళల్కిన్ఱ తొణ్డర్",** నాథుని తెలియనివారు ఏ విధంగా దాసులు కాగలరు? అని అంటే, శ్రియఃపతికి దాసులు కాకుండా పోయినా, దేవతాంతరాలకు, మిగిలిన క్షుద్రులకు దాసులు కావచ్చునే. అంతేకాక, వివేకం లేనందువల్ల వేఱు చోట్లలోకూడా దాసులచే శ్రియఃపతికి దాస్యం చేసేవారు కొందరున్నారు కదా! మంచి వంశంలో పుట్టి, మంచి ఏదని తెలియకుండా ద్వేషంలేక సామాన్యంగా దాస్యం చేసేవారి ఉద్దేశించి పల్కిన మాట ఇది.

**86.** అవ :- **"పేదమై తీర్త్తు"** (మౌఢ్యాన్ని పోగొట్టిన) ఫలాన్ని నావరకు దర్శించాను - అని ఇందులో అంటున్నారు.

పట్రా మనిశరై ప్పట్రి, అప్పట్రు విడాతవరే
ఉట్రారెన ఉళన్డోడి నైయేనిని, ఒళ్ళియనూల్
కట్రార్ పరవుమ్ ఇరామానుశనై క్కరుతు ముళ్ళమ్
పెట్రార్ యవర్, అవరెమ్మై నిన్డాళుమ్ పెరియవరే.

ఇని = మూఢత్వం తీరినతరువాత, పట్రా = రక్షించని, మనిశరై = మానవులను, పట్రి = అవలంబంగా గ్రహించి, అ పట్రు = ఆ ఆలంబనాన్ని, విడాదు = విడువలేక, అవరై = ఆ ఆశ్రయించరానివారినే, ఉట్రార్ ఎన = రక్షించగల్గినవారని, భ్రమించి, ఉళన్డు = అక్కడక్కడే తిరిగి, ఓడి = మాటిమాటి పలువురి వద్దకు పరుగెత్తి పోయి, నైయేన్ = ఇంతవరకు బాధపడ్డాను, ఈవిధంగా క్లేశాన్ని పొందాను, నేను ఈవిధంగా పరిభ్రమించడం ఎవరి వద్ద? అంటే, ఒళ్ళియ నూల్ = ప్రకాశించే ప్రమాణంగా ప్రసిద్ధిపొందిన, నూల్ = వేదం మొదలైనవానిని, కట్రార్ = అభ్యసించినవారిచే, పరవుమ్ = వాటి అర్థంలోని యథాత్మ్యాన్ని వీరే చెప్పగలరని స్తుతింపబడే, ఇరామానుశనై = శ్రీరామానుజులను, కరుదుమ్ ఉళ్ళమ్= ధ్యానించే మనస్సు, పెట్రార్ యవర్ = ఎవరెవరు పొందారో, అవర్ = వారంతా, ఎన్నై ఆళుమ్ = నన్ను క్రయవిక్రయాలకు అర్హునిగా చేసి పాలించగల, పెరియవర్ = మహనీయులు.

"పట్రా మనిశరై" - "పట్రాదవర్" శక్తిహీనులు. రక్షించడంలో శక్తి లేనివారు. ఇక, మనం సంబంధం కల్గి ఉన్నా, వారు మనపట్ల సంబంధాన్ని కల్గి ఉండనివారని కూడా అర్థం. వారికంటే దేవతాంతరాలు నయం. ఇతరదేవతలు తమవద్దకు వచ్చినవారివద్ద సంబంధాన్ని కల్గి ఉంటారు కదా! వారినే విడచిన మనకు మానవుల కృతఘ్నులు అయిన వీరెందుకు? **"ఒళ్ళియ నూల్" - "ఆబ్రహ్మస్తంబపర్యంతాఃజగదంతర్వ్యవస్థితాః, ప్రాణినః కర్మజనిత సంసారవశవర్తినః, యతస్తతో న తే ధ్యానే ధ్యానినా ముపకారకాః"** - (బ్రహ్మనుండి గడ్డిపోచవరకు ఈ లోకంలో ఉండే



వారంతా కర్మవల్ల ఏర్పడిన సంసారానికి లోబడినవారు. అందువల్ల ధ్యానం చేసేవారికి వారివల్ల ఉపయోగం లేదు) ఇతరులను ప్రీతితో ధ్యానం చేయవచ్చు. వారి దర్శనాన్ని పొందవచ్చు. ఇంతటి ధ్యానం పొందవచ్చునే తప్ప, వారు చేసే ఉపకారం ఏమీ లేదు. ప్రాయశః మనం చేసే ధ్యానంకూడా వారికి తెలియకుండా ఉంటుంది. **"కరుతు ముళ్ళమ్"**- ఎవరు భగవద్రామానుజులను స్తుతిస్తున్నారో వారే గొప్పవారు - అని మాత్రం కాదు. వారిని స్తుతించకుండా మనస్సులో భావంతో గ్రహించినా చాలు. వారుకూడా గొప్పవారే - అని భావం.

**87.** అవ :- భగవద్రామానుజుల ఉపదేశం అందటిని సంస్కరించగల్గినది. ఆ ఉపదేశం కొన్ని చోట్ల ఫలించలేదు - అని అంటే వారు కలిపురుషుని భాగంగా విభాగింపబడినవారే అవుతారు. కలికి వశమై వారు చెడిపోవలసినదే - అని అంటున్నారు. కలిపురుషుడు భగవద్రామానుజులను సేవించి, మీ ఉపదేశాన్ని మనస్సులో గ్రహించనివారి వద్ద నాకు వాసాన్ని అనుగ్రహించాలి- అని వేడి అక్కడకు వెళ్ళాడు. వెళ్ళి ఏమి చేశాడు ? అని అంటే, భగవద్రామానుజుల భక్తులు ఏదుఃఖాన్ని తెలియకుండా ఉన్నారే? నేను ఎందుకు అక్కడికి చేరకుండా పోయాను? అని బాధపడేటట్లు వారిని వధిస్తాడు - అనే అర్థం స్ఫురించేటట్లు అనుగ్రహిస్తున్నారు.

**పెరియవర్ పేశిలుమ్ పేదైయర్ పేశిలుమ్, తన్కుణంగట్కు
ఉరియ శొల్లెన్రు ముడైయవన్ ఎన్రెన్రు, ఉణర్విల్ మిక్కోర్
తెరియుమ్ వణ్కీర్త్తి యిరామానుశన్ మట్రై తేర్న్దులకిల్
పురియుమ్నన్ ఞానమ్, పొరున్దాతవరై ప్పొరుమ్ కలియే.**

పెరియవర్ పేశిలుమ్ = మతచర్చలోగాని, ఆచారాదివిషయంగాగాని, జ్ఞానాధికులలో గొప్పవారు పల్కినా, పేదైయర్ పేశిలుమ్ = జ్ఞానం లేనివారు ఏదో చర్చించినా, తన్ గుణజ్గట్కు = అందటిని సమానంగా గౌరవించే తమ గుణాలకు, ఉరియ శొల్ = తగిన వాక్కు, ఎన్రుమ్ ఉడైయవన్= ఎల్లప్పుడు కలవారు, ఎన్రు ఎన్రు = అని, ఇంకా ఈ విధంగా,

ఉణర్విల్ మిక్కోర్ తెరియుమ్ = వారివారి స్థితులను చక్కగా తెలియగలవారు తెలిసికొన్నందునవల్ల కల్గిన, పెరు కీర్త్తి = గొప్పకీర్తినికల, ఇరామానుశన్ = శ్రీరామానుజులచే, మఱై తేర్న్దు = వేదాలలో స్పష్టతను పొంది, ఉలకిల్ పురియుమ్ = లోకానికి అనుగ్రహింపబడుతున్న, ఞానమ్= యథార్థమైన జ్ఞానం, పొరున్దాదవరై = మనస్సులో పొందికగా పొందలేని పాపులను, కలి పొరుమ్ = కలిపురుషుడు హింసిస్తాడు.

లోకంలో ఒకడు యోగ్యుడై, భగవద్రామానుజుల ఉపదేశాన్ని అంగీకరించకుండా ఉన్నాడు - అని అంటే, దానికి కారణం అతనితో చర్చ చేయడానికి భగవద్రామానుజులు అంగీకరించకపోవడమా? పల్కినా వాస్తవాన్ని చెప్పకపోవడమా? వీరు దానికి తగిన తేటదనాన్ని శాస్త్రంలో పొందలేకపోవడమా? ఇవి ఏవీకాదు. ఎంతటి మూఢులు విన్నా సులభంగా వారు తెలిసికొనే రీతిలో శ్రీరామానుజులు వివరిస్తారు అనేది లోకప్రసిద్ధం. గొప్ప జ్ఞానులు వీరి సౌలభ్యం, సౌశీల్యం, సమత - అన్నీ చక్కగా తెలిసిన వారు. అయితే, శ్రీవైష్ణవమతం అంతటా వ్యాపించి వేఱు ఏదీ కనబడని రీతిలో లేదే! అని అంటే, కలియుగంలో అటువంటి జన్మలే విరివిగా ఉన్నాయి. వారు వారు చేసికొన్న పాపమే దానికి కారణం - అని భావం.

ఈ పాశురానికి ఇంకొక అర్థాన్ని కూడా చెబుతారు. చక్కగా స్తుతించగల్గినవారు స్తుతించినా, జ్ఞానం లేనివారు స్తుతించినా, వారి వారి జ్ఞానానికి తగిన వాక్కుకు లక్ష్యం అవుతున్నారు- భగవద్రామానుజులు. వారి మూలంగా జ్ఞానం పొందనివారికి కలి ప్రభావం ఉంటుందని భావం. **"ఏఱ్ఱిలుమ్"** అని అనకుండా **"పేశిలుమ్"** అని అన్నందువల్ల **"శొల్ ఉడైయవన్"** అనేదానికి ప్రత్యుత్తరం కలవాడని అర్థం పొసగడం చేత, పైన **"ఉలకిల్ పురియుమ్ ఞానమ్"** అని ఉపదేశం చెప్పబడుతున్నందున, ఉపదేశాన్ని పొందగోరినవారిని మొదటి పాదంలో ప్రస్తావించినట్లయితే చక్కగా పొసగుతున్నందున వేఱు రీతిలో వ్యాఖ్యానింపబడింది.

**88.** అవ :- **"పేదైయర్ పేశిలుమ్"** అనేదానికి ఇందులో ఒక ఉదాహర



ణాన్ని చూపుతున్నారు. శ్రీవైష్ణవారాధనకే పలు రీతులలో ద్రవ్యాన్ని సేకరించినవారు, శ్రియఃపతివద్దనే మంత్రోపదేశాన్ని పొందినవారు, విష్ణ్వాలయాలను విరివిగా పాటలు పాడి దివ్యదేశాలు చేసినవారు, శ్రీరంగంలో మహనీయకైంకర్యాలను చేసినవారైన తిరుమంగై ఆళ్వార్లపట్ల ద్వేషం పొంది, ద్రావిడవేదం మొదలైనవాటికి ప్రతివాదులైన వారిని తిరునెడున్దాణ్డక ప్రబంధంలోని **"మిన్నురువాయ్", "పొరురువి"** వంటి పాశురాలను చూపి వివరించి, శ్రీమన్నారాయణుని పరత్వాన్ని స్థాపించి ప్రతివాదులనే పులులకు మించిన సింహంగా వెలిగినవారు భగవద్రామా నుజులు- అని అంటున్నారు. భట్టర్ తిరునెడున్దాణ్డకాన్ని గొప్ప శాస్త్రంగా వివరించి పలికి, ప్రతివాదులను జయించడం ప్రసిద్ధం. దానికి మూలం భగవద్రామానుజుల ప్రయత్నమే.

**కలిమిక్క శెన్నెల్ కళని కుఱైయల్, కలై ప్పెరుమాన్**
**ఒలిమిక్క పాడలై యుండు తన్నుళ్ళమ్ తడిత్తు, అతనాల్**
**వలి మిక్క శీయ మిరామానుశన్ మఱై వాతియరామ్**
**పులి మిక్కతెన్ఱు, ఇప్పువనత్తిల్ వన్దమై పోఱ్ఱువనే.**

మఱై వాదియర్ ఆమ్ = ద్రావిడవేదం మొదలైనవానికి ప్రత్యర్థులనే, పులి మిక్కదు = పులులు వ్యాపించాయి, ఎన్ఱు =అని విచారించి, వాటికి మించిన, కలి మిక్క = మిక్కిలి బలాన్ని కల, శెమ్ నెల్ కళని = ఎఱ్ఱని ధాన్యం పండే పొలాలను కల, కుఱైయల్ = తిరుక్కుఱైయలూర్‌లో ఆవిర్భవించిన, కలై పెరుమాన్ = అన్ని విద్యలలోను పేరు పొందిన కలియన్‌యొక్క, ఒలి మిక్క = విశేషార్థాలను ఘోషించేవి, రాగాలు కల్గినవిఅయిన, పాడలై = పాశురాలను, ఉణ్డు = వేదంమొదలైన ప్రమాణా లతో చేర్చి అనుభవించి, ఉళ్ళమ్ తడిత్తు = పుష్టిని పొందిన మనస్సును కలవారై, అదనాల్ వలి మిక్క = తన్మూలంగా ప్రతివాదులను జయించే శక్తిని మిక్కిలిగా కల్గిన, శీయమ్ = గొప్పసింహమైన, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, ఇ పువనత్తిల్ = ఈలోకంలో, వన్దమై = అవతరించిన

గొప్పతనాన్ని, పోఱ్ఱువన్ = కీర్తిస్తాను.

శ్రీరామానుజులు ఈ భువనంలో అవతరించినందువల్లనేకదా ప్రతివాదులైన పులులు అణగిపోయారు. అందువల్ల వీరిని శక్తిని కల గొప్ప సింహమై ప్రకాశిస్తున్నారని స్తుతిస్తున్నాను- అని భావం. **"కలిమిక్క"** అనేది **"కలైప్పెరుమాన్"**కు అన్వయిస్తుంది. **"ఒలిమిక్క పాడలై"** -ఇవే ప్రతివాదులను జయించేటట్లు అన్వయించి, ధ్వనితో పాటు అర్థం స్ఫురించేటట్లు పాడబడినపుడు సింహనాదంగా తోస్తుంది. ద్రావిడ వేదాలను అప్రమాణంగా భావించేవారికి తన్మూలంగా తత్త్వస్థాపనం చేయడం సాధ్యం కాకపోయినా, ద్రావిడవేదాలను తక్కువజేసి పలికేవారిని వాటిలో ఉండే విశేషాలతో జయించవచ్చు. ఆళ్వార్లు వేదార్థాలను తెలియనివారని కొందఱు వాదిస్తే ద్రావిడవేదాలను గొని ఆ పదాన్ని జయించవచ్చు. ఈ విధంగా పూర్వకాలంనుండే ద్రావిడంలో ప్రసిద్ధంగా వ్యాపించిన సిద్ధాంతానికి మాఱు అయిన అద్వైతాది సిద్ధాంతాలు అనాది సిద్ధాంతాలు కావు. అని స్థాపించవచ్చు. ద్రావిడంలో ప్రీతిని కలవారు ద్రావిడంతోనే ప్రతివాదాన్ని (సమాధానాన్ని) ఇవ్వడమే ఆదరిస్తారు.

**89.** అవ :- **"పోత్తువన్"** అని పల్కిన వారు **"యతో వాచో నివర్తంతే"** అనే రీతిలో వాచామగోచరమైన భగవద్రామానుజుల గుణాలను, వాక్కుతో పల్కి ముగించాలని ప్రయత్నించడం తగదు అని తెలిసి కొన్నాను - అని అంటున్నారు.

**పోఱ్ఱరుమ్ శీలత్తిరామానుశ!, నిన్పుకళ్ తెరిన్దు**
**శాఱ్ఱువనేల్ అతు తాళ్వతు తీరిల్, ఉన్శీర్తనక్కోర్**
**ఏఱ్ఱమెన్ఱే కొండిరుక్కిలు మెన్ మనమేత్తి యన్ఱి**
**ఆఱ్ఱకిల్లాతు, ఇతఱ్కు ఎన్నినవాయ్ ఎన్ఱిట్టఞ్జువనే.**

పోఱ్ఱ అరుమ్ = కీర్తించడానికి అరుదైన వాచామగోచరమైన, శీలత్తు = సౌశీల్యాది గుణాలను కల్గిన, ఇరామానుశ = శ్రీరామానుజా!,



నాన్ = నేను, ఉన్ పుకళ్ తెరిన్దు = శ్రీరామానుజా!, నాన్ = నేను, ఉన్ పుకళ్ తెరిన్దు = నీ కీర్తిని పూర్తిగా తెలిసికొన్నానని భావించి, శాఱ్ఱువన్ ఏల్ = ఘోషించినట్లయితే, అదు తాళ్వు = అది మీకు లోటే అవుతుంది, అదు తీరిల్ = తెలియలేదు - అని పూర్తిగా కీర్తించడం విడచిపెడితే, ఉన్ శీర్ తనక్కు = మీ కల్యాణగుణగణాలకు, ఏఱ్ఱమ్ = గొప్పతనం అవుతుంది, ఎన్ఱే కొణ్డిరుక్కిలుమ్ = అని నేను నిశ్చయించుకొని, ఊరికే ఉన్నా, ఎన్ మనమ్ = నా మనస్సు, ఏఱ్ఱి అన్ఱి = మిమ్ములను స్తుతించ కుండా, ఆఱ్ఱకిల్లాదు = సహించడానికి, తనను నిలువరించుకోవడానికి శక్తం కాదు, ఇదఱ్కు = ఈ విషయంకోసం, ఎన్ నినైవాయ్ = మీరేమి తలుస్తారో, ఎన్ఱిట్టు = అనే రీతిలో గ్రహించి, అఞ్జువన్ = భయన్ని కల వాడనయ్యాను.

దేవరవారికి శీలం, కీర్తి అంతు లేనివై ఉండగా అన్నీ పలుకవచ్చునని ఘోషిస్తే, వాటిని తక్కువగా భావించినట్లే, పూర్తిగా విడచి తొలగిపోతే నేను భావించినా మనస్సు నాకు లొంగడం లేదు. అదికూడా శీలగుణంయొక్క ఆకర్షణ శక్తివల్లనే, దీనికి భయపడతున్నాను. అయినా వాస్తవాన్ని తెలిపినందువల్ల అపరాధం కాబోదు - అని తలుస్తున్నాను- అని భావం.

**90.** అవ :- అయితే, కీర్తించనివారే వివేకులు అయినందువల్ల, భగవానుని కీర్తించని మతాంతరులను చాలా గౌరవించవచ్చునా మఱి! అని అంటే, సాధ్యమైనంతవరకు గౌరవంతో కీర్తించాలి. కీర్తించేవారినైనా ఆరాధించాలి. తాము కీర్తించగల్గినవారైనా కీర్తించేవారిని ఆరాధించాలి. లేకపోతే చీకటే (అజ్ఞానమే) - అని అంటున్నారు.

నినైయార్ పిఱవియై నీక్కుమ్ పిరానై, ఇన్నీణిలత్తే
ఎన్నై యాళవన్ద ఇరామానుశనై, ఇరుమ్ కవికళ్
పునైయార్ పునైయుమ్ పెరియవర్తాళ్కళిల్ పూమ్ తొడైయల్
వనైయార్, పిఱప్పిల్ వరున్దువర్ మాన్దర్ మరుళ్ శురన్దే.

పిఱవియై నీక్కుమ్ = మఱు జన్మ లేని రీతిలో చేసే, పిరానై = మహోపకారకుని, అందఱికోసం ప్రపత్తి చేసేవారిని, నినైయార్ = అటువంటివారని భావించనివారై, ఎన్నై ఆళ = నావంటి నీచుని కూడ అనుగ్రహించడానికి, వన్ద ఇరామానుశనై = అవతరించే వీరిని గూర్చి, ఇరు కవికళ్ = గొప్పసారమైన కావ్యాలను, పునైయార్ = రచించనివారై, పునైయుమ్ = కవిత్వాన్ని పలికేవారైన, పెరియవర్ = మహాత్ముల, తాళ్కళిల్ = శ్రీచరణాలలో, పూ తొడైయల్ = ఉపచారంగా మాలికలను, వనైయార్ = సమర్పించకుండా ఉండేవారైన శ్రీరామానుజులను గౌరవించనివారైన, మాన్దర్ = మందబుద్ధులలో చేరిన మానవులు, మరుళ్ శురన్దు = తాము చెడడంతోపాటు, ఇతరులకు కూడా అజ్ఞానాన్ని కల్గించేవారై, ఇ నీళ్ నీలత్తిల్ పిఱప్పిల్ =జన్మవల్ల, వరున్దువర్ = దుఃఖానికి విషయమవుతాయి.

వాచామగోచరమైన (అంతు లేని) కీర్తిని కలవారు శ్రీరామానుజులు - అని తెలిసి, భగవానునివలె వారినికూడా కీర్తించాలి. వారిని శరణు పొందిన వారైతే, వారి కృత్యం అందఱికీ మోక్షాన్ని ఇస్తుంది - అనేదానినికూడా స్థిరంగా గ్రహించాలి. అలక్ష్యంగా ఉండేవారికి అజ్ఞానమే, సంసారమే, దుఃఖమే.

**91.** అవ :- **"ఆగమవాదియర్"** -గతంలో **"మత్తైవాదియర్"** అనేచోటవలె ఇక్కడ **"ఆగమమ్"** అంటే వేదం. అందులో కుతర్కాన్ని చేసి వాదించే వారనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు. అయినా, **"అరఙ్గన్"** -విష్ణువు సర్వజీవనాథుడు అయినందువల్ల, దానికి వ్యతిరేకమైన శివపారమ్య వాదులను సూచించవచ్చు- అని పల్కిన దానికి ప్రమాణంగా అంగీకరించ బడిన శైవాగమాన్నే ఆగమమని అంటారు. వేదానికి కూడా శివపారమ్యం లోనే దృష్టి - అని వారి వాదమైనందువల్ల, ఆగమమ్ = వేదం, ఇందులో వాదించేవారని అర్థం గ్రహించినా గ్రహించవచ్చు. ఒక్కొక్క పాశురానికి ఒక్కొక్క విషయంలో దృష్టి అని అంటే



పునరుక్తిదోషం రాదు. **"ఈణ్డియ శీర్"** భగవద్రామానుజుల జ్ఞానశక్తి బలైశ్వర్యాది గుణాలు వారి దయకు సేవను చేస్తున్నవి. ఈ విధంగా తమతో కలసిన కల్యాణగుణాలను కల దయను గొని వీరు "అందఱు జీవులకు నాథుడు శ్రీమన్నారాయణుడు'' అని, అతడు వ్యూహ-విభవ-హార్ద-అర్చారూపాలలో ఉంటూ అందఱినీ రక్షిస్తున్నాడని ఉపదేశించి లోకాన్ని ఉద్ధరించారు. ''మిక్క పుణ్ణియన్'' - మిక్కిలి అనుగ్రహసంకల్పాన్ని కలవాడు. సర్వేశ్వరుడు జీవరాసులు తనకు చేసిన ధర్మాలను చూచి, దానికి తగినట్లు పుణ్య సంకల్పాన్ని కలవాడు. భగవద్రామానుజులు ప్రతివాదులవల్ల ఏర్పడి వ్యాపించిన అజ్ఞానంలో తడబడే లోకాన్ని చూచి, దానినుండి ఏమీ ఆశించకుండా దయామాత్రంగానే ఇంత చేశారు.

**మరుళ్ శురన్దు ఆకమవాతియర్ కూఱుమ్, అవప్పొరుళామ్**
**ఇరుళ్ శురన్దెయ్త్త ఉలకిరుళ్ నీంగ, త్తన్నీండియ శీర్**
**అరుళ్ శురన్దు ఎల్లా వుయిర్కట్కుమ్ నాత నరంగ నెన్నుమ్**
**పొరుళ్ శురందాన్. ఎమ్మిరామానుశన్ మిక్క పుణ్ణియనే.**

మరుళ్ శురన్దు = అజ్ఞానం అతిశయించినందున, ఆగమవాదియర్ = శైవాగమాన్ని పురస్కరించుకొని వాదించేవారు, కూఱుమ్ = పల్కిన, అవమ్ = ప్రయోజనం లేని- మోక్షాన్ని కాని, పొరుళ్ ఆమ్ = తత్త్వమనే, ఇరుళ్ శురన్దు = విపరీతార్థాన్ని మిక్కిలి ఆదరించి, ఏయ్త్త = కృశించిన దరిద్రమైన, ఉలకు = లోకంలోని, ఇరుళ్ నీఙ్గ = అజ్ఞానం పోవడంకోసం, ఎమ్ ఇరామానుశన్ = మన శ్రీరామానుజులు, తన్ ఈణ్డియ శీర్ = తమ నిబిడమైన గుణాలవల్ల కల్గిన, అరుళ్ శురన్దు = దయను ప్రవహింపజేసి, ఎల్లా ఉయిర్కట్కు ఉమ్ = నాథుడు అవుతున్నారు, అరఙ్గన్ = శ్రీరంగనాథుడు, శైవులవంటి వారికి ఇతడు నాథుడుకాడు- అనేది లేదు,ఎన్నుమ్ పొరుళ్ = అనే వాస్తవాన్ని, శురన్దాన్ = అంతటా తెలియజేసేవారై, మిక్క పుణ్ణియన్ = అందఱిని పుణ్యులుగా చేసే పుణ్యులు

అయినారు.

**92.** అవ :- భగవానునివలె ఉపకారం చేయడానికి ముందు ఏ రాజ్యాన్ని అపేక్షించకుండా అనుగ్రహిస్తారు, భగవద్రామానుజుల- అనేదానికి తమనే సాక్షిగా పల్కుతున్నారు.

**పుణ్ణియ నోన్బు పురిన్దుమిలేన్, అడి పోట్రి శెయ్యుమ్**
**నుణ్ణరుమ్ కేళ్వి నువన్దుమిలేన్, శెమ్మైనూల్ పులవర్క్కు**
**ఎణ్ణరుమ్ కీర్త్తి యిరామానుశ! ఇన్డు నీ పుకున్దు ఎన్**
**కణ్ణుళ్ళుమ్ నెఞ్జుళ్ళుమ్ నిన్ఱ, ఇక్కారణమ్ కట్టురైయే.**

శెమ్మై నూల్ = సత్యమైన శాస్త్రాలలో, పులవర్క్కు = పండితులైన వారికికూడా, ఎన్ అరు కీర్త్తి = లెక్కించసాధ్యంకాని కీర్తులను కల ఇరామానుశ, దేవరవారు నావద్ద వేంచేసి ఉండేటుట్ల, పుణ్ణియమ్ నోమ్బు= శ్రేష్ఠంగా విధింపబడిన దానిని దేనినీ, పురిన్దుమ్ ఇలేన్ = నేను అనుష్ఠించలేదు, అడి పోట్రి = శ్రీచరణాలను స్తుతించి, శెయ్యుమ్ = చేయబడవలసిన, నుణ్ అరు = సూక్ష్మమైన, పొందడానికి సాధ్యంకానిదై ఉండే, కేళ్వి = అడిగితెలియ వలసిన దానినిగూర్చి, నువన్దుమిలేన్ = శబ్దాలను అభ్యసించనుకూడా లేదు, ఇన్డు = ఆ విధంగానే నేను ఉన్నప్పుడు, నీ పుకున్దు = దేవరవారు ప్రవేశించి, ఎన్ కణ్ ఉమ్ నెఞ్జు ఉళ్ ఉమ్ నిన్ఱ = భావించడానికి తగిన, ఇ కారణమ్ = ఇటువంటి, తెలియ వీలు కాని కారణాన్ని, కట్టురై = బాగా తెలియజేయాలి. (కారణం ఏమీ లేదు- అని భావం.)

భగవానుడు ఒక చేతనునివద్దకు వచ్చి, అతని కన్నులలో అప్పటికప్పుడు సాక్షాత్కరించడం, అందుకోసం మనస్సులో తనకు చెందిన వాసన (సంస్కారం) దృఢంగా ఉండడం- దానికి తగిన కారణం ఉన్నపుడే. అంటే- కర్మయోగంవంటి పుణ్యాన్ని చేయాలి. తరువాత, సూక్ష్మమై, సులభంగా పొందడానికి సాధ్యం కాని జీవాత్మవిషయకమైన శాస్త్రాలను అభ్యసించి, భక్తియోగంలో ప్రవేశించాలి. ఇవి అన్నీ అందుకు కారణాలు.



అదే రీతిలో తమ విషయమైన సాక్షాత్కారం కన్నులలో, మనస్సులో నిత్యమైన ధ్యానం కలుగడానికి విశేష సుకృతం, దేవరవారి విషయమైన సూక్ష్మమై, గొప్పదైన గుణచేష్టితాలను పెద్దల మూలంగా చక్కగా విని అభ్యసించ వలసి ఉన్నదికదా! దేనినీ నేను చేయనపుడు నావద్ద వేంచేసి ఉండడం ఏకారణం వల్లనో! అందుకు దేవరవారి గుణమే కారణం.

**93.** అవ :- "కన్నులలో, మనస్సులో శ్రీరామానుజులు నిలువడం ఎందుకోసం?'' అని అంటే, నా పాపాలను ఛేదించడంకోసం - అని అంటున్నారు.

**కట్ట ప్పొరుళై మఱైప్పొరుళెన్డు, కయవర్ శొల్లుమ్**
**పెట్టై క్కెడుక్కుమ్ పిరానల్లనే, ఎన్ పెరు వినైయై**
**క్కిట్టిక్కిళంగొడు తన్నరుళెన్ను మొళ్వాళురువి**
**వెట్టిక్కళైంద, ఇరామానుశనెన్నుమ్ మెయ్త్తవనే.**

కిట్టి = నాదగ్గరకు వచ్చి, తన్ అరుళ్ ఎన్నుమ్ =తమ దయ అనబడే, ఒళ్వాళ్ ఉరువి = కాంతిని కల కత్తిని ఒరనుండి తీసి, దానితో, ఎన్ పెరు వినైయై = నా గొప్ప పాపాలను, వెట్టి కళైన్ద = నఱికి, ఆవల పారవేసిన, ఇరామానుశన్ ఎన్నుమ్ = శ్రీరామానుజులనే, మెయ్ తవన్= వాస్తవమైన తపస్సును కలవారే, కట్టమ్ పొరుళై = స్వరసంకాని, క్లిష్టమైన అర్థాలను, మఱై పొరుళ్ = ఇదే వేదం యొక్క అర్థం, ఎన్డు శొల్లుమ్ = అని వాదించే, కయవర్ = దుష్టుల, పెట్టై = అర్థంలేని వాదాన్ని, కెడుక్కుమ్ = నశింపజేసే, పిరాన్ = ఉపకారకులవుతున్నారు.

తమ మతాలకు పొసగని వేదవాక్యాలకు అన్నిటికీ ఏదయినా అపార్థాన్ని కట్టబెట్టి, కుతర్కాలతో కల్పించి దుర్వాదాలలో పిడివాదాన్ని చేసే కుదృష్టులు అందఱిని జయించే భగవద్రామానుజులకు దుర్వాదం చేయని నా పాపాలను పోగొట్టడంలో ఏమి శ్రమ? దానికోసంవలె,

దీనికోసం గొప్ప జ్ఞానం అక్కరలేదు కదా! దయయేకదా కావాలి "ఆ దయకు అంతటి శక్తి ఏవిధంగా ఉన్నది ?" అని అంటే, వారు యథార్థమైన తపస్సును కలవారు **("మెయ్త్తవర్")** కదా. తపస్సు అంటే కాయ క్లేశాదులు కావచ్చు. **"స్వాధ్యాయ ప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః, తద్ధి తప స్తద్ధి తపః"** అని చెప్పబడ్డ వేదవేదాంతార్థాధ్యాపనాదులు కావచ్చు. **"సత్యమితి సత్యవచా రాథీతరః, తప ఇతి తపోనిత్యః పౌరుశిష్టిః"**- సత్యాన్ని కీర్తించాడు. సత్యాన్ని పల్కే స్వభావాన్ని కల రాథీతరుడు. తపస్సును స్తుతించారు తపస్సులో మునిగిన పౌరుశిష్టి. వేదవేదాంత ప్రవచనాన్ని పొగిడారు మౌద్గల్యుడైన నాడు. ఇది పక్షపాతం లేని మాట- అని వేదాంతం దానిని ప్రశంసిస్తున్నది. వాస్తవమైన వేదాంత ప్రవచనానికి మూలమైన జ్ఞానమనబడే తపస్సు భగవద్రామానుజులవద్దనే.

**94.** అవ :- అన్ని ఫలాలను అనుగ్రహించేవారు, భగవద్రామానుజులు- అని ఇందులో అంటున్నారు.

**తవమ్ తరుమ్ శెల్వమ్ తకవుమ్ తరుమ్, శరియా ప్పిఱవి**
**ప్పవమ్ తరుమ్ తీవినై పాఱ్ఱి త్తరుమ్, పరన్దామ మెన్నుమ్**
**తివమ్ తరుమ్ తీతిలిరామానుశన్ తన్నై చ్చార్న్దవర్కట్కు**
**ఉవన్దరున్దేన్, అవన్శీరన్ఱి యానొన్ఱు ముళ్ మకిళ్న్దే.**

తీదు ఇల్ = దోషం లేని, ఇరామానుశన్ = శ్రీరామానుజులు, తన్నై శార్న్దవర్కట్కు = తనను ఆశ్రయించినవారికి, తవమ్= తపస్సువంటి సత్కర్మలను, తరుమ్ = వృద్ధిచేస్తారు, శెల్వమ్ = అర్థమనే పురుషార్థాన్ని, తరుమ్ = ఇస్తారు, తకవు ఉమ్ = యోగ్యత- ధర్మావిరుద్ధమైన కామం, గృహస్థాశ్రమం కూడా, తరుమ్ = ఇస్తారు, శలియా = వీడిపోని, పిఱవి = జన్మసంతతి అనే, పవమ్ తరుమ్ = సంసారాన్ని కల్గించే, తీవినై = క్రూరకర్మలను, పాఱ్ఱి తరుమ్ = పోగొట్టి, స్వరూపజ్ఞానాన్ని కల్గిస్తారు, పరమ్ దామమ్ = శ్రీవైకుంఠ (పరమపద) మనే, తివమ్ తరుమ్ = వైలోకాన్ని ఇస్తారు, కనుక, అవన్ శీర్ = వారి కల్యాణగుణాలను తప్ప, ఒన్ఱుమ్ = వేఱు దేనినీ, ఉళ్ మకిళ్న్దు = మనస్సులోని తృప్తితో, ఉవన్దు = ఆనందించి, అరున్దేన్ = అనుభవించబోను.



(తవమిత్యాది) - అనేదానికి శరణాగతినిష్ఠను, భక్తిని, తమ దయను అనుగ్రహిస్తారు - అని వివరిస్తారు. ఇంకా పలు రీతులలో వివరించవచ్చు. ధర్మార్థకామమోక్షాలను అనుగ్రహిస్తున్నట్లు ఇక్కడ వ్యాఖ్యానింపబడింది. **"తవమ్"** అనేది యజ్ఞం, దానం, తపస్సు- అనే అన్ని ధర్మాలకు కలిపి ఉదాహరణం. **"తకవు"** అంటే దయ కావచ్చు, యోగ్యత కావచ్చు. దయ- అని అర్థం చెప్పినపుడు **"దయా సర్వభూతేషు"** అని ప్రారంభించి గౌతమధర్మ సూత్రాలలో చెప్పబడిన ఆత్మగుణాలను అన్నిటిని లక్షిస్తుంది **"తవమ్"** అని 40 విధాల సంస్కారాలను కల్గిస్తుంది. వాటిని అన్నిటిని గౌతముడు పల్కిన తరువాత ఆత్మగుణాలనే మోక్షకారణంగా ప్రశంసించాడు. **"తవమ్"** అనేది అంతటా సమాపకక్రియ. **"పరమ్ తరుమ్"** అనే చోటమాత్రం **"తీవినై"**కు విశేషణం. ధర్మార్థకామాలను ఇచ్చేది మోక్షానికి విరోధి కాబోదు - అని ఆ ఫలాన్నిగూర్చి ఇకపై అనుగ్రహించేవారై, అనిష్టనివృత్తి, ఇష్టప్రాప్తి-అని రెండుగా దానిని విభాగిస్తున్నారు. అనాది అయిన కర్మలను నిర్మూలించి, అర్చిరాది మార్గాన్ని అనుగ్రహించి, పరమపదాన్ని పొందిస్తున్నారు- అని భావం. ఈ లోకంలో, పరమపదంలో వీరివల్లనే మంచి -అని భావం. **"తివమ్"** అంటే స్వర్గంకూడా కావచ్చు. దానిని నిషేధించడంకోసంగా **"పరమ్ తామమ్"** అని అనబడింది. **"పరమ్ తామమ్"** - పరమాత్మ అనికూడా అర్థం. వైకుంఠలోకం అనేది వ్యక్తం కావడంకోసం **"పరమ్ తామమ్ ఎన్నుమ్ తివమ్"** అని అనబడింది.

**95.** అవ :- పరంధామాన్ని అనుగ్రహించే భగవానునకు, భాష్యకారులకు మధ్యగల వాసిని గూర్చి పల్కుతున్నారు.

**ఉణ్ణిన్ఱు ఉయిర్కళుక్కుఱ్ఱనవే శెయ్తు, అవర్క్కుయవే**

పణ్ణుమ్ పరనుమ్ పరివిలనామ్బడి, పల్లుయిర్క్కుమ్
విణ్ణిన్ తలైనిన్ఱు వీడళిప్పాన్ ఎమ్మిరామానుశన్
మణ్ణిన్ తలత్తుదిత్తు, ఉయ్ మఱై నాలుమ్ వళర్త్తననే.

ఉయిర్కట్కు = అన్నిఆత్మలకు, ఉళ్ నిన్ఱు = అంతర్యామియై ఉండి, అవర్క్కు = వారికి, ఉఱ్ఱన ఏ =తగినవానినే, శెయ్దు = చేస్తూ, ఉయ ఏ పణ్ణుమ్ = ఉజ్జీవనం కోసమే అన్నీ చేస్తున్న, పరన్ ఉమ్ = సర్వేశ్వరుడు కూడా, పరివు ఇలన్ ఆమ్ పడి = ప్రజలపట్ల సంబంధం లేనివాడు - అనేటట్లుగా, నమ్ ఇరామానుశన్ మన శ్రీరామానుజులు, పల్ ఉయిర్క్కు ఆమ్ = జాతి, గుణాదులతో పలు రీతులలోని వారికి కూడా, వీడు అళిప్పాన్ = మోక్షాన్ని అనుగ్రహించడంకోసం, విణ్ణిన్ తలైనిన్ఱు = పరమపదంనుండి, మణ్ణిన్ తలత్తు = భూతలంలో, ఉదిత్తు = ఉదయించి, ఉయ= ఉజ్జీవించడం కోసమైన, నాలు మఱై ఉమ్ = నాల్గు వేదాలను, వళర్త్తనన్ = వృద్ధిచేశారు.

భగవానుడు జీవులలో అంతర్యామియై ప్రవేశించి ఉండి, సంస్కరించి అందఱికి ఉజ్జీవనాన్ని ప్రసాదిస్తున్నాడు. అతడు చేసేది అంతా స్వాభావిక భావించినా, అజ్ఞానం, ద్వేషం, అయోగ్యులు పోరులో నశించడమే మిక్కుటంగా ఉన్నది. భాష్యకారులు అంతర్యామి కాకుండానే అవతరించి ఎదురుగా నిలచి, పోరుకు అవకాశం ఇవ్వకుండా, ఉజ్జీవనంకోసమే అయిన వేదాలను ఉపదేశించి పగను పోగొట్టి అనుగ్రహించారు. మనస్సును మార్చాలి - అనే భావంతోనే పరమపదం నుండి ప్రత్యేకమైన రీతిలో శ్రీరామానుజులనే అవతారం సంభవించింది. ఎవరు అవతరించారు? అని అంటే, నిత్యసూరులలో ఒకరు, లేక, పరమాత్మయే కావచ్చు. మూర్తిభేదంచేత అతని అన్యమూర్తులను విడచి ఈ మూర్తిని లోకం కీర్తించింది. భగవానుడు జీవులలో ఉన్నా, శాస్త్రాన్ని అతిక్రమించేవారిని అడ్డుకోవడం సాధ్యం కాలేదు. లోపలనే ఉండి భూతం ఆవేశించినట్లుగా చేస్తే అవి ప్రజలకు చేరవు. అపుడు వాటిని తాము బుద్ధిపూర్వకంగా



చేయలేదుకదా! బుద్ధిని కల్గించి చేయవచ్చు- అని అంటే, దానికి ఉపదేశం ఆవశ్యకం. శాస్త్రజ్ఞానం ఉపదేశం లేకుండా ఏర్పడదు. అందుకోసం ఆచార్యునిగా అవతరించే ఇది కావలసి ఉన్నది. పరమపదంలో ఉండేవారే పోవాలా? ప్రకృతిమండలంలోని పైలోకాలలో ఉన్నవారు కూడా అవతరించ వచ్చుకదా! అని అంటే, మిగిలివారికి పూర్ణవిశదజ్ఞానం లేనందువల్ల పలు విషయాలు వారు ఉపదేశించినవి యథార్థానికి మాఱుగా ఉండవచ్చు. ఉపదేశించినది అంతా పరమార్థమై ఉండడం పరమపదంలో ఉండే వారి ఉపదేశంలోనే జరుగుతుంది. **"మఱై నాలుమ్"** - ఇవి ఋగ్యజుస్సామాథర్వణ వేదాలు నాలుగు. లేక, చేతనశ్రుతి, అచేతనశ్రుతి, ~~ఈ~~శ్వరశ్రుతి, ~~ఈ~~శ్వరు నకు మిగిలినవానికి గల శరీర-శరీరిభావాది సంబంధశ్రుతి అనే నాల్గు కావచ్చు. లేక, దివ్యప్రబంధాలనబడే నాలాయిరాన్ని నాల్గు వేదాలుగా గ్రహించవచ్చు. తిరువాయ్మొళి సామవేదం అనే విషయం తెలిసినదే. అదే రీతిలో ముదలాయిరం ఋగ్వేదం. రెండవది యజుర్వేదం. నాల్గవది అయిన ఇయఱ్పా అథర్వణవేదమని గ్రహించాలి. సంస్కృతవేదాలు నాల్గువలె కాక, ద్రావిడవేదం **"ఉయ్మఱై నాలుమ్"** అని దీనికి వైలక్షణ్యమని చెప్పవచ్చు. ఉజ్జీవించడంకోసమైన విషయం భగవానుడు. ఆ స్వామిని ఉద్దేశించి ఇవి స్ఫుటంగా అవతరించాయి.

**96.** అవ :- భగవద్రామానుజులు తమవలె తమ దాసులనుకూడ లోకాన్ని ఉజ్జీవించేటట్లు సంస్కరించి నిలిపినందున, తమవలె వారిని ఆశ్రయించినా క్షేమమే - అనే అర్థం స్ఫురించేటట్లు తమనుగూర్చి ఇందులో అనుగ్రహిస్తున్నారు.

వళరుమ్ పిణికొండ వల్వినైయాల్, మిక్కనల్ వినైయిల్
కిళరుమ్ తుణివు కిడైత్తఱియాతు, ముడైత్తలైయూన్
తళరు మళవుమ్ తరిత్తుమ్ విళుందుమ్ తని తిరివేఱ్కు
ఉళర్ ఎమ్మిఱైవన్, ఇరామానుశన్ తన్నై యుఱ్ఱవరే.

వళరుమ్ = ఇంకాఇంకా పెరిగే, పిణి = వ్యాధులను, కొణ్డ = కార్యంగా కల్గిన, వల్ వినైయాల్ = క్రూరపాపాలకారణంగా, మిక్క= శ్రేష్ఠమైన నల్ వినైయిల్ = సుకృతంలో- మోక్షోపాయంలో, కిళరుమ్ తుణివు = గొప్పదైన విశ్వాసం, కిడైత్తటియాదు =పొందలేకుండా, ముడై తలై = దుర్గంధానికి పూర్ణస్థానమైన, ఊన్ = శరీరం, తళరుమ్ అళవు ఉమ్ = శ్రమను పొందేస్థితిలో కూడా, తరిత్తుమ్ విళున్దుమ్ = మెలకువ, నిద్రగా, లేక జన్మించి మరణించి, తని = సహాయం లేకుండా, తిరివేఱ్కు = సంసారినై, తిరిగే నాకు, ఇరామానుశన్ తన్నై, ఉట్రవర్ ఏ = ఆశ్రయించిన మహనీయులే, ఎమ్ =మనకందఱికి, గౌరవించదగిన, ఇఱైవర్ ఉళర్ = స్వామి- రక్షకులు అవుతున్నారు.

"నల్వినై" అంటే -ధర్మం. అందులో గొప్పది మోక్షోపాయం. దాని ప్రకారాలలో గొప్పది **"న్యాసమేషామ్ తపసామతిరిక్త మాహుః"** (ఈ న్యాసాన్ని అన్ని తపస్సులలో గొప్ప తపస్సు - అని అంటారు.) అని అనబడే శరణాగతి. అందులో విశ్వాసం కల్గి ఉండే వంశంలో జన్మించినా, దానిని తెలియక, దానివల్ల కలిగే ప్రయోజనంలోకూడా అభిలాష లేకుండా, అప్రాకృతమై **"సర్వగంధః, సర్వరసః"** అనే దేహాన్ని పొందవచ్చుకదా! అని తోచకుండా, దేహం లేకుండా కేవలమైన ఆత్మస్వరూపం అయినా పొందవచ్చునని తెలియకుండా, ప్రకృతిమండలంలో జనించే దుర్గంధాలన్నిటినీ తలస్పర్శిగా కల్గిన ఈ ఆభాసశరీరాన్ని క్లేశాన్ని పొందే స్థితిలో కూడా విడువడంకోసం మనస్సు రాకుండా ధరించి, అది లేని సమయంలో కూడా ఎక్కడో పడి ఉండి, తిరిగి జన్మించి, ఏ సమయంలో అయినా ముందు ఉండి అలవాటు పడినవారు వెనుక వెంబడించి రాకుండా ఉండగా, **"తం విద్యాకర్మణీ సమన్వారభేతే"** అనే రీతిలో కర్మవశ్యుడై, కిందకుపైకి తిరిగే నాకు అప్రాకృతరూపం ఉన్నా లేకున్నా, ఆనందమైన స్థితిని అనుగ్రహించే వారు భగవద్రామానుజుల దాసులైన మహాత్ములే (కూరేశులే). రామానుజదాసులను ఆశ్రయిస్తే నారాయణస్థానాన్ని పొంది



చక్కగా ఉజ్జీవించవచ్చు - అని భావం.

**97.** అవ :- భగవద్రామానుజులను ఆశ్రయించినవారి మహిమలను భగవద్రామానుజులే ఆయా సమయాలలో కీర్తించడం ఉన్నది కనుక, ఇందులో సంశయం లేదు. అని అంటున్నారు.

**తన్నైయుట్రాట్చెయ్యుమ్ తన్మైయినోర్, మన్ను తామరైత్తాళ్**
**తన్నైయుట్రాట్చెయ్య ఎన్నై యుయ్ట్రా నిన్ఱు, తన్తకవాల్**
**తన్నైయుట్రారన్ఱి తన్మైయుట్రారిల్లై ఎన్ఱఱిన్దు**
**తన్నైయుట్రారై, ఇరామానుశన్ కుణమ్ శాట్రిడుమే.**

ఇరామానుశన్తన్ = శ్రీరామానుజులు, తన్నై ఉట్రు = తమదగ్గర సంబంధంతో, ఆళ్ శెయ్యుమ్ తన్మైయినోర్ = దాస్యంచేసే స్వభావాన్ని కలవారి, మన్ను = ఆశ్రితరక్షణంలో స్థైర్యాన్ని పొందిన, తామరై తాళ్ తన్నై = పద్మాలవంటి పాదాలను, ఉట్రు = ప్రేమతో ఆశ్రయించి, ఆళ్ శెయ్య = దాస్యంచేసేటట్లు, ఇన్ఱు ఎన్నై ఉయ్త్తాన్ = తమ ఎదురుగానే నాకు దాస్యాన్ని అనుగ్రహించారు, ఇరామానుశన్, తన్ తకవాల్ = తమకృపతో, తన్నై ఉట్రార్ అన్ఱి = నేరుగా తమను ఆశ్రయించినవారు తప్ప, తన్నై ఉట్రార్ ఇల్లై = చరమపర్వనిష్ఠ అనే స్వాభావికమైన చేతనుల స్థితిని పొందగోరేవారు లేరే!, ఎన్ఱు అఱిన్దు = అనేవిధంగా చూచి, ఆస్వభావాన్ని పొందించగోరి, తన్నై ఉట్రారై = తమను ఆశ్రయించిన మహనీయులను, కుణమ్ శాట్రిడుమే = వారి గుణాలను ఘోషించి తెలియజేస్తారు.

**"తన్మైయుత్తారిల్లై"** అనే పదానికే చేతనునకు సారమై, స్వభావ సిద్ధమైన **"అడియార్క్కడిమై"** (దాసులకు దాస్యం) అనే స్థితిలో ఊనికను కలవారు లేరు- అనే అర్థాన్ని గ్రహిస్తే పాశురంలో ఉన్న రీతిలోనే అన్వయం కుదురుతుంది. శ్రీభాష్యకారులు, తమను ఆశ్రయించిన కూరేశులు మడప్పళ్ళియాచ్చాన్, తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్, ఎమ్బార్,

భట్టర్‌వంటివారిని పొగడి పలుమార్లు పల్కడం పలు వృత్తాంతాలు తెలిపే గ్రంథాలనుండి గ్రహించవచ్చు. ఈ పాశురంలో వేఱుగా ఏ విధంగా అన్వయం చెబుతున్నారు? అని అంటే, నాల్గవ పాదాన్ని మూడవ పాదం చివరలోని "తమ్మై" అనే పదానితో చేర్చి, అక్కడ ఉండే "ఇరామానుశన్" అనే దానికి "ఉయ్‌త్తాన్" అనేదానిని మాత్రం సమాపక క్రియగా చేసి, **"ఇరామానుశన్; యుట్రారైయన్ఱి తన్నైయుట్రారై క్కుణమ్ శాత్తిడుమ్ తన్నైయుట్రార్ ఇల్లై ఎన్ఱజిన్దు ఎన్నై, తన్నైయుట్రాట్చెయ్యుమ్ తన్మైయినోరిన్ మన్ను తామరైత్తాళ్ తన్నైయే ఉట్రాట్చెయ్య ఉయ్‌త్తాన్ ఇన్ఱు"** అని **"శాత్తిడుమ్ తన్మై"** అనేదానికి పొగడనీ- అనే స్వభావం - అని అర్థం. తనను ఆశ్రయించినవారి గుణాలను ఎవరూ పొగడలేదే! అని బాధపడి, నన్ను తమను ఆశ్రయించిన కూరేశులనే ఆశ్రయించేటట్లు చేశారు- అని భావం. దీనికి, ముందు తెల్పిన అర్థానికి చివరలో భావం ఒక్కటే అవుతుంది. సరే ఉండనివ్వండి. అయితే, కూరేశులనే పొగడేటట్లు వీరిని ఎందుకు భగవద్రామానుజులు నియమించలేదు? అని అంటే, ఈ సూచనయే చాలునే. పైగా, వారు నియమించే ఉంటారు. కూరేశుల నియమనాన్ని బట్టి వీరు నడువవలసి ఉన్నందున, వారి అభిప్రాయానికి తగినట్లుగా, ఇంకా పలువురి ప్రేరణలకు అంగీకరించి, దివ్యప్రబంధాలతో చేర్చడంకోసం ఈ నూట్రన్దాదిని అనుగ్రహించారు. ఇంకా వీరు భగవద్రామానుజుల విషయంగా విరివిగా రచించిన పాశురాలతో పాటు కూరేశుల విషయంగా రచించినవి కూడా తరువాత వారి సోమరితనంవల్ల అనంతర కాలంలో లుప్తమై పోయాయి - అని చెప్పవచ్చు. భట్టర్ ఎమ్బార్‌ను ఆశ్రయించడం భగవద్రామానుజుల ఆజ్ఞవల్లనే అని చెప్పబడుతున్నది కదా! అదే రీతిలో వీరికి ఈ నియమనం.

98. అవ :- భగవద్రామానుజుల నియమనంకోసం వారిని విడిచిపెట్టడం న్యాయమా? వారు, **"ఎన్నైయే ఆశ్రయి"** (నన్నే ఆశ్రయించు) అని ఉపదేశం చేస్తారా! ఇతరులను ఆశ్రయించమని అనడం ఆచార్యకంలో తమకు



దృష్టి లేకుండా పల్కిన మాటకావచ్చు. లక్ష్మణస్వామి శ్రీరాముని వెంబడిస్తూ అరణ్యానికి బయలుదేరినపుడు తనను విడచి, భరతుడు మొదలైనవారున్నచోటికి చేరి, తమకు చెందినవారికి కైంకర్యం చేయమని శ్రీరాముడు నియమించారుకదా! దానిని లక్ష్మణస్వామి అంగీకరించారా! అదే రీతిలో మీరు, వారే పట్టుకొని (ఆశ్రయించి) ఉండి ఉండాలి- అని తమ మనస్సు తమను అడుగుతున్నట్లు భావించి, దానికి సమాధానాన్ని పల్కుతున్నారు. శ్రీరాముడు ఒంటరిగా వెడుతున్నాడే - అని లక్ష్మణ స్వామి వారి ఆజ్ఞను విడచిపెట్టారు. తల్లి అయిన సుమిత్రయొక్క ఆజ్ఞను అనుసరించి నడచుకొన్నారు. పూర్వం చేసిన శరణాగతికి తగినట్లు అదే తగినది. వీరు చేసే శుశ్రూషకు అయోధ్యలో ఎదురుచూచేవారు లేరు. ఇక్కడ అయితే, భగవద్రామానుజులకు దాస్యం చేయడానికి వేలాది సంఖ్యలో గుమిగూడి ఉన్నారు. ఉత్కృష్టమైన వారి ఆజ్ఞను మొట్టమొదట ఉదయించినదానిని అంగీకరించకపోతే భగవద్రామానుజులకు కైంకర్యం చేశాను - అని ఏవిధంగా నన్ను నేను భావించగలను. అందువల్ల పండ్లు ముంచిన పాలలో పడ్డానుకదా! - అనే రీతిలో గొప్ప ఆనందమే- అనే భావం స్ఫురించేటట్లు పల్కుతున్నారు.

**ఇడుమే యినియ శువర్‌క్కత్తిల్?, ఇన్నుమ్ నరకిలిట్టు**
**చ్చుడుమే? యవట్రై త్తొడర్ తరు తొల్లై, శుళల్ పిఱప్పిల్**
**నడుమే యిని నమ్ ఇరామానుశన్ నమ్మై నమ్‌వశత్తే**
**విడుమే? శరణ మెన్ఱాల్, మనమే! నైయల్ మేవుతఱ్కే.**

మనమే = మనసా!, శరణమ్ ఎన్ఱాల్ = దేవరవారే శరణం అనే విజ్ఞాపనం చేసిన తరువాత, ఇరామానుశన్ = శరణంగా ఆశ్రయింపబడిన శ్రీరామానుజులు, నమ్మై = నిన్ను, నన్ను, ఇనియ = మనకు ఇష్టం కాకపోయినా, లోకానికి ఇష్టమైన, శువర్‌క్కత్తిల్ = దేవలోకంలోకి, ఇడుమ్ ఏ = గెంటివేసేవారైనా, ఇన్నుమ్ = దీనికిముందే మనం పడినదానికి మించి, నరకిల్ ఇట్టు = నరకంలోకి గెండి, శుడుమ్ ఏ = పలు దుఃఖాలతో,

దహించినా, అవఱ్ఱై = ఈ స్వర్గ నరకాలకు అనుబంధమైన, తొల్లై పిఱప్పిల్= అనాదికాలంగా పరిభ్రమింమించి వస్తున్న మృగమనుష్యాది జన్మలలో, నడుమ్ ఏ = నిల్పినప్పటికీ, ఇని నమ్ వశత్తే = లేక, మన ఇష్టప్రకారం, విడు ఏ = నడచుకోవచ్చు - అని నియమించినా, మేవుదఱ్కు = నియమించినదానిని ఆదరంతో గ్రహించడానికి, నైయల్ = క్లేశాన్ని పొందకు, అన్నీ సమమనే భావిస్తావు గాక!

“నన్ను, నా తండ్రి నిప్పులో దూకు, బావినడుమలో పడు - అనే రీతిలో పల్కినా, ఆ విధంగా చేయడానికి సిద్ధంగా ఉన్నాను. వనవాసం కోసమే అభిలషించి జన్మించిన నేను, అక్కడికే పంపితే, విడుస్తానా?” అని భావించి శ్రీరామచంద్రుడు పలికాడు. అదే రీతిలో భగవద్రామా నుజులను తాము ఆశ్రయించిన తర్వాత వారు దేనిని పల్కినా మంచిదే. ఆశ్రితవిరోధంకూడా వారు చేస్తారా? హితాహితాలు మనకు ఏమి తెలుస్తాయి? అందువల్ల వారి అభిప్రాయానుసారం వారి దాసులను ఆశ్రయించడం మనకు చాలా హితమని భావం. **“నరకలిట్టు చ్చుడుమే”** అని అంటున్నారే! భగవద్రామానుజులు ఆ రీతిలో నియమిస్తారా! అని అంటే, నియమించరు - అని **“శరణమెన్దాల్”** అనే పదంతో తెలుపు తున్నారు. అంతటి తీవ్రమైన పదం, మేము అవతారికలో పలికిన రీతిలో ఏర్పడిన ప్రశ్నకు పరిహారం పలుకడంకోసం ప్రయత్నించినందువల్ల ప్రయోగింపబడింది. గతంలోకూడా **“ఇన్బమ్ తరు”** (30), **“ఎన్పెయ్విని తెన్ పులత్తిల్”** (34) అనే రీతిలో నరకప్రస్తావం ఉన్నది. **“అవత్తై త్తొడర్”** ఇత్యాది. భూమిలోని జన్మ స్వర్గ-నరక-సుఖ - దుఃఖాలకు కారణాలైన ధర్మాధర్మాలకు చోటై ఉన్నందున ఈ విధంగా పలుకబడింది. **“నమ్ ఇరామానుశన్”** - అనే పదం మనకు హితాన్నే అన్వేషించేవారు - అనే అర్థాన్ని ఇస్తుంది. తమకోసం ఏమీ కోరకుండా మన హితాన్నే చూచేవారు అయినందువల్ల కదా **“రామానుజ”** అనే పేరును పొందారు. లక్ష్మణస్వామి శ్రీరాముని తృప్తికోసమే అన్నిటినీ చేశాడు. భగవానుని తృప్తికోసమే లోకాన్ని



సంస్కరించారు. **“నైయల్ మేవుదఱ్కు”** అనే పదానికి “ప్రయోజనం పొందడానికి నీవు శ్రమపడవద్దు” అనే అర్థాన్ని పల్కుతారు. వీరు ఏమి కావాలి అని శరణమని అన్నారు? అని అంటే, ఈ ఆత్మ ఉన్నంతకాలం అంతా దేవరవారి ఆజ్ఞకు లోబడినదానినే చేసేటట్లు అనుగ్రహించాలనే కూరేశులు ఆశ్రయించడం, వారి నియమనానికి లోబడి ఉండడం- మొదలైనవి దాని ప్రయోజనాలు.

**99.** అవ :- స్వర్గంలో ఉంచినా, నరకంలోకి గెంటినా, ఏది చేసినా, దానిని గమనించకుండా భగవద్రామానుజులనే సేవించడానికి అంగీకరించాను. అయినా ప్రాణం ఉన్నంతవరకు వారిని సేవించే మీకు ప్రాణంపోయిన తరువాత ఏమి గతి? అనేదానిని ఆలోచించవద్దా? అని అంటే, జైనబౌద్ధాది మతాలలో అభినివేశాన్ని కలవారు తమ ఆచార్యులనే దైవంగా భావించినా, తరువాత అధోగతినే పొందుతారు - అని **“అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపోజనాః”** గీతలో అనుగ్రహించిన రీతిలో కాకుండా, బాహ్యకుదృష్టిమతాలవలె కానట్టి విలక్షణమైన వాస్తవవేదార్థాన్ని భగవద్రామానుజులు స్థాపించినందువల్ల, ఈ సిద్ధాంతానుసారంగానే వాస్తవంగా ఉండే పరమపదమే వెడలి పూర్ణవికాసాన్ని పొంది, భగవద్రామా నుజులను అక్కడ కూడా దర్శించి, సేవించే స్థితియే నిలుస్తుంది- అనే భావం వ్యక్తం అయేటట్లు బదులిస్తున్నారు.

> **తఱ్కు చ్చమణరుమ్ శాక్కియ ప్పేయ్కళుమ్, తాళ్శడైయోన్**
> **శొఱ్కఱ్ఱ శోంబరుమ్ శూనియ వాతరుమ్, నాన్మఱైయుమ్**
> **నిఱ్క క్కుఱుంబు శెయ్ నీశరుమ్ మాండనర్ నీణిలత్తే**
> **పొఱ్కఱ్పకమ్, ఎమ్మిరామానుశముని పోన్ద పిన్నే.**

నమ్ ఇరామానుశముని = మనయతిరాజులనే, పొన్ కఱ్పకమ్ = పారిజాతవృక్షం, పోన్ద పిన్ = ఇక్కడ ఆవిర్భవించిన తరువాత, తఱ్కుమ్ శమణర్ ఉమ్ = భేదాభేద తర్కం చేసే జైనులు, శాక్కియర్ = బౌద్ధులనబడే, పేయ్కళుమ్ = గురువును అతిక్రమించినందున పిశాచమనబడిన మూడు

రీతులలోని వారు, తాళ్ శడైయోన్ = పొడుగైన జడలు ధరించేశివుని, శొల్ కట్ర = ఆగమాన్ని అభ్యసించిన, శోమ్బర్ తమ్ = వైదిక మార్గాన్ని అనుసరించడంలో ఆలస్యం చేసినవారు, శూనియ వాదర్ ఉమ్ = శూన్యవాదమనే బుద్ధుని మతానికే చెందినవారు, నాల్ మఱై ఉమ్ = నాల్గు వేదాలు, నిఱ్క = పూర్వం పల్కిన మతాలను అన్నిటినీ నిరసించి, ప్రకాశిస్తూ నిలవాలని, కుఱుమ్బు శెయ్ = ఆవేదాలను అంగీకరించి, తప్పు అర్థాలను వాటి యథార్థంగా పలికే, నీశరుమ్ = కుదృష్టులైన అద్వైతమతస్థులు, నీళ్ నిలత్తు = విశాలమైన భూమిలో అంతటా, మాణ్డవర్ = ప్రాణాలను తప్పించుకోలేక నశించారు.

ఆభాసమతాలలో శ్రద్ధను కలవారికికదా అధోగతి కల్గుతుంది. నరకాదులకు అవకాశం ఉంటుంది. ఆ బాహ్యకుదృష్టి మతాలు అన్నీ నశించిన తరువాత నాల్గు వేదాల గొప్ప అర్థమే విశాలభూమిలో అంతటా భగవద్రామానుజులనే కల్పవృక్షం ద్వారా వెలిగేటపుడు మనం కోరిన పురుషార్థాన్ని - అంటే - గడచిన పాశురంలో పల్కిన దానిని ఎప్పటికీ పొందుతాము. అందుకోసం కావలసిన దశలు ఈ ఆత్మకు ఆచార్యకృపవల్ల కల్గుతాయి. అందువల్ల **"ముక్త్యైశ్వర్యదినప్రభాత సమయాసత్తిం ప్రసత్తిమ్"** అని చెప్పబడ్డ శ్రీరామానుజ చరణపరిచరణమే మనం కోరేది- అని భావం. దీనివల్ల ఇతరమతాలలో ప్రవేశించి ఉండి, అంతటితో భగవద్రామానుజుల శ్రీచరణాలను ఏదో కారణంతో ఆశ్రయించి ఉంటే అతనికి కూడా మంచిది- అని నిశ్చయించడం వీలు కాదు. వారు నిరసించిన మతాలను ఆభాసమతాలని విడచి, వారినే ఆశ్రయించాలి- అని తెలుపబడినట్లయింది. **"శోమ్బర్"** అనే పదం నిద్రాలస్యమదాలకు కారణమైన తమోగుణాన్ని సూచిస్తుంది. **"తాళ్శడైయోన్"**- (శివుని) వచనాలను అభ్యసిస్తారే తప్ప, జటాధారి అయిన అతడు చేసే పని ఎవరికి ఆరాధన? - అనే దానిని తెలియలేదే! ఇది కూడా సోమరితనం వల్లనే అని భావం. శూన్యవాదులు, శాక్యులు (బౌద్ధులు) ఒకటే అయినా, వారిని వేర్వేరుగా పల్కడంవల్ల **"శాక్కియ**



**ప్పేయరుమ్"** అనే పదంతో శూన్యవాదియైన నిజమైన శాక్యుడు కాకుండా మిగిలిన యోగాచారుడు, సౌతాంత్రికుడు, వైభాషికుడు - అనే ముగ్గురిని మాత్రం గ్రహించాలి. వీరు పిశాచంవలె శాక్యుడైన బుద్ధునితో వాదించి అతని వాదాన్ని మార్చి, వేఱు విధంగా గ్రహించినవారు - అనే విషయం సూచింప బడింది. అయితే, శిష్యుల ఎదిరింపు ఆచార్యుని పలుకులే అయినా, శూన్యవాదం చెడ్డది - అనేదానిని సూచిస్తుంది. అయినా నిజమైన మతాన్ని విడచినా పిశాచాలు వీరు.

**100.** అవ :- నాకు వివేకం కల్గినందువల్ల భగవద్రామానుజుల శ్రీపాద పద్మంలోని మకరందాన్ని ఆస్వాదించడమే నాకు గొప్ప ప్రాప్యం- అని పలికేవారై, దానినే అనుగ్రహించమని అర్థిస్తున్నారు - నూఱవ పాశురంలో. ఇందులో పల్కినదే నూత్తన్దాది ప్రబంధం మొత్తానికి అర్థం.

**పోన్దతెన్నెంజెన్నుమ్ పొన్ వణ్డు, ఉనతడిప్పోతిల్ ఒణ్శీ-**
**రాన్దెళితేనుండుమర్న్దిడ వేండి, నిన్పాలతువే**
**ఈన్దిడ వేండుమ్ ఇరామానుశ! ఇతు వన్ఱి యొన్ఱుమ్**
**మాన్దకిల్లాతు, ఇని మట్రొన్ఱు కాట్టి మయక్కిడలే.**

ఇరామానుశ = శ్రీరామానుజా!, ఎన్ నెఞ్జమ్ ఎన్నుమ్ = నా మనస్సు అనే, పొన్ వణ్డు = గొప్ప తుమ్మెద, ఉనదు అడి పోదిల్ = మీ శ్రీచరణపద్మాలతో, ఒణ్ శీర్ ఆమ్ = అందమైన గుణాలనే, తేన్ ఉణ్డు = తేనెను తాగి, అమర్న్దిడ = అక్కడే స్థిరంగా నిలవాలని, వేణ్డి = ఆశపడి, నిన్పాల్ = మీవద్దకు, పోన్దదు = వచ్చినది, అదు ఏ = దానినే, ఈన్దిడ వేణ్డుమ్ = అనుగ్రహించాలి, ఇదు అన్ఱి = ఈ తేనెకాకుండా, ఒన్ఱుమ్ = వేఱు దేనినీ, మాన్దకిల్లాదు = మనస్సు ఆశపడదు, ఇని = ఈ స్థితిలో, మట్రు ఒన్ఱు = వేఱు ఏ ప్రయోజనాన్ని, కాట్టి = అనుభవింపజేయదలచి, మయక్కిడిల్ = మమ్ములను వ్యామోహింప జేయవద్దు.

కొన్ని అంశాలు పురుషార్థాలే కావు. **"నాథే నస్తృణమన్యదన్యదపి**

**వా"** అనే రీతిలో అత్యల్పమై లౌకికం, వైదికం అయిన ఐహికం, ఆముష్మికైశ్వర్యం, కైవల్యం, మోక్షమనే పురుషార్థాల కోసం నాథునివద్ద వేడడం లేదు. ఆచార్యపాదారవింద పరిచరణమే వేడేది. పూర్వం- **"ఇడుమే ఇనియ శువర్క్కత్తిల్"** అనే పాశురంలో "ఏదైనా సరే" అని పల్కినవారు ఇపుడు **"మత్తొన్ఱు కాట్టి మయక్కిడిల్"** అని అనడం ఎందుకు? అని అంటే, ఆచార్యచరణాన్ని ఆశ్రయించడం, వారి చరణపద్మ మకరందాన్ని ఆస్వాదించడం - అనేదానినితో చేర్చి దేనిని అనుగ్రహించినా సరే, దీనినుండి వేఱు చేసి వేఱు దేనిని ఇవ్వవద్దు" అని అంటున్నారు. **"దివి వా భువి వా మమాస్తు వాసో నరకే వా నరకాంతక! ప్రకామమ్, అవధీరిత శారదారవిందౌ చరణౌ తే మరణేఽపి చింతయామి"** (నా నివాసం స్వర్గంలో అయినా, నరకంలో అయినా కానీ, ఓ నరకాంతకా! శరదృతువులోని అందమైన పద్మాలవంటి నీ చరణాలను నేను మరణసమయంలో కూడా ధ్యానించాలి.) అని పల్కినట్లే ఇదికూడా. ఇక్కడ మరణకాలంలోను అతని చరణాలలోని చింతనను అపేక్షించడం, తరువాత ఎక్కడికి పోయినా దాని విషయంగా అనుభవం తగ్గకుండా ఉండడంకోసం **"యం యం వాఽపి స్మరన్ భావం త్యజంత్యంతే కలేబరమ్, తం తమేవైతి"** (తమ అంతిమకాలంలో దేనిని స్మరిస్తూ శరీరాన్ని విడుస్తారో, మరుజన్మలో దానినే పొందుతారు.) అనే రీతిలో తరువాత కూడా దీని అనువృత్తియే కదా!

**101.** అవ :- ద్వివిధ ప్రబలకర్మలను తొలగించి ప్రకృతినుండి వేఱు చేసిన పిమ్మటనే భగవద్రామానుజుల శ్రీచరణాలను సేవించడం నిరాటంకంగా లభిస్తుంది. కనుక, దానినికూడా కోరడం ఉచితమే. మిగిలిన పురుషార్థాలను అనుగ్రహించి మోహింపజేయవద్దు - అనడం తగును. కర్మలను తొలగించడంవంటిది వద్దు - అని పలుకవచ్చునా? అని అంటే, దానికి బదులును భావించి పల్కుతున్నారు.



**మయక్కు మిరువినై వల్లియిల్ పూండు, మతి మయంగి**
**త్తుయక్కుమ్ పిఱవియిల్ తోన్ఱియ ఎన్నై, త్తుయరకఱ్ఱి**
**ఉయక్కొండు నల్కుమ్ ఇరామానుశ! ఎన్ఱతున్నై యున్ని**
**నయక్కుమవర్క్కితు ఇళుక్కెన్బర్, నల్లవరెన్ఱు నైన్దే.**

మయక్కుమ్ =అజ్ఞానానికి కారణమైన, ఇరు వినై = రెండువిధాలైన కర్మలనే, వల్లియిల్ పూణ్డు=సంకెళ్ళలో బంధింపబడి, మదిమయఙ్గి = బుద్ధి అజ్ఞానాన్నే పొందగా, తుయక్కుమ్ = విపరీతజ్ఞానాన్నే కల్గించే, పిఱవియిల్ = జన్మలలో, తోన్ఱియ = జన్మిస్తూ వచ్చే, ఎన్నై = ఈ ఆత్మను, తుయర్ అకఱ్ఱి = దుఃఖాలకోసమై కర్మలనుండి విడిపించి, ఉయ కొణ్డు = ఉజ్జీవించేటట్లు స్వీకరించి, నల్కుమ్ = స్నేహాన్ని పొందే, ఇరామానుశా = శ్రీరామానుజా!, ఎన్ఱదు ఇదు = అని కర్మబంధంలో దృష్టిలో పల్కడం, ఉన్నై ఉన్ని=నీ అనుభవంలో మునిగి, ఎన్ఱుమ్ నైన్దు = ఎల్లప్పుడు ద్రవించి, నయక్కుమవర్క్కు = ఆశపడినవారికి, ఇళుక్కు ఆకుమ్ = కొఱత అవుతుంది, ఎన్బర్ నల్లవర్ = అని సత్పురుషులు పల్కుతారు.

భగవద్రామానుజుల కల్యాణగుణాలలోను, తిరుమేనిలోను అభినివేశాన్ని పొంది ఆనందించేవారు, తనకు బంధాలు తొలగిపోవడాన్ని, దుఃఖాలు తీరడాన్ని, పరమపదప్రాప్తిని మధ్యమధ్యలో భావించేవారైతే, వాటికోసమే ఆచార్యానుభవం కాబోలు - అని పరిహసించే రీతిలో ఉంటుంది. అందువల్ల వాటిని పూర్తిగా మఱచి, ఆచార్యానుభవంలో మగ్నమై ఉండడమే ఉత్తమకల్పం - అని భావం. అంతమాత్రమే తప్ప, అవి అన్నీ వద్దు- అనే దానిలో దృష్టి లేదు. ముఖ్యమైన ఫలం ఇది. దీనికోసమే అవి తామే సిద్ధిస్తాయి.

**102.** అవ :- అనుభవంలో అవగాహించి ఉండడమంటే, దేనినిగూర్చి పలుకకూడదని అర్థం కాదు. అన్ని ఇంద్రియాలను కొల్లగొట్టే వైలక్షణ్యం

భగవద్రామానుజులకు ఉన్నది కనుక, ఆయా ఇంద్రియవ్యాపారాలు అనుభవపరీవాహంగా కల్గి తీరుతాయి. వేఱు ప్రయోజనాన్ని తలచి అనుభవాన్ని విడువకూడదు- అనేదే పూర్వం చెప్పిన దానికి విడువకూడదు అనేదే పూర్వం చెప్పిన దానికి భావమని తెలుపగా, ఇంద్రియాల తహతహను ఇందులో వివరిస్తున్నారు.

నైయుమ్ మనమున్ కుణంగళై యున్ని, ఎన్నా విరున్దెమ్
ఐయన్ ఇరామానుశన్ ఎన్ఱళైక్కుమ్, అరువినైయేన్
కైయున్దొళుమ్ కణ్ కరుతిడుమ్ కాణ క్కడల్ పుడైశూళ్
వైయమితనిల్, ఉన్ వణ్మై ఎన్పాల్ ఎన్ వళర్న్దతువే.

మనమ్ ఉన్ = నామనస్సు మీ, కుణజ్గళ్ ఉన్ని = గుణాలను కల్యాణాలుగా గమనించి, ఎన్ నా = నా జిహ్వ, ఇరున్దు = స్థిరంగా నిలచి ఉండి, ఎమ్ ఐయన్ = మాకు స్వామి అయిన, ఇరామానుశన్ = భగవద్రామానుజులే, ఎన్ఱు అళైక్కుమ్ = అని నామసంకీర్తనం చేస్తుంది, అరు వినైయేన్ = కఠినమైన పాపాన్ని కల నా, కై ఉమ్ = చేతులు కూడా, తొళుమ్ = అంజలి చేస్తున్నవి, కణ్ కాణ = కన్నులు కూడా సదా దర్శించడానికి, కరుతిడుమ్ = దృఢాధ్యవసాయాన్ని కల్గి ఉన్నవి, కడల్ పుడై శూళ్ = చుట్టుపక్కల సముద్రంతో చుట్టబడి ఉండే, వైయమ్ అదనిల్ = భూమిలో, ఎన్పాల్ = అందఱి కంటే నాపట్లనే ఈ రీతిలో, ఉన్ ఉణ్మై = మీ వైలక్షణ్యమనేది, లేక ఔదార్యగుణమనేది, వళర్న్దదు ఎన్ = వృద్ధిచెందినది ఏమో!

మనోవాక్కాయాలనుగూర్చి, నేత్రాలనుగూర్చి పల్కడం మిగిలిన వానికి ఉపలక్షణం కనుక, చెవులు, పాదాలు మొదలైనవికూడా అభినివేశాన్ని పొందుతున్నాయి- అని ఇక్కడ తెలిపినట్లయింది.

**103.** అవ :- ఇంద్రియాలు అన్నీ వారి విషయంలోనే లగ్నం కావడానికి వారు అనుగ్రహించిన జ్ఞానమే కారణం. అజ్ఞానానికి విరోధులై ఉండే



కర్మలను వారు తీర్చడమనేది, వారి ధ్యానంలో తన కల్యాణగుణాలను వృద్ధి చేసినవాడైన నరసింహునియొక్క హిరణ్యాసుర సంహారానికి ఈడు అవుతుంది - అని అంటున్నారు.

వళర్న్ద వెజ్గోప మడంగలొన్ఱాయ్, అన్ఱు వాళవుణన్
కిళర్న్ద పొన్నాకమ్ కిళిత్తవన్, కీర్త్తిప్పయిర్ ఎళున్దు
విళైన్దిడుమ్ శిందై యిరామానుశన్ ఎన్ఱన్ మెయ్ వినైనోయ్
కళైన్దు నన్ఞాన మళిత్తనన్, కైయిల్ కని యెన్నవే.

అన్ఱు = ప్రహ్లాదాళ్వాన్‌ను పీడించిన కాలంలో, వళర్న్ద = అవతరించాలని ప్రహ్లాదుని వరకు సహించలేక పైకి విజృంభించిన, వెమ్ కోపమ్ = క్రూరమైన కోపాన్ని కల, మడజ్గల్ ఒన్ఱు ఆయ్ = లోకవిలక్షణమైన (నర)సింహమై, వాళ్ అవుణన్ = చేతిలో ఖడ్గాన్ని ధరించి, హిరణ్యకశిపుని, కిళర్న్ద =యుద్ధంకోసమే వృద్ధిచెందిన, పొన్ ఆ కమ్ = బంగారంవంటి వక్షస్సును, కిళిత్తవన్ = నఖాలతో చీల్చిన నారాయణుని, కీర్త్తి పయిర్ = గుణాలనే పైరులు, ఎళున్దు =చక్కగా వృద్ధినిపొంది, విళైన్దిడుమ్ =ఫలించేచోటైన, శిన్దై = మనస్సును కల, ఇరామానుశన్ = ఆచార్యులు శ్రీరామానుజులు, ఎన్తన్ మెయ్ = నా శరీరంలో కల్గిన, వినై నోయ్ = కర్మలనే వ్యాధులను, కళైన్దు = సమూలంగా పెరికి పారవేసి, కైయిల్ కని = అరచేతిలో ఉసిరిక, ఎన = అనేటట్లు విశదంగా, ఞానమ్ అళిత్తనన్ = జ్ఞానాన్ని అనుగ్రహించారు.

భగవద్రామానుజులు భగవానుడు మొదలైనవారి గుణాలను అనుసంధించడమే మనోవాక్కాయాలతో చేసే కఠినకృత్యాలే కలుపులు. పైరుకు వచ్చే తెగుళ్ళలో కలుపైన గడ్డికూడా చేరుతుంది. బ్రహ్మజ్ఞానం కలుగనందువల్ల, ఉపకోసలుడనే శిష్యుడు, ఆచార్యపత్ని భుజించమని నియమించినపుడు, “బహవో మే నానాత్యయాః కామాః, వ్యాధిభిః ప్రతిపూర్ణోఽస్మి, నాహమశిష్యామి” అని అంటూ భుజించకుండా

ఉండడానికే నిర్ణయించుకొన్నాడు. పలు విధాలైన నాశాలను కల్గించే కామక్రోధాదులే ఉపనిషత్తుల్లో వ్యాధులుగా నిర్దేశింపబడ్డాయి. విషయ సంగం, వ్యాధులు విడిచిపోనివి. ఇటువంటి సంసారకృత్యాలన్నీ తొలగడం ఏజ్ఞానంవల్ల జరుగుతుందో ఆ జ్ఞానాన్ని మనకు ఆచార్యులు అనుగ్రహించారు. అరచేతిలో పెట్టుకొన్న ఉసిరిక పండువలె స్ఫుటంగా అన్ని తత్త్వాలు తెలుస్తున్నవి. అందువల్ల ప్రహ్లాదుని మనస్సులోవలె భగవద్రామానుజుల మనస్సులో వృద్ధి చెందే భగవానుని గుణాలు అందఱు జీవుల హృదయాలలో కూడా వెలిగినవి అయినవి- అని భావం.

**"మెయ్‌వినై నోయ్"** - ఆత్మకు ప్రాకృతశరీరంలో దాని సంబంధం మూలంగాను, దాని కార్యమైన కర్మలమూలంగాను పలు వ్యాధులు కల్గుతాయి. స్వాభావికమైన రూపం ప్రకాశించేటపుడు అప్రాకృతమైన శరీరం, దానివల్ల కలిగే కైంకర్యం అనేకృత్యాలు ఉన్నా, కర్మకృతమైన వ్యాధులు లేవని తెలుపబడంకోసం **"మెయ్"** అని భావించినంత మాత్రంలో పోకుండా, భగవద్రామానుజుల మూలంగా ఉపాయం లేకుండా వేఱు విధంగా తొలగకుండా ఉండే **"వినై నోయ్"** అని అర్థం. పైన భగవద్రామానుజుల తిరుమేనినిగూర్చి చెప్పబోతున్నారు. తమ శరీరానికి దానికంటే గల వాసి ఇక్కడ తెలుపబడింది. శరీరమూలకమైన దుఃఖంవంటి ఆత్మదుర్గుణాలుకూడా వ్యాధులే.

**104.** అవ :- భగవద్రామానుజులు అనుగ్రహించిన జ్ఞానం చేతిలో ఉసిరిక పండువంటిది - అని అంటే, అంతటితో నిలువకుండా తాము కోరినది ఏమి? అనేదానిని వివరించి తెల్పుతున్నారు.

> కైయిల్ కని ఎన్న క్కణ్ణనై క్కాట్టి త్తరిలుమ్, ఉన్‌తన్
> మెయ్యిల్ పిఱంగియ శీర్‌ష్టి వేండిలన్ యాన్, నిరయ
> త్తొయ్యిల్ కిడక్కిలుమ్ శోతివిణ్ శేరిలుమ్ ఇవ్వరుళ్ నీ
> శెయ్యిల్ తరిప్పన్, ఇరామానుశ! ఎమ్ శెఴుఙ్కొండలే.



ఇరామానుశ = శ్రీరామానుజా!, ఎన్ శెఴు కొణ్డలే = నాకు ప్రియమైన, దట్టమైన మేఘమా!, కణ్ణనై = శ్రీకృష్ణుని, కైయిల్ కని = చేతిలోపెట్టిన ఉసిరికపండు, ఎన్న = అనేటట్లు, కాట్టి తరిలుమ్ = ప్రత్యక్షీకరించి, దేవరవారు అనుగ్రహించినా, ఉన్తన్ =దేవరవారి, మెయ్యిల్ = తిరుమేనిలో, పిఱఙ్గియ = ప్రకాశించే, శీర్ అన్ఱి = కల్యాణగుణాలను విడచి, వేఱు దేనినీ, యాన్ వేణ్డిలన్ = నేను అపేక్షించడంలేదు, ఎంతకాలం ఈవిధంగా? అంటే, నిరయ త్తొయ్యిల్ = నరకమనే పల్లంలో (బురదలో) నేను, కిడక్కిలుమ్ =పడిపోవడం జరిగినా,

దేవరవారి తిరుమేనియొక్క కల్యాణగుణాలన్నీ చక్కగా అనుభవం లో ఏకాలంలో అయినా నాకు ఉండాలి. దీనినే అనుగ్రహించాలి. నమ్మాళ్వార్లు శ్రీకృష్ణుని లెక్కలేన్ని పాశురాలతో దర్శింపజేసినా, **"కణ్ణినుణ్ శిఱుత్తాంబినాల్ కట్టుణ్ణ ప్పణ్ణియ పెరుమాయన్ ఎన్నప్పనిల్"** అని కీర్తించే అతనిని కాదని **"తెన్‌కురుకూర్"** అని అంటే, తీయగా ఉండే జిహ్వను కలవారయ్యారు, మధురకవులు. అదేరీతిలో తిరువరఙ్గత్తముదనార్‌కు భగవద్రామానుజుల తిరుమేని కల్యాణగుణాలను అనుభవించడంలో గొప్ప అభినివేశమున్నది- అని భావం. తిరుమేనిని వర్ణించకుండా వేఱు విషయాలనే పల్కినవారు, తద్విషయంగా సంగ్రహంగా ఇక్కడ అనుగ్రహించారు. **"శెఴుమ్ కొణ్డలే"** అని దాని ప్రభావం ఒక విధంగా సూచింపబడేది. **"తొయ్యిల్"** అనే నామవాచకానికి బురద-అని అర్థం. **"తొయ్యిలిల్"** అనే సప్తమీవిభక్తి ప్రత్యయం అధ్యాహరించుకోవాలి.

**105.** అవ :- భగవానుని అనుభవంకంటే భగవద్రామానుజుల అనుభవం గొప్పది - అని అంటున్నారే. ఇది మీ మోహమో? నిజంగానే గొప్పదా? - అని ప్రశ్నించినవారికి బదులిస్తున్నారు.

> శెఴున్దిరై ప్పాఱ్కడల్ కండుయిల్ మాయన్, తిరువడిక్కీఴ్
> విఴున్దిరుప్పార్ నెంజిల్ మేవు నన్ఞాని, నల్‌వేతియర్‌కళ్

**తొళున్దిరుప్పాఱ నిరామానుశనై త్తొళుమ్ పెరియోర్**
**ఎళున్దిరైత్తాడుమిడమ్, అడియేనుక్కిరుప్పిడమే.**

శెళు తిరై = ఘనంగా పైకి లేచిన కెరటాలను కల, పాల్ కడల్ = క్షీరాబ్ధిలో, కణ్ తుయిల్ = నిద్రించే (యోగనిద్రనుచేసే), మాయన్ = జగద్వ్యాపారంలో దృష్టిని కల శ్రియఃపతియొక్క, తిరువడి కీళ్ = శ్రీచరణాలకింద పీఠంలో, ఎళున్దిరుప్పార్ = ప్రణామం చేయగలవారి, నెఞ్జిల్ మేవుమ్ నల్ ఞాని = మనస్సులో గొప్పజ్ఞానాన్ని కలవారని ప్రీతికి విషయమవుతున్నవారు, (ప్రత్యక్షంగా), నల్ వేదియర్కళ్ = వేదవేదాంగ శాస్త్రజ్ఞాన వైలక్షణ్యాన్ని కలవారిచే, తొళు తిరు పాదన్ = నమస్కరింపబడే శ్రీచరణాలను కలవారైన, ఇరామానుశనై =భగవద్రామానుజులను, తొళుమ్ = వారు లేనిచోట్లకూడా నమస్కరించే, పెరియోర్ = మహాత్ములు, ఎళున్దు ఇరైత్తు = ఆకాశంలోకి లేచి, వారినిగూర్చి ఘోషిస్తూ, ఆడుమ్ ఇడమ్ = నృత్యం చేయడానికి తగినచోట్లు- దాసునకు, ఇరుప్పిడమ్ = దివ్యక్షేత్రాలు.

అన్ని విభవమూర్తులకు మూలస్థానమై ఉండేది క్షీరాబ్ధి. అక్కడకు చేరి శ్రియఃపతి శ్రీచరణాలలో నమస్కరించే అవధిలో శక్తిని కలవారు కొందఱు దేవతలు, దేవర్షులు, వ్యాసునివంటి కొందరు మహాత్ములు మాత్రమే. వారి మనస్సులో కూడా నిలచి ప్రకాశించేవారు మన శ్రీరామానుజులు. బ్రహ్మసూత్రాలను రచించారని శ్రీకృష్ణుడు వేదవ్యాసుని కీర్తించి పలికాడు. మనం వ్రాసిన సూత్రానికి మన బోధాయనుడు చూపిన దారిలోనే వాస్తవమైన అర్థాన్ని ఇక్కడ వ్యక్తం చేశారే ! అని వేదవ్యాసుడు భగవద్రామానుజులను మనస్సులో భావించే రీతిలో ఉన్నాడు. వాస్తవాన్ని దర్శించిన మహాత్ముని దర్శించినపుడు లోకమే నమస్కరిస్తుంది. దేవతల వద్దకూడా గౌరవాన్ని పొందుతారు. ఈవిధంగా వారి వారి మనస్సులో ప్రకాశించే వీరే ఇక్కడ ఎల్లప్పుడు దరిచేరి శ్రీచరణాలలో దండం పెట్టి కీర్తించే ప్రాజ్ఞులు శ్రీరంగాదులలో



ఉండగా, వేఱు ప్రదేశాలలో శ్రీభాష్యాది గ్రంథప్రచారం చేస్తూ, ఆకాశం అంత ఎత్తుకు ఎగిరి, వారినిగూర్చి ఘోషిస్తూ నృత్యం చేసే మహాత్ములు ఎక్కడెక్కడ ఉన్నారో, అక్కడక్కడకు పోయి వారు పాడి ఆడేటపుడు కలసి మెలసి మెలగాలి. ఈ పాశురాలను నేను అక్కడ పాడాలి. వారు పాడే పాశురాలను విని నేనుకూడా ఆడాలి. అక్కడ శ్రియఃపతికి ప్రత్యేకమైన కోవెల కావాలని అనేది లేదు. వారికి స్థానమై, భగవద్రామానుజులను కీర్తించే చోటే గొప్ప దేశం - అని భావం.

**106.** అవ :- తమకు చోటు ఏదో, దానిని తెలిపారు. ఇక భగవానునకు - స్థానమై, భగవద్రామానుజులకుకూడా ఆనందాన్ని కల్గించే చోటు ఏదో, దానిని గూర్చి తెల్పుతున్నారు.

**ఇరుప్పిడమ్ వైకుందమ్ వేంగడమ్, మాలిరుమ్ శోలై యెన్నుమ్**
**పొరుప్పిడమ్ మాయనుక్కెన్బర్ నల్లోర్, అవై తన్నొడుమ్ వన్దు**
**ఇరుప్పిడమ్ మాయనిరామానుశన్ మనత్తిన్నవన్వ-**
**న్దిరుప్పిడమ్, ఎన్ ఇనితయత్తుళ్ళే తనక్కిన్బుఱవే.**

నల్లోర్ = వాస్తవాన్ని తెలిసినవారు, వైకున్దమ్ = పరమపదం, వేఙ్గడమ్ = శ్రీవేంకటాద్రి, మాలిరుమ్ శోలై = తిరుమాలిరుమ్శోలై, ఎన్నుమ్ = అనబడే, పొరుప్పు = పర్వతం మొదలైన, ఇడమ్ = స్థలాలు, మాయనుక్కు = శ్రియఃపతికి, ఇరుప్పిడమ్ ఎన్బర్ = తిరుపతులు అని పల్కుతున్నారు, అవై తన్నొడుమ్ = ఆ తిరుపతులను తనతో చేర్చుకొని, మాయన్ వన్దు = శ్రియఃపతివచ్చి, ఇరుప్పు ఇడమ్ = ఉండడానికిచోటు, ఇరామానుశన్ మనత్తిలుమ్ = శ్రీరామానుజుల మనస్సులో, అవన్ = ఆవిధంగా అన్నిటిని కల్గిన మనస్సుతో శ్రీరామానుజులు, తనక్కు ఇన్బమ్ ఉఱ = తాము ఆనందం పొందడంకోసం, ఇన్దు ఇరుప్పు= ఇపుడు ఉండడానికి, ఇడమ్ ఎన్దన్ = చోటు-నా, ఇదయత్తు ఉళ్ళే = మనస్సు లోపలే.

పరమపదంనుండి వేంకటాచలం వచ్చేవరకు మధ్య మధ్యలో భగవానునకు చోట్లు సూర్యమండలం మొదలైనవి పలు ఉన్నాయి. వేంకటాచలంనుండి తెన్‌తిరుమాలిరుమ్ శోలైవరకు మధ్య మధ్యలో ఎన్నో దివ్యదేశాలు. శ్రియఃపతి వేంచేసి ఉండేవి ఆ దివ్యదేశాలన్నిటిలో. వీటిలో దేనినీ విడువకుండా అనుభవించేవారు భగవద్రామానుజులు. ఒక దివ్యదేశంలో వేఱొక దివ్యదేశంలోని భగవానుడు ఉండడు. అన్ని దివ్యదేశాలు అడ్డు లేకుండా చేరి ఉండేది వీరు మనస్సులోనే. అక్కడకూడా **"మనమ్"** అని అనకుండా **"మనత్తు"** అనేది **"ఇహైకస్థం జగత్ కృత్స్నమ్"** అనే రీతిలో దాని ఒక భాగంలోనే ఇవి అన్నీ అణగి ఉన్నాయని తెలుపడంకోసం. ఈ పరిమితితో చేరిన భగవద్రామానుజులు శ్రీరంగం మొదలైన పలుచోట్ల వేంచేసి ఉన్నా, అన్నిటితోకూడా ఆ చోట్లలో వేంచేసి ఉండరు. వీరు వేఱు మనస్సులో ఉన్నా, తమకు ఆనందం కలిగేటట్లుగా అన్నిటితో కలసి వేంచేసి ఉండేది నా హృదయంలోని లోపలి భాగంలోనే. అంతర్భాగమై ఉన్నందువల్ల దీనిని విడచిపోవడం వీలు కాదు. వారి స్తోత్రం ఇంతటితో ముగిసినా వారిని, వారిని చేరిన విషయాలను ఏనాడూ విడువకుండా నా చిత్తం చింతించిన రీతిలోనే ఉంటుందని భావం. ఒక్కొక్క స్థలంలోను వారు అనుభవించే రీతులను వర్ణించడానికి ఇంకా ఎన్నో పాశురాలు కావాలి - అని భావం.

**107.** అవ :- భగవద్రామానుజులు తమ హృదయంలో అన్నిటితోపాటు కూడి నెలకొని ఉండడం తెలుపబడింది. ఈ జ్ఞానం పరమపదానికి వెళ్ళినా అభివృద్ధమై ఉంటుంది అనడంలో సందేహం లేదు. ఇపుడు ఏర్పడే ఈ సంస్కారం (వాసన) దీనికి పిమ్మట ఇక ప్రకృతిమండలంలో పలు జన్మలు నాకు కల్గినా అనువర్తించి దీని మూలంగా స్మృతులు ప్రకాశించాలి. ఆ విధంగా ప్రకాశించడం దానితో వ్యర్థంగా ఉండడానికి కాకుండా అక్కడక్కడ దేవరవారలకు దాసులై ఎవరు ఎవరు ప్రకాశిస్తున్నారో, వారికి అందఱికి దాస్యం చేసే అవధికి పరీవాహం అయేటట్లు ఈ



నాస్మృతులు వెలువడాలి - అని వేడుతున్నారు. ఈదశ కల్గితే ఇది పరమపదంలో శ్రియఃపతి అనుభవానికి మించినది అవుతుంది- అని వీరి అభిప్రాయం.

**ఇన్బుఱ్ఱ శీలత్తిరామానుశా!, ఎన్డ్రు మెవ్విడత్తుమ్**
**ఎన్బుఱ్ఱ నోయుడల్ తోఱుమ్ పిఱన్దిఱన్దు, ఎణ్ణరియ**
**తున్బుఱ్ఱు వీయినుమ్ శొల్లువతొన్డ్రుండున్ తొండర్‌కట్కే**
**అన్బుఱ్ఱిరుక్కుమ్బడి, ఎన్నై యాక్కి యఙ్గాట్పడుత్తే.**

ఇన్బు ఉఱ్ఱ = ప్రీతిని నిండిన, శీలత్తు = సద్గుణాలనే కల్గిన, ఇరామానుశా = శ్రీరామానుజా!, శొల్లువదు = దేవరవారి వద్ద విజ్ఞాపించేది, ఒన్డు ఉణ్డు = నాకొక విషయం ఉన్నది, ఏది? అంటే, ఎన్డుమ్ = ఏకాలంలో అయినా, ఎ ఇడత్తు ఉమ్ = ఏదేశంలోను, ఎన్బు ఉఱ్ఱ = ఎముకలో సంబంధించిన, నోయ్ = పలువిధ వ్యాధులను కల, ఉడల్ తోఱుమ్ = ఒక్కొక్క శరీరంలోను, పిఱన్దు ఇఱన్దు = జన్మించడం, మరణించడమై, ఎణ్ అరియ = లెక్కకుమించిన, తున్బు ఉఱ్ఱు = దుఃఖాలను అనుభవించి, వీయిన్ ఉమ్ = నశించేవాడనైనా, ఉన్ తొణ్డర్ కట్కు ఏ = దేవరవారి పట్ల భక్తిని కలవారికి మాత్రమే, అన్బు ఉఱ్ఱు = భక్తి కల్గినవాడనై, ఇరుక్కుమ్బడి= స్థిరంగా ఉండేవిధంగా, ఎన్నై ఆక్కి = నన్ను రూపొందించి, అఙ్గు = ఆ దాసులకు, ఆళ్ పడుత్తు = దాసునిగా చేయాలి- అనేదే.

జన్మయే కలుగకుండా ఉండవచ్చు. జన్మకల్గినా బాధలు, వ్యాధులు, లేని జీవనం కలుగవచ్చు. ఆ జీవనంలో భగవద్రామానుజ భక్తులకు ఉత్సాహంతో కైంకర్యం చేయడానికి వీలు అవుతుంది. జన్మలో పలు పలు వ్యాధులతో బాధపడేటపుడు వాటిని అనుభవించి దుఃఖించడంలో కాలం అంతా గడిస్తే ఏమి చేయను? అపుడుకూడా వారి దాసులకు దాస్యం చేయడంలోని ఉత్సాహంవల్ల ఆ దుఃఖాలు తెలియకుండా మఱుగుపడాలి- అని ప్రార్థించబడింది. ఇంతమాత్రం ఆశను పొందిన నాకు

ఈజన్మలోనే అన్నివేళల దేవరవారికి దేవరవారి దాసులయొక్క కైంకర్యాన్ని విడువకుండా చేస్తూ ఉండేటట్లు అనుగ్రహించాలి - అనేది విన్నపించ కుండానే వ్యక్తమవుతుందని భావం.

**108.** అవ :- విష్వక్సేనాది పరిజనులను తగిన కైంకర్యంలో ప్రవేశించేటట్లు నిత్యవిభూతిలో నియమించేవారు లక్ష్మీదేవియే- అని శ్రీరామానుజులే గద్యంలో అనుగ్రహించినందువల్ల భగవద్భాగవతాచార్యకైంకర్య సంపత్తు అంతా ఆమె అనుగ్రహం లేకుండా లభించదు. అంతేకాక, **"పూమన్ను మాదు పొరున్దియ మార్బన్"** అని ప్రారంభించిన రీతిలో లక్ష్మీదేవితో భగవానుని చేర్చి కీర్తిస్తారు - అనే కారణంచేత నమ్మాళ్వార్లపట్ల చక్కగా అభినివేశాన్ని పొందినవారు శ్రీరామానుజులు. భగవానుని తెలిపే ప్రమాణాలు అన్నీ పిరాట్టినికూడా తెలుపుతాయి- అని ఉపదేశించినవారు. ఈరీతిలో తత్త్వహితపురుషార్థాలు మూడు పూర్తిగా వెలిగేవారు ఈ దివ్యదంపతులు - అనే వాస్తవాన్ని తెలిపినందువల్ల భగవద్రామానుజుల విషయంలో పెరియపిరాట్టికి విశేషాభిమానం. ఒక పంగునిమాసం ఉత్తరానక్షత్రం నాడుకదా వీరు లక్ష్మీదేవిని పురస్కరించుకొని శ్రీరంగ నాథునివద్ద గద్యాన్ని విన్నపించి శరణు వేడారు. అందువల్ల భగవద్రామా నుజుల శ్రీచరణాలు మన శిరస్సులలో నిత్యంగా వెలిగేటట్లు అనుగ్ర హించాలని లక్ష్మీదేవినే ప్రార్థిద్దాం- అని పల్కి ముగిస్తున్నారు. శ్రీరామానుజుల చరణపద్మం మన్నికగా ఉంటే శ్రీవైష్ణవులమైన మనం లక్ష్మీదేవిని కీర్తించే స్థితి పొందవచ్చు. ప్రారంభ పాశురం భగవానుని పొందిస్తుంది- అని కూడా భావం.

**అంగయల్ పాయ్ వయల్ తెన్నరంగన్, అణియాక మన్నుమ్**
**పంగయమామలర్ ప్పావైయై ప్పోట్రతుమ్, పత్తి యెల్లామ్**
**తంగయతెన్న త్తళైత్తు నెంజే ! నన్దలైమిశైయే**
**పొంగయ కీర్త్తి!, ఇరామానుశనడిప్పూ మన్నవే.**

నెఞ్జే = నా మనసా!, పొఙ్గియ కీర్త్తి = పైపైకి వృద్ధిచెందే కీర్తిని



కల, ఇరామానుశన్ = శ్రీరామానుజుల, అడి పూ = శ్రీచరణపద్మాలు, నమ్ తలై మిశై = భగవద్భాగవతాచార్య భక్తులన్నీ, తఙ్గియదు = గూడుకట్టుకొన్నాయి, ఎన్న = అని పొగడేటట్లు, తళైత్తు = బలిసి, పుష్టిని పొంది, మన్న = స్థిరంగా వెలిగేటట్ల, (లేక) వెలిగినందున, అమ్ శెయల్= అందమైన చేపలు, పాయ్ వయల్ = వేగంగా తిరిగే సస్యక్షేత్రాలను కల, తెన్ అరఙ్గన్ = అందమైన శ్రీరంగానికి నాథుని, అణి ఆకమ్ = అందమైన వక్షఃస్థలంలో, మన్నుమ్ =నిత్యవాసం చేసే, పఙ్గయమ్ మా మలర్ = తామరపూవు అనే గొప్ప పూవులో ఉదయించిన, పావైయై = లక్ష్మీదేవిని, పోట్రదుమ్ = మనం ప్రార్థిద్దాం.

భగవద్రామానుజుల శ్రీచరణయుగ్మం మన శిరస్సులో నిలచి ఉంటే, మనకు భగవద్భాగవతాచార్యులు అందఱిపట్ల భక్తి పెరుగుంది. **"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్, అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్"** (విష్ణువును వినడం, కీర్తించడం, స్మరించడం, పాదాలను సేవించడం, అర్చించడం, నమస్కరించడం, దాస్యం, ఆత్మ నివేదనం) అనే రీతిలోని భక్తి ప్రకారాలు అన్నీ ఇక్కడ కల్గుతాయి- అని అనవచ్చు. భగవానునిపట్ల భక్తిమొదలైనవి సిద్ధించడానికి ఆచార్యాను గ్రహాన్ని అపేక్షించేటట్లే, ఆచార్య విషయంలో అన్నీ సిద్ధించడానికి భగవానుని వేడడం యుక్తమే. దానికంటే అనుగ్రహమే రూపొందిన పిరాట్టిని ప్రార్థించడమే శ్లాఘ్యం. ప్రార్థన లేకపోతే ఫలం సిద్ధిస్తుంది- అనే నిశ్చయం లేదు. పిరాట్టి విషయం అయితే అది ఫలించడం నిశ్చయం- అని పిరాట్టినే కీర్తిద్దాం- అని భావం. **"జలాన్మత్స్యాదివోద్ధృతా"** (జలంనుండి బయటకు తీయబడిన చేపలవలె) అనే రీతిలో విడువరాని భక్తులు **"అఙ్కయల్కళ్"** - అని భావం.

1) మహాపూర్ణమాలాధరాద్యోపదిష్టా -
ధికస్ఫూర్తిసంమాన్యమేధాసమృద్ధః ।
అశేషాన్ ప్రబంధాన్ ప్రచార్యావనౌ యః
ప్రతీతో యతీశః స్తుతోసౌ యథావత్ ॥

2) అసౌ వేదబాహ్యాన్ కృతాంతాన్ షడేవం
షడన్యాన్ కుతర్క శ్రుతిజ్ఞోపక్లుప్తాన్ ।
అథాద్వైతమార్గత్రయం శైవభేదాన్
అపాస్యన్ యతీశో రమేశాంఘ్రిసక్తః ॥

3) సంగృహ్య వేదార్థ మసౌ హి గీతాం
శారీరకం చాక్షరశో వివృణ్వన్ ।
శ్రుత్యంతసారగ్రథనైర్విశిష్టా-
ద్వైతం మతం స్థాపితవాననాది ॥

4) ఏవంభూతయతీశపాదకమలప్రావణ్యపూరోద్గమః
శ్రీరంగామృతసూరిసూక్తి రసపైః దివ్యప్రబంధై స్సహ ।
ఐకాసన్య మవాపితేయ మఖిలాంస్తాం తద్ యథైనాం తయా
వ్యాకార్షీదితి వీరరాఘవకృతీ వాత్స్యో నవోదేశికః ॥

5) భక్తానుకంపేద్ధగురూద్ధసూరి -
వ్రజావదాతశయలంభితాత్మా ।
కృపార్ద్రలక్ష్మీహయవక్త్రహేషా
ప్రబంధరక్షా జయతాదిహైషా ॥

6) సదివ్యసూరివ్రజనిత్యముక్త-
గోష్ఠీభి రాచార్యపరంపరాభిః
అన్యైశ్చ పూర్ణస్య రమాసఖస్య
ప్రబంధరక్షాస్తు ముదే సదేయమ్ ॥



శ్రీపరమహంసపరివ్రాజక శ్రీరంగరామానుజ మహాదేశిక దాసులైన, ఉత్తమూర్ తిరుమలై నల్లాన్ చక్రవర్తి అభినవ దేశిక వాత్స్య వీరరాఘవాచార్యులవారు రచించిన ప్రబంధరక్షావ్యాఖ్యానమ్ సంపూర్ణం.

